ఓం.

# శుకబ్రహ్మకైవల్యము

అను

# శ్రీ శుకమహాఋషిచరిత్రము

వచనకావ్యము.

ఇది,


శ్రీసద్గురు - శ్రీమాన్

పోకల - శేషాచలాహ్వయులవారి ప్రియశిష్యుండగు

అపరోక్షానుభవి

వకుళాభరణపరదేశిగారిచే


రచియింపఁబడి


వెస్టువార్డు అండు కంపెని వారి,

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడినది.

చెన్నపురి.





దీనివెల] 1953 [1—4—0

# అగస్త్యప్రోక్త వైద్యశాస్త్రము.

తొల్లింటి పెద్దలు భగవన్నియమంబుచే ననేకశాస్త్రంబుల ననేకవిధంబుల రచించి యున్నవారు. లోకరక్షణార్థమై యుత్తరంబుననుండి దక్షిణంబునకు వచ్చిన యగస్త్య మహర్షి తాను నెలకొన్న ద్రావిడదేశంబున కుపకరించునటుల నాభాషను శాసించి యందు వైద్యగ్రంథముల రచించెను. అందు ననుభవ వైద్యంబగు నొక్కశాస్త్రము నకు "స్వరూపానంద స్వాములను" నొక మహాపురుషుండు తెలుగున దర్జుమాచేసెను.

ఈ గ్రంథంబున సంక్షేపంబుగ జెప్పబడియుండిన గర్భధారణాదులను, నాడీ భేదంబులను, యంత్రములను. పుటంబులను, శుద్ధులను వివరంబుగ బెంచి చేర్పబడియున్నది. ఇదియుగాక పిండోత్పత్తి ప్రకరణము, నాడీ ప్రకరణము, పండిత లక్షణాది ప్రకరణము, నాడీవిశేష లక్షణ ప్రకరణము, యంత్ర ప్రకరణము, పుటప్రకరణము, శుద్ధి ప్రకరణము, ఔషధ ప్రకరణము, భస్మ ప్రకరణము, లేహ్య ప్రకరణము, మాత్ర ప్రకరణము, తైల ప్రకరణము, కషాయ ప్రకరణము, శత్రు మిత్రులైన ఔషధము, 64 పాషాణములు. సత్తు చేయు విధానము, ఉపరసములు 160-న్ని సతుచేసేవివరము, కారసారములు మున్నగునవి గలవు. ఇది వైద్యశాస్త్రంబు నభ్యసించు వారికేగాక వైద్య పండితులకును సహాయ కారిగా యుండును. సుమారు 194 పేజీలు గలది. వెల 2 0 0

# శ్రీకృష్ణరుక్మిణీ సంవాదంబను సుజ్ఞానశాస్త్రము.

ఈగ్రంథమునగల విషయములు:— ద్వారకాపురవర్ణన, శ్రీకృష్ణరుక్మిణీ సంవాద ప్రారంభము, సాధనచతుష్టయములు, చతుర్విధ పురుషార్థ లక్షణములు, గురుమూర్తి ప్రభావము, దైవ లక్షణము, భాగవతలక్షణము, జీవహింస లక్షణము, ఆశ్రమ లక్షణము, కుల లక్షణము, పిండోత్పత్తి లక్షణము, ప్రాప్తకర్మ లక్షణము, భక్తి లక్షణము, కర్మ లక్షణము, యమదండన వివరము, యోగ లక్షణము, అష్టాంగ లక్షణము, పంచముద్రల లక్షణము, ప్రపంచోత్పత్తి లక్షణము, సాంఖ్య లక్షణము, తారక లక్షణము, జీవాత్మ పరమాత్మ లక్షణము, తనుచతుష్టయ నిర్ణయము, షట్చక్ర నిర్ణయము, హంస లక్షణము, భగవంతుని విశ్వరూప లక్షణము, కాలప్రమాణ లక్షణము, మిథ్యాజగల్లక్షణము, మరణ చిహ్నములు, అచలభావము మున్నగునవి గలవు. వెల 1 4 0

# వేదాంతరహస్య దర్పణము పతివ్రతల కథలు.

ఇందు జ్ఞానసుందరి వివేకసుందరికిం జెప్పిన నూతనవిచిత్ర పతివ్రతల కథ లనేకము గలవు. ప్రతి కథయందును అనేక వేదాంత రహస్యములుగల శ్రుతి ప్రామాణ్యములతో తేట తెలుగులో వ్రాయబడియున్నది. ఈ గ్రంథమును ప్రతివారు తప్పక చూడదగినది. అక్షరజ్ఞానముగల ప్రతిస్త్రీయును ముఖ్యముగా పఠింపవలయు ననుటకు సందేహము లేదు.

వెల 1 0 0

---

వెస్టువార్డు అండు కంపెని, చాకలపేట, మదరాసు-21

| విషయసూచిక. | పుటసంఖ్య. |
|---|---|




# అవతారిక.

సోదరసోదరీమణులారా! పరబ్రహ్మానందానుభవ జిజ్ఞాసువులారా! నిత్యానందదాయకమును, సంసారసాగర తరణోపాయతరణియును, తాపత్రయవల్లికాలవిత్రమును, నగు పరమపరతత్త్వవిద్య, దేవనిర్మాణమై ఋషిపుంగవవిక్తమై సంస్కృతభాషయందు వేదాంతపండితగోచరమై వెలయుచున్నది. కాని యయ్యది పామరజనులకును స్త్రీ జనములకును నెఱుంగ దూరస్థమైయున్నది. అట్టిగో ఱతను వారింపఁబూనియును లోకముమాయి కత్వమున గాఢాంధకారమున మ్రింగబడక దివ్యదృష్టినలరింప యత్నించి యనుమహాత్ముఁడును, పరతత్త్వవిద్యారహస్యవేదియును, నిత్యానందపరవశుఁడును నగు శ్రీ శ్రీ వకుళాభరణపరదేశిగారిచే నాబాలగోపాలము సుబోధముగను తెల్లముగను తేటమాటలతోడను ఆత్మాకర్షకముగను ఉపనిషత్సారసర్వస్వముగను అనుభవసిద్ధముగను శ్రుతిస్మృతిసంభావ్యముగను భగవద్గీత భారత భాగవత రామాయణాది అష్టాదశ పురాణతేజోమయముగను శ్లోకపద్యతాత్పర్య సహితముగను ప్రశ్నోత్తర వివేచనాయుక్తముగను పాఠక మహాశయహృదయాహ్లాదజనకముగను వచఃకావ్యముగను రచియింపఁబడినది.

ఇయ్యది బ్రహ్మవిద్య నభ్యసింపఁ బూనువారలకు నాచార్యునివంటిది యని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఇందు సాంఖ్యతత్త్వపంచీకరణమును నతివిపులముగా విమర్శింపఁబడి యున్నది. దీనిని చదువువారు సాంఖ్యతత్త్వపంచీకరణ విచారణయందు సందేహరహితు లగుదురనుట అతిశయోక్తికాదు. ఆయాఘట్టములయందు సందర్భాను కూల్యముగ పెక్కుచోట్ల ననేక ప్రామాణికశ్లోకములను పద్యములను దహరింపఁబడి యున్నది. కావున నీసద్గ్రంథమును పుణ్యాత్ములైన మీరలుకొని చదివి యిందలి సారమును గ్రోలి యానందింతు రనియు నాలాగే, తమ బంధుమిత్రులకును తీసి యిచ్చి చదివి సంతోషించునట్లు చేయుదురనియును నమ్ముచున్నాము.

ఇట్లు,

వెస్టు వార్డు అండు కంపెని,

చాకలిపేట, మదరాసు-21.

ఓం.

తత్ సత్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.



# శుకబ్రహ్మకైవల్యము.

అను

# శ్రీ శుకమహాఋషిచరిత్రము.

---

## పరబ్రహ్మధ్యానము.

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ, నిర్గుణాయ గుణాత్మనే।
సమస్తజగదాధార, మూర్తయే బ్రహ్మణే నమః॥

## త్రిమూర్తిధ్యానము.

శ్లో॥ శ్రీవాణీ గిరిజా శ్చిరాయదధతో వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్।
తే వేదత్రయమూర్తయ స్త్రీపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రియసే॥

## శ్రీరామచంద్రధ్యానము.

శ్లో॥ సీతామనోమానస రాజహంస, సంసారసంతాపహర క్షమాళో।
శ్రీరామ దైత్యాంతక శాంతరూప, శ్రీతారకబ్రహ్మ నమో నమస్తే॥

## శ్రీకృష్ణమూర్తిధ్యానము.

శ్లో॥ కస్తూరితిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభమ్
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళీ
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః॥

## శ్రీ ఆంజనేయ ధ్యానము.

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననం, కాంచనాద్రి కమనీయవిగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం, భావయామి పవమాననందనమ్॥

## శ్రీ వేదవ్యాస ధ్యానము.

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం, శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే, శుకతాతం తపోనిధిమ్॥

## శ్రీ సద్గురు స్తుతి.

శ్లో॥ యస్య ప్రసాద దహ మేవ విష్ణుః, మయ్యేవ సర్వం పరికల్పితంచ ।
ఇత్థం విజానామి సదాత్మరూపం, తస్యాంఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యం॥

---

# ఉపరిచరవసుమహారాజు కథ.

శ్రీమంతంబై యొప్పు యీ భూమండలంబున చేదిదేశమును వసు మహారాజు పాలించుచుండెను. అతడు నిత్యసత్యవ్రతుండును నజాత శత్రుండును దశదిగంతవ్యాప్తయశోవిశాలుండును సజ్జనసంగుండును నిర తాన్న దానాది సకలప్రదుండును దీనజనరక్షకుండును శిష్టజన సంరక్ష కుండును దుష్టజనశిక్షకుండును దేవతాభక్తుండును నాశ్రితజనవత్సలుం డును దేవేంద్రసమానుండునై ప్రజాపాలనంబు సేయుచుండెను. అత డొకనాడు వేటాడుటకై వనంబునకు జని అందొక మహాత్మునియాశ్రమం బును జేరి ఆ యాశ్రమంబు పరిశుద్ధ మధుర జలపూర్ణంబులగు తటాకం బులచేతను నానావిధ ఫలకుసుమభరితంబులగు వృక్షంబులచేతను; పుష్ప లతలచేతను, శుకపికాది పక్షులచేతను నిండి రమణీయంబుగా నుండుటం జూచి అది తపస్సుచేయుటకు తగిన చోటని యెంచి వేటాడుట విడిచి అచ్చట దేవేంద్రునింగూర్చి ఘోరతపంబు చేయుచుండెను. దేవేంద్రుం డతని తపంబునకు మెచ్చి దేవగణంబులతోడ నతనియొద్దకువచ్చి ప్రత్య క్షంబై యిట్లనియె. రాజేంద్రా! నీవు రాజ్యభోగంబులను విడిచి యీ యరణ్యంబున నిట్లు ఘోరమైన తపంబు చేయుటకు నేను చాలా మెచ్చి

తిని, నామనంబున మిగుల సంతోషంబు జెందితిని. నేటిదినము మొదలు నీవు నాతో స్నేహము జేసి నాయొద్దకు వచ్చుచుం బోవుచు రాజ్యంబు నేలుచుండుము. అని కనకరత్నమయం బగు నొక దేవ విమానంబును, శత్రురాజులబాణంబులు దనపై సోకకుండునట్లు యింద్రమాలిక యనెడి కమలమాలికను, దుష్టనిగ్రహ శిష్టరక్షణంబు సేయునట్టి ఒక వేణుదండ మును అతనికి బహుమానముగా నిచ్చి స్వర్గంబును జేరెను. అంత నా వసుమహారాజు ఆ విమానంబు నెక్కి ఊర్ధ్వలోకంబు లైన దేవలోకంబు లందు సంచరించుటం జేసి అతనికి ఉపరిచరవసుమహా రాజనునట్టి పేరు గలిగెను. అతడా కమలమాలికను చిహ్నంబుగా ధరించి ఆ వేణుదండం బునకు యేటేట మహా విభవంబుతో నింద్రోత్సవంబు జేయుచుండె. అదిమొదలు తక్కినరాజులును ఆ ప్రకారమే యేటేట యింద్రోత్సవము జేయుచుండిరి. ఆయుత్సవము చేయుటవలన రాజులకు సకల సంపదలును పుత్రసంతానములును ఆయురారోగ్యంబులును ప్రజాభివృద్ధియుగలుగు చుండెను. ఆ యింద్రోత్సవంబువలన అతిప్రీతుండైన దేవేంద్రుని వరం బున ఆవసుమహారాజునకుబృహద్రథుండు. మణివాహనుడు, సాబలుడు యదువు మొదలగు పుత్త్రులు గలిగిరి. వారిని వేఱువేఱుగా పెక్కు దేశం బులకు పట్టాభిషిక్తులుగాఁ జేసి తదనంతరం బా రాజేంద్రుండు రాజ ఋషియై తనదేశంబును పాలించుచుండెను. ఇట్లుండగా నా దేశంబునకు సమీపంబున శుక్తిమతి యనెడి ఒకనదిమీద కోలాహలం బను మహా పర్వతము మోహించి తటాలున దానిమీదబడి సంభోగించుచు అల్ల కల్లోలముగా జేయుచుండ నది తాళజాలక హద్దుమీఱి భయంతయు వెల్లువగా ప్రవహింపగా ఆ వెల్లువవలన సమీపమందుండు ఊరు పల్లెలు దేశములు జలమయమై పోగా జనులు నిలచుటకు చోటు లేక దుఃఖిం చుచు వసుమహారాజుయొద్దకుంబోయి మొఱపెట్టుకొనగా, అతడు అధిక క్రోధావేశముతోడ ఆ నది సమీపంబునకుం బోయి పూలచెండు వెగ మీటునట్లు తన కాలి గోటికొనచేత ఆ పర్వతమును యెగమీటి తన్ని త్రోయగా అది ఆనదీ మధ్యప్రదేశంబును విడిచి గట్టునం బడెను. ఇట్లు పర్వతం బానదితో భోగించుటవలన ఆనది గర్భంబు ధరించి వసుపదుం

డను పుత్త్రుని గిరిక యనెడి పుత్త్రికను కనెను, ఆ శుక్తిమతీనది తన్ను కోలాహల పర్వతంబు అడ్డగించుటను మాన్పినందులకై వసుమహారాజునకు తాను గన్న రెండు బిడ్డలను కానుకగా నిచ్చినంతనే అతడు వసుపదుని తనకు సేనానాయకునిగా నియమించుకొని గిరికాదేవిని ఋతుమతియైనంతనే దీనికి మృగమాంసంబు దెచ్చిపెట్టుమని ఆవసుమహారాజుతో తన పితృదేవతలు చెప్పగా, నతడు వేటాడుటకై వనభూమికిం బోయి అచ్చట నాగిరికాదేవియొక్క ముద్దుపలుకులను విశాలమైన కమలముల వంటి కన్నులను తిలపుష్పమువంటి నాసికను దొండపండువంటి యధరంబును మల్లెమొగ్గలవంటి దంతంబులును లేనగవులతోగూడిన ముఖంబును కనకకలశంబువంటి కుచద్వయంబును భ్రమరములవంటి నల్లని మెఱుంగు నెరికురులను అపరంజివంటి దేహకాంతియును మత్తగజమువంటి నడలును యౌవనమును పలుమారు దలచి తలచి దానిమీద తన మనస్సు నిలుపుటవలన మోహ మధికరించి అతనికి వీర్యము స్ఖలించెను. అంత నా రాజేంద్రుండు ఆ యింద్రియమును ఒక ఆకుదొన్నెయందు పట్టి ఒకడేగయొక్క మెడలో గట్టి దీనిం గొనిపోయి నా భార్యయగు గిరికాదేవికిమ్మని పంపగా నాడేగ వాయువేగంబుగా వనంబునుదాటి యమునా నదిమార్గంబుగా నాకాశమందు యెగిరిపోవుచుండగా మఱియొక పక్షి ఆ యింద్రియంబును మాంసంబని భ్రమించి దాని నడ్డగించి ఆ రెండు పక్షులును యొకటితో నొకటి కలహించుచుండగా నా దొన్నెనుండి వీర్యము జాఱి వాయువశంబున యమునా నదిలో బడెను. పూర్వము బ్రహ్మ శాపంబున అద్రిక యను అప్సరస్త్రీ యొకతె ఆనదిలో మత్స్యమై పడియుండగా అది ఆ వీర్యమునందు రెండు బొట్టులను ద్రాగి గర్భము దాల్చెను. నంత దశమాసంబులు నిండినంతనే ఒకనాడొక బెస్తవాడు ఆ నదిలో వలవేసి ఆ మత్స్యమును బట్టి దానియుదరంబును చీల్చి అందు ఒక పుత్త్రుని ఒక పుత్త్రికను జూచి ఆశ్చర్యపడి ఆబిడ్డలను దాశరాజునకు యిచ్చెను. తర్వాత ఆయప్సరస్త్రీ తనకు మానుష ప్రసవంబు గలిగినతోడనే శాపవిమోచనంబగునని బ్రహ్మదేవుడు చెప్పియుండుటవలన అది మత్స్యరూపంబును విడిచి దివ్య సుందరమైన స్త్రీ యగుచు దేవలోకంబును జేరెను.

మత్స్యంబు కడుపునం బుట్టినపుత్రుడు మత్స్యరాజను పేరొంది మత్స్య దేశం బునకు రాజై పాలించుచుండెను. తర్వాత దాశరాజు ఆ యాడబిడ్డను తన



పరాశరమహాఋషి.



మత్స్యగంధి.

వేదవ్యాసుల అవతారము.

పుత్రికగా జేసికొని పెంచుచుండగా నా చిన్నది బాలచంద్రునిరీతిగా నా నాట వృద్ధిబొంది సత్యవతి యనియు మత్స్యగంధి యనియు పిలువబడుచు తనతండ్రియగుదాశరాజుయొక్క అనుమతిని ఆయమునానదిని ఓడనడుపు చుండగా వసిష్ఠమహాఋషి పౌత్రుండును శక్తిమహాఋషి పుత్త్రుండును నిర్మోహుండును నిరహంకారుండును మహాయోగపురుషుండు నగు పరా శర మహాఋషి తీర్థయాత్ర చేయువాడై ఆ యమునానదియొక్క ఓడ రేవున ఆ చిన్నదానిం జూచెను. ఇట్లు ఏకవస్త్రయై ఒంటరిగా నిలబడుచు వోడ నెక్కవచ్చువారిని యెదురుచూచుచుండిన ఆ చిన్నదాని సౌందర్యం బును జూచి మోహపరవశుండై! యోగదృష్టిని దాని జన్మప్రకారంబు తెలిసికొని ఆనావ నెక్కి దానితోగూడనొక్కటిగాబోవుచు దాని నేత్రము లుండెడి అందమును జూచుచు సుందరంబైన చన్నుదోయిని జీర తమక పడుచు ఇసుకదిన్నెలవంటి గొప్పపిఱుందులపై దృష్టి నిలుపుచు మిక్కిలి అభిలాషతో దానితోసరసముగామాట్లాడి ప్రత్యుత్తరమునుఅతిప్రీతితో

వినుటకు ఉత్సహించుచు ఆ చిన్నది మిగుల లజ్జచే ముఖము క్రిందుగా వంచికొనియుండ దానిపై బడి సిగ్గును పారద్రోలుటకు ప్రయత్నించుచు ఇట్లు కామాంధకారమునం దగిలియుండెను. [ఆ-వె-పద్య॥ ఎంతశాంతులయ్యు నెంతజితేంద్రియు।లయ్యు గడువివిక్తమైనచోట। సతులగోష్ఠిచిత్తచలనమొందుదురెందు కాముశక్తి కోర్వగలరె జనులు॥] ఎంత శాంతచిత్తులయ్యును ఇంద్రియములను జయించిన మహాధీరులైనను యేకాంతస్థలమున స్త్రీలననుసంధించి రేని వారి చిత్తము చపలించును, కాముని శక్తి యెట్టివారును దాళజాలరు. అనునట్లు ఇంతటి మహానుభావుండును మహాయోగ సంపన్నుండును నైన పరాశర మహాఋషి [కామాతురాణాం నభయం నలజ్జా॥] అనునట్లు కామాతురంబున కొంచెమైనను సిగ్గులేనివాడై తన యభిప్రాయమా చిన్నదానితో చెప్పగా అది ఇందుకు సమ్మతింపకున్న యెడల అతడు శపించు ననుచు భయపడి యిట్లనియె. ఓ మహాత్మా! నేను బెస్తదానను, నా దేహము చేప నీచు వాసనగానున్నది, ఇంతేకాదు నేను కన్యను, కన్యావ్రతభంగము కలిగిన యెడల నేనెట్లునాతండ్రివద్దకిపోగలను, నాయందు పూర్ణానుగ్రహముంచి దీనికి సదుపాయంబు చెప్పవలయునని వేడుకొనగా ఆపరాశరుండు సంతోషించి, ఓసుందరాంగీ! నీవు నాయభీష్టము నెఱవేర్చుము, నీకన్యాత్వంబునకు భంగంబు లేనట్లు వరమిచ్చితిని, నీవు వసుమహారాజుయొక్క వీర్యంబున బుట్టినదానవునీవు బెస్తవారికన్యకవుగావు అని దాని జన్మవృత్తాంతమంతయు జెప్పి, నూరు యోజనముల వఱకు దాని శరీరమంతయు పరిమళము వీచునట్లు అనుగ్రహించి గంధవతి, యోజనగంధి అనెడి పేరు పెట్టి తనయోగమహిమవలన దానిని దివ్యాంబరభూషణ భూషితగా జేసి యమునా నదీద్వీపంబున నే ఓడయందు దానితోడ సంభోగంబునుగోరగా ఆచిన్నదిసిగ్గుపడుచు స్వామీ! మునివర్యా! ఈద్వీపమునగట్టున సకలజనులు సంచరించుచున్నారే, ఎల్లవారు జూచుచుండ నిట్టి బయలున యెట్లు సంభోగింపవచ్చు ననగా పరాశరుండు తనయోగ మహిమవలన యెల్లవారి నేత్రములకు గాఢాంధకారము క్రమ్మునట్లుగా జేసి ఆచిన్నదానితోడనె పరమానందంబుగా రతిక్రీడ సల్పెను. అంత బ్రహ్మదేవునకు సమానుడగు ఆ పరాశరమహార్షి సంగంబువల్ల ఆ చిన్నది సద్యోగర్భంబు ధరించె.

ఆమె గర్భమునందుండి సూర్యతేజుండును వేదమయుండును మునిశ్రేష్ఠుండును మహాజ్ఞానసంపన్నుడునైన శ్రీ వేదవ్యాస మునీశ్వరుడు జన్మించెను. ఆ యమునానది ద్వీపమునందు శ్రీకృష్ణమూర్తి వసించుటంబట్టి ఆ వేదవ్యాసుడు కృష్ణద్వైపాయను డనుపేర ప్రసిద్ధిజెందెను. తర్వాత పరాశరుండు మత్స్యగంధికి కోరినవరమిచ్చి నిజేచ్ఛం జనియె. అనంతరము శ్రీ వేదవ్యాసుండు దండకమండల జటావల్కల కృష్ణాజినంబులతో డదనతల్లికి సాష్టాంగంబుగా నమస్కరించి, అమ్మా! నీకు పనిగల యప్పుడు నన్నుం దలంచినయెడల ఆ క్షణంబె వచ్చెద నని నమ్మబల్కి ఆమె యనుమతిని తపోవనంబునకుం బోయి ఘోరతపంబు సేయుచు ఈశ్వరానుగ్రహంబున నాలుగు వేదములు యెల్లవారికి చక్కగా అర్థమేర్పడునట్లు విభాగించి ఈ భూలోకంబున ప్రసిద్ధిజేయించినందున, అతనికి వేదవ్యాసుండను పేరుగలిగెను. మఱియు పంచమవేదమైన భారత మను సంహితను రచించెను. అతడు పరాశరపుత్రుండు గాన పారాశర్యుం డనియు సత్యవతి పుత్రుండు గాన సాత్యవతేయుం డనియు చెప్పంబడును.



వేదవ్యాసులు తపస్సు చేయుట.

### శ్రీ శుకులవారి అవతారము.

శ్రీకరం బగుచు నవరత్నమయంబై స్వర్ణపర్వతంబన ఘనతకెక్కిన మేరుపర్వతము సకలదేవగంధర్వ కిన్నరకింపురుషసిద్ధసాధ్యాది మునిగణంబులకుం నాశ్రమస్థానంబుగా నుండును. అందు ఒకానొక గుహాయందు కైలాసాకార మనెడు దివ్యమైన శృంగారవనం బొకటి గలదు. ఆ వనమున పార్వతీసమేతంబుగా సకలశివగణంబులు దన్ను గొలుచుచుండ పరమేశ్వరుండు క్రీడావినోదియై వుల్లాసంబుగా సంచరించుచుండెను. మునిశ్రేష్టుండగు వేదవ్యాసుండు ఆ వనంబును జేరి తనకు పుత్రసంతానమును గోరి పరమశివునింగూర్చి యోగబలముతో మహోవుగ్రమైన తపస్సుచేయుచుండెను. అశ్వమేధయాగములు వేలకొలదిగా జేసినను అతని తపస్సునకు సమానము గాజాలదు. పరమశివుం డతని తపస్సును పొగడి ప్రత్యక్షమై ఓ ఋషివర్యా! నీ తపంబునకు మెచ్చితిని నాకు చాలా సంతోషమాయెను. నీకు కావలసిన వరంబులను వేడుము యిచ్చెద ననగా నప్పుడు వ్యాసుండు పరమానందంబును బొంది పరమశివునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, ఓ పరమేశ్వరా! దీనదయాళో! భక్తవత్సలా! పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము లను పంచభూతములతో సమానం బగు తేజోబలంబునుగలిగి జ్ఞానసంపన్నుండుగా నుండు పుత్రుండు నాకు గలుగునట్లు కటాక్షింపవలయు నని ప్రార్థింపగా, ఆ భగవంతుండు కరుణాంతరంగుండై నీవు కోరినట్లే వరమిచ్చితి నని పలికి ఆశీర్వదించి అంతర్థానుం డాయెను. అనంతరము వ్యాసమహాఋషియుం తన ఆశ్రమంబును జేరి యథారీతిగా హోమంబు జేయుటకుగాను అగ్నిని పుట్టింప దలంచి హోమకట్టెలను జిలుకుచుండగా నా సమయంబున ఘృతాచి యనెడి అప్సరసస్త్రీ యొకతె ఆ మునీశ్వరునకు సమీపంబున క్రీడావినోదంబుగా సంచరించు చుండెను. వ్యాసుండు దానిం జూచి దాని సౌందర్య రూప లావణ్యంబులకు ఆశ్చర్యానందభరితుండై కామవికారంబును జెందగా ఆ సుందరీమణి అతని యభిప్రాయ మెఱింగి కపటముతో తన నిజరూపంబును మఱుగుపఱచి ఒక పంచవర్ణ చిలుకరూపమునుధరించి అతని సమీపంబునుంజేరి అందమైన కులుకునడలతో సంచరించుచు మధురముగా బలుకు చుండెను. అంత వ్యాసుండు చలింపక దృఢబుద్ధితో కట్టెపుల్ల

లను మథించుచుండగా దనకు మోహంబు విశేషించి ఆ యప్సరసస్త్రీని తనమనంబునం దలంచుచుండుటవలన దనకు యింద్రియంబు స్ఖలన మాయెను. ఆ యింద్రియంబు తాను మథించుచుండిన కఱ్ఱపుల్లమీదం బడెను. ఇట్లు ఇంద్రియము స్ఖలించినప్పటికిన్ని అతడు చలింపక ఆకఱ్ఱలనుమథించుచుండగా పరమపావనుండును బ్రహ్మస్వరూపుండును నగు శ్రీ శుకుండు ఆగ్రమానునందు బుట్టి తన తండ్రి యగు వేదవ్యాసునితో సమానం బగు రూపంబును తేజంబును జ్ఞానంబును గలవాడై యాగకుండమున సమృద్ధముగా హవ్యకవ్యములను గొని వెలుంగు పరమపావనుండైన మహాతేజోవంతుం డగు అగ్నిహోత్రుని రీతిగా వెలుంగుచుండెను. అప్పుడు గంగానది పరమానందంబును బొంది స్త్రీరూపంబుతోడవచ్చి ఆ శుకునికి మంగళస్నానంబు గావించెను. ఆకాశమందుండి కృష్ణాజినమున్ను యోగదండమును అతనియెదుట పడెను. మఱియు ఆకాశవీధిని గంధర్వులు గానమును రంభాది దేవతాస్త్రీలు నాట్యమును జేసిరి. దేవదుందుభులు మ్రోగెను. దేవతలందఱు జయజయ అని కోలాహలంబుగా అతని శిరస్సుపై పుష్పవర్షమును గురిపించిరి. ఇంద్రాది అష్టదిక్పాలకులున్ను ఆ మహాత్ముని దర్శించుటకుగాను వచ్చిరి. అప్పుడు పార్వతీ సమేతంబుగా పరమశివుండును వచ్చి అతనికి ఉపనయనంబు గావించెను. ఇంద్రుండు కమండలంబును కానుకగానిచ్చెను. తక్కిన దేవతలుయెన్నటికినిమాయని దివ్యమైనవస్త్రంబులు నిచ్చిరి. ఆ వనంబునందుండు మృగములు పక్షులు మొదలగుజంతువు లన్నియు ఆ పుణ్యాత్ముండు జన్మించినందుకై మిగుల సంతోషించెను. ఆ శుకుండు పుట్టినతక్షణంబె నాలుగు వేదములును తన తండ్రియగు వ్యాసుని జేరినరీతిగా అతనిం జేరెను. ఆ శుకునికి దేవగురుం డగు బృహస్పతి వేదాధ్యయనము చేయించెను. నా శుకుండు సకల వేదశాస్త్రములుచదివి వేదవేత్త యగుచుబ్రహ్మచర్య వ్రతనిష్ఠాపరుండై యుండెను. తర్వాత సకల దేవతలచే కొనియాడదగిన ఆ శుకుండు తన తండ్రియగు వేదవ్యాసుని ఆశ్రమంబునకు వచ్చి అతనివెంట దిరుగుచు అచ్చటనుండి మునికుమారులతో ఆటపాటల మరగియుండగా లోకుల రీతిగా నుండుచు ఆత్మానుసంధానము చేయనేరకుండు పుత్త్రునిం జూచి



శ్రీ వేదవ్యాస మహాఋషి.



శ్రీ శుకమహాఋషి.

## శ్రీ వేదవ్యాసులు శుకునకు ఉపదేశించుట.

వ్యాసుండు అతనికి భక్తి వైరాగ్య యోగ జ్ఞానముల బోధింపం దలంచి అతని బిలిచి దగ్గఱకూర్చుండ బెట్టుకొని, నాప్రియపుత్త్రుడా! నీవు శ్రీమహా దేవుని వరప్రసాదంబునం పుట్టినవాడవు గాన లోకమునందలి పామర జనులరీతిని నీవు ఆటపాటలందు వర్తించుచు తెలివిమాలియుండదగదు. [శ్లో॥ జాతస్యహి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్యచ। అద్య వాబ్దశతాంతేవా, మృత్యుర్వై ప్రాణినాం ధ్రువమ్॥] పుత్త్రా! పుట్టిననాడు చావకమానడు చచ్చినవారు మరల పుట్టక మానడు. ఇప్పుడైనను లేక నూరేండ్లకైనను పుట్టినవారు చచ్చుట నిశ్చయము. కాబట్టి యిట్లు పుట్టుచు జచ్చుచు నరకంబున యమబాధలుపడకుండుటకై ఈ జననమరణ ప్రవాహమునుదాటి తప్పించుకొని ముక్తి పొందుటకుగాను ప్రయత్నపడవలయును.

## భక్తిమార్గము.

[భక్తియోగాన్ముక్తిః] అనుఉపనిషద్వాక్యమురీతిగాను, [మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ] అను ప్రమాణాము రీతిగాను భగవంతుని యందు భక్తిలేనివారికి ముక్తి గలుగదు. [శ్లో॥ మాంచయోవ్యభిచారేణ భక్తి

యోగేన సేవతే। సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే [అను భగవద్గీతరీతిని యెవడు భగవంతుని నిజభక్తితో సేవించుచున్నాడో వాడే ముక్తిని పొందగలడు. [శ్లో॥ ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా। మహాభయకృతత్రాణాత్ విప్రాణా ముపజాయతే॥] పుత్రా! ఈశ్వరానుగ్రహము లేనట్టివారలకు బ్రహ్మాద్వైతజ్ఞానము గలుగజాలదు. బ్రహ్మజ్ఞానములేని యెడల జననమరణ ప్రవాహంబును దాటి మోక్షంబును జేరుటకు సాధ్యపడదు. [శ్రుతి. కారణేనవినా కార్యంనోదేతి-భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాపి నజాయతే తస్మాత్ త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్య-భక్తిమాశ్రయ-భక్తినిష్ఠో భవ-భక్తినిష్ఠో భవ-భక్త్యాసర్వసిద్ధయస్సిధ్యంతి - భక్తేరసాధ్యం నకించిదస్తి - భక్త్యతిశయేన పక్వవిజ్ఞానం ప్రాప్య॥] అనెడి మహానారాయణోపనిషత్తురీతిగా కారణమువినా కార్యము లేనట్లు భగవంతునియందు భక్తి లేనివారికి బ్రహ్మజ్ఞానము గలుగజాలదు. కాబట్టి నీవు సర్వోపాయములను విడిచి భక్తిమార్గము ననుసరింపుము, భక్తినిష్ఠాపరుండ వగుము, భక్తినిష్ఠాపరుండవు కమ్ము. ఈశ్వరభక్తివలననే సకలసిద్ధులు పొందవలయును, భక్తివలన పొందగూడనిది యేదియును లేదు కాబట్టి భక్తివిశేషముచేతనే బ్రహ్మజ్ఞానమును పొందవలయును స్వామీ! [శ్లో॥ అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ॥] ఎవరు నాయందు భక్తిగలిగి నన్ను సేవించుచున్నారో వారికి అభయమిచ్చుచున్నాను, ఇదే నాకు మహావ్రతముగా నున్న దని శ్రీరాములవారి వాక్యమున్నది. [శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాంయేజనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥] ఎవరు నన్ను సత్యముగా నమ్మి నాయందు భక్తిగలిగి నన్ను ప్రార్థించుచున్నారో వారిని నేను సంసారమునందుండి తరింపజేయుచున్నానని శ్రీకృష్ణభగవానులు చెప్పియున్నారు. కాబట్టి సత్యముగా భగవంతునియందు దృఢభక్తిగలిగి

## భగవంతుని లక్షణము.

యుండవలయును. [శ్లో. ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్యయోశ్చైవషణ్ణాం భగ ఇతీరితాః॥ [అణిమాది అష్టైశ్వర్యములు. ధర్మము, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము ఈ యారున్ను భగ మనబడును. ఇవి గలవాడే భగవంతుడు. [శ్లో॥ ఉత్పత్తించ లయంచైవ భూతానా మాగతింగతిమ్। వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి॥] భూతములపుట్టుకను, నాశ

మును, రాబోయెడి సంపత్తును, రాబోయెడి ఆపత్తును, జ్ఞానమును, అజ్ఞానమును, యెవడెఱుంగుచున్నాడో వాడే భగవంతుడనబడును. [శ్లో. సర్వజ్ఞతాతృప్తిరనాదిబోధ స్స్వతంత్రతా నిత్య మలుప్తశక్తిః అనంతశక్తిశ్చ విభో ర్విధిజ్ఞా ష డాహు రంగాని మహేశ్వరస్య ] అనెడి కూర్మపురాణరీతిగాసర్వజ్ఞత్వము, సదాతృప్తి, అనాదిగానుండు పరిశుద్ధజ్ఞానము, స్వేచ్ఛావిహారము, మితిలేనిశక్తి, నాశము లేనిశక్తి, ఈయాఱుగుణములు గలవాడే యీశ్వరుండనబడును. మరియు సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వభోక్తృత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వస్రష్టృత్వము, సర్వపరిపాలకత్వము, సర్వసంహారకత్వాదిగుణములు గలవాడే భగవంతు డనబడును. (1) సర్వజ్ఞత్వమనగా—తానున్నచోటనేయుండుచుసర్వలోకములవ్యవహారములను తెలియుట. (2) సర్వేశ్వరత్వ మనగా—సకల జీవాత్మలకు తాను ప్రభువుగా నుండుచు తనయాజ్ఞప్రకారము యెల్లవారు నడుచుకొనునట్లు అధికారముచేయుట. (3) సర్వభోక్తృత్వ మనగా— తనవల్ల సృజింపబడిన జీవాత్మలుచేయు యజ్ఞాది సర్వపూజలను తానే పొంది అనుభవించుట. (4) సర్వాంతర్యామిత్వ మనగా—తాను తలచినమాత్రమున చేతనాచేతనమయం బగు ప్రపంచంబున సర్వత్ర వ్యాపించి యుండుట. (5)సర్వస్రష్టృత్వమనగా—[ఇచ్ఛామాత్రేణ ప్రభోస్సృష్టిః] అనునట్లుతాను తలచినమాత్రమున ప్రపంచంబు సర్వము సృజించుట. (6) సర్వపరిపాలకత్వమనగా—సకల జీవులను రక్షించుట. (7) సర్వసంహారకత్వమనగా—ప్రపంచము సర్వమును తాను తలచినమాత్రమున తనయందు లయించునట్లు చేసికొనుట. ఈగుణములు గలవాడేభగవంతుడనబడును.

[నరాజ్జాతాని తత్త్వాని నారాని-తస్యాయనం ఆశ్రయస్థానం-యస్యసః నారాయణః॥]

నరం అనగా నశింపనివస్తువు,అనగాపరబ్రహ్మము.అతనియందుండి పుట్టిన దేహేంద్రియాది ౨౪ తత్త్వములు నారము లనబడును. ఈ ౨౪ తత్త్వములతో గూడిన యీ శరీరమందు ఆ పరబ్రహ్మమే ఆపోజ్యోతి స్వరూపమగు ఆత్మగా, సర్వసాక్షిగా నివసించుచున్నాడు గాన నారాయణుడనబడును. అట్టి నారాయణ శబ్దవాచ్యుండగు శుద్ధనిర్గుణ పరబ్రహ్మమే [శ్రుతి॥ బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యాభిధేయ మాశ్రిత్య లోకాన్ సృష్ట్వా - ప్రవిశ్యాంతం

ర్యామిత్వేన - బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృత్వా దీశ్వరః] అనెడి నిరాలం బోపనిషత్తురీతిని ఆశుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మమే తనయందుబుట్టిన మాయతోగూడుకొని మాయాశబలిత బ్రహ్మమై అనగా సగుణబ్రహ్మమై సాకారరూపుండై యిచ్ఛామాత్రమున ప్రపంచమును సృష్టించుచు సకల చరాచరములందు అంతర్యామిగావ్యాపించుచున్నాడు. కావన,నారాయణ శబ్దవాచ్యుడైన ఆ శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మమే సాకార సగుణ బ్రహ్మమగును. భగవంతుం డనియు, ఈశ్వరుం డనియు, దేవుండనియు చెప్పబడుచున్నాడు. కాబట్టి అట్టి నారాయణునియందు భక్తిలేనివారు మోక్షము లేక జననమరణసాగరంబున మునిగి దుఃఖించుచుందురు. ఓ నాప్రియమైనపుత్రా! శుకా! ఇది మొదలు నారాయణోపనిషత్తుబోధించు చున్నాను.శ్రద్ధా భక్తిగలవాడవై వినుమని యిట్లనియె[శ్రుతిః సహ నావవతు-

నారాయణోపనిషత్తు ప్రారంభము.

సహ నౌ భునక్తు-సహ వీర్యం - కరవావహై - తేజస్వినా వధీత మస్తు - మావిద్విషా వహై ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః] తాత్పర్యము—పుత్రా! ఇప్పుడు నారా యణోపనిషత్తు నీకు బోధించబోవుచున్నాను గాన ఈ యుపనిషత్తుచేత ప్రకాశించెడు ఆ నారాయణుండే గురు శిష్యు లగు మనలనిద్దఱిని రక్షిం చునుగాక, మనమిద్దఱు ఈయుపనిషత్తువల్ల గలిగినసామర్థ్యమును కలుగ చేసికొందుము గాక, మన యిద్దఱిచే పఠింపబడిన ఈ యుపనిషత్తు వీర్య వంతమైనదిగా అగుగాక, మనకిద్దఱికి ద్వేషము లేకపోవుగాక, అనగా గురు శిష్యు లగు మనమిద్దఱము పరస్పరము ప్రమాదమువలన చేయబడిన అధ్య యనఅధ్యాపకదోషనిమిత్తమగు ద్వేషమును జేసికొనకుందుముగాక అని యభిప్రాయము. [ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః] సమస్తదోషములు శమించును గాక ఇచ్చట శాంతియనెడి పదము సర్వదోషములు నశించుటకు గాను మూడుమార్లు చెప్పబడెను.[శ్రుతిః ఓం అథ పురుషోహవై నారాయణో కామయత ప్రజాః సృజేయేతి] తాత్పర్యము. మాయాతీతుండగుచు సర్వపరిపూర్ణుడైన పరబ్రహ్మమే సగుణబ్రహ్మంబగు భగవంతుడగుచు ప్రజలను సృష్టించుట కుద్దేశించెను. [శ్రుతిః నారాయణాత్ ప్రాణో జాయతే - మన స్సర్వేంద్రియాణిచ- ఖంవాయుః జ్యోతిరాపః । పృథ్వీ విశ్వస్యధారిణీ] తాత్పర్యము—సచ్చిదానంద

నిత్యనిర్మలమగు నారాయణ పరబ్రహ్మమువలన ప్రాణాది పంచవాయువులును, శ్రోత్ర త్వక్కు నేత్ర జిహ్వా ఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియములును, వాక్కు పాణి పాద గుహ్య గుదము లనెడి కర్మేంద్రియములును, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము లనెడి అంతరింద్రియములును, భూమి జలము అగ్ని వాయువు ఆకాశములనెడి పంచభూతములును పుట్టెను. [శ్లో॥ నారాయణాత్ బ్రహ్మాజాయతే - నారాయణాత్ రుద్రో జాయతే - నారాయణా దింద్రో జాయతే - నారాయణాత్ ప్రజాపతిః ప్రజాయతే - నారాయణా ద్ద్వాదశాదిత్యాః-రుద్రా వసవ స్సర్వాణి ఛందాంసి - నారాయణాదేవ సముత్పద్యంతే - నారాయణాత్ ప్రవర్తంతే - నారాయణాత్ ప్రలీయంతే ఏతత్ ఋగ్వేద శిరోధీతే॥] తాత్పర్యము నారాయణపరబ్రహ్మమునుండి సృష్టికర్తయైన బ్రహ్మయు, సంహారకర్తయైన రుద్రుడును, దేవేంద్రుడును, నవబ్రహ్మలు, ఏకాదశరుద్రులు. అష్టవస్తువులు ద్వాదశాదిత్యులు, నాలుగువేదములు, పదునాలుగులోకములు, లోకాధిపతులును, లోకములోని చతుర్విధజీవులును పుట్టెను. ఆ జీవులకు తగిన చతుర్విధ ఆహారములును వస్త్ర ఆభరణచందన గృహ వాహనములు మొదలైన వన్నియు ఆ నారాయణునివల్లనే వృద్ధిపొందుచున్నవి. ఆ నారాయణునివల్లనే లయించుచున్నవి. ఇట్లు ఋగ్వేద ఉపనిషత్తునజెప్పబడుచున్నది. [శ్రుతి అథ నిత్యో నారాయణః-శివశ్చ నారాయణః-శక్రశ్చ నారాయణః కాలశ్చ నారాయణః-దిశశ్చ నారాయణః-విదిశశ్చ నారాయణః-ఊర్ధ్వంచ నారాయణః - అధశ్చ నారాయణః। అంతర్బహిశ్చ నారాయణః-నారాయణ ఏ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం నిష్కళంకో - నిరంజనో - నిర్వికల్పో-నిరాఖ్యాత శుద్ధో - దేవ ఏకో నారాయణః - నద్వితీయోస్తి కశ్చిత్ యఏవం వేద-సవిష్ణురేవ భవతి - సవిష్ణురేవభవతి ఏతద్యజుర్వేద శిరోధీతే॥] తాత్పర్యము, తర్వాత నారాయణుడు నిత్యమైనవాడు,అనగాభూతభవిష్యద్వర్తమానములనెడిత్రికాలములందు నాశము లేక యుండువాడు. సృష్టికర్త యగు బ్రహ్మదేవుడు, సంహారకర్తయగు రుద్రుడు, దేవేంద్రుడు,[దిన పక్షమాససంవత్సరయుగప్రళయ సంజ్ఞలుగల కాలమును]తూర్పుదక్షిణముఉత్తరముపడమరఆగ్నేయము నైఋతి వాయవ్యముఈశాన్యము అనెడుఅష్టదిక్కులున్ను మీదిభాగమున్ను క్రిందిభాగమునులోపలవెలుపలసర్వమున్ను నారాయణ పరబ్రహ్మమే, ఇంతకు ముందుపుట్టినది, ఇకమీాద పుట్టబోవునది, ఇప్పుడు పుట్టియుండునది, సర్వ

మున్ను నారాయణామే. ఈ సర్వమును ఏకో నారాయణ పరబ్రహ్మమే. అతడు కళంకము లేనివాడు, వాక్కులకు అందనివాడు, నిర్మలుడు, స్వయంప్రకాశుడు, అణవాదిపంచమలములు లేనివాడు, సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనివాడు, తనకు రెండవవస్తువు లేనివాడు. సముద్రమునందు బుట్టిన అలలు నురుగు మొదలైనవి ఆ సముద్రముకంటెను వేఱైనపదార్థములుగా లేనట్లున్ను, ఆ సముద్రమే అలలు నురుగులుగా గాన్పించినట్లున్ను నారాయణుడే సర్వముగా తోచుచు తనకు రెండవవస్తువు లేక తానొక్కడే సర్వముగా నున్నాడని యెవడెఱుగుచున్నాడో ఆ పరబ్రహ్మమే అనువాడు ముక్తుడగును. ఇట్లు యజుర్వేదములోని ఉపనిషత్తునందు జెప్పంబడుచున్నది సుమీ. [శ్రుతి. ఓమిత్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్-నారాయణాయే త్యుపరిష్టాత్ ఓమిత్యేకాక్షరం నమ ఇతి ద్వే అక్షరే నారాయణాయేతి పంచాక్షరాణి-ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పదం। యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి- అనపబ్రువక్ సర్వమాయురేతి - విందతే ప్రాజాపత్యం- రాయస్పోషం। గౌపత్యం-తతోఽమృతత్వమశ్నుతే ఇతి-ఏతత్సామవేదశిరోఽధీతే ] తాత్పర్యము. మొదట (ఓం) అను ప్రణవమున్ను, తర్వాత (నమో) అనెడి రెండక్షరమున్ను అటుతర్వాత [నారాయణాయ] అనెడి ఐదక్షరములున్ను గూడి నారాయణ అష్టాక్షరీ మంత్రమగుచున్నది. ఈ మహామంత్రమును యెవడు ప్రసిద్ధముగా జపించుచున్నాడో వాడు పూర్ణాయువును బొంది ప్రజాపతిత్వమును పొందుచున్నాడు, గోవులు పెక్కులు గలవాడగుచున్నాడు, మఱియు జననమరణము లేని బ్రహ్మైక్యమను విదేహముక్తిని బొందుచున్నాడు. ఇట్లు సామవేదమందలి ఉపనిషత్తులో చెప్పబడుచున్నది. [శ్రుతి ప్రత్యగానందం బ్రహ్మపురుషం-ప్రణవస్వరూపం-అకార ఉకార మకార ఇతి-తానేకధా సమభవత్ తదేతదోమితి యముక్త్వా ముచ్యతే యోగీ-జన్మసంసార బంధనాత్ ఓం నమో నారాయణాయేతి మంత్రోపాసకః-వైకుంఠభవనం గమిష్యతి - తదిదం పుండరీకం విజ్ఞానఘనం। తస్మాత్ తటిదాభమాత్రం - బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదన ఇతి - సర్వభూతస్థమేకం వై నారాయణం కారణపురుషమకారణం-పరంబ్రహ్మోం ఏతదథర్వణ శిరోఽధీతే॥ ] తాత్పర్యము. జీవసాక్షియగుచు ప్రత్యగాత్మ స్వరూపమైన వాడును, నిత్యానందరూపుండును నైన పరబ్రహ్మమే ఓంకారస్వరూపమాయెను. అ-ఉ-మ-అను మూడక్షరములు చేరి, ఓం అని ఏకాక్షరమగుచున్నది. ఎట్లనగా, ఈ

నారాయణోపనిషత్తు నీకు బోధించు చుండగా ఈ సమయములో మధ్య తారాసారోపనిషత్తులో,కొంతభాగము చెప్పుచున్నానుదానినిబహు శ్రమగలవాడవై వినుమని చెప్పుట కారంభించెను.[శ్రుతి॥ అకారాదభవత్ బ్రహ్మ జాంబవానితి సంజకః। ఉకారాక్షర సంభూతో ఉపేంద్రో హరినాయకః।మకారాక్షర సంభూతశ్శివస్తుహనుమాన్ స్మృతిః।] అనెడి తారాసారోపనిషత్తురీతిగా అ అనగా బ్రహ్మ, ఉ-అనగా విష్ణువు, మ-అనగా రుద్రుడు, ఈ త్రిమూర్తులుగూడియే ఓం-అనెడి ప్రణవ మగుచున్నది. అట్లు త్రిమూర్తి స్వరూప మగు ఓంకార పరబ్రహ్మమే నారాయణుడయ్యెను. వత్సా! ఇప్పుడు బోధించినది తారాసారోపనిషత్తువాక్యము. కాబట్టి ఇట్టి ఓంకారమును జపించువాడు జననమరణములేని మోక్షమును బొందుచున్నాడు,మఱియు ఈ ప్రణవాక్షరముతో గూడిన నారాయణయను మంత్రమును ఎవడు జపించుచున్నాడో వాడు పరబ్రహ్మస్థానము చేరగలడు, అ నారాయణ పరబ్రహ్మము ఈ హృదయ పద్మమునందు జ్ఞానానందముగా మెఱుపు తీగవలె ఆపోజ్యోతి స్వరూపముగానున్నది. ఆ పరబ్రహ్మమే దేవకీపుత్రుడగు కృష్ణమూర్తిస్వరూపముగానున్నది,ఆపరబ్రహ్మమేసకల జీవజంతువులందు జీవస్వరూపముగానున్నది, ఆపరంజ్యోతి స్వరూప మగు నారాయణ పరబ్రహ్మము తనకు వేఱొక కారణము లేక సర్వమునకు తానే కారణమైనదిగా నున్నది. త్రిమూర్తిస్వరూప మగు ఆ నారాయణమే ఓంకార స్వరూపముగా నున్నది. ఇట్లు అథర్వణవేద ఉపనిషత్తునందు జెప్పబడు చున్నది.[శ్రుతి॥ ప్రాతరధీయానో రాత్రికృతంపాపం నాశయతి-సాయమధీయానో దివస కృతం పాపం నాశయతి-తత్సాయం ప్రాతరధీయానః; పాపో అపాపోభవతి । మాధ్యం దిన మాదిత్యాభిముఖో ధీయానః-పంచమహాపాతకోపపాతకాత్ప్రముచ్యతే-సర్వ వేద పారాయణపుణ్యంలభతే-నారాయణసాయుజ్యమవాప్నోతి-శ్రీమన్నారాయణసాయుజ్య మవాప్నోతి-యఏవం వేద-ఇత్యుపనిషత్ ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః॥] తాత్పర్యము. ఈ నారాయణోపనిషత్తును ప్రాతఃకాలమున పఠించువారలకు రాత్రిచేసిన పాపములునశించును, సాయంకాలమునందుజపించువారికిపగలుచేసినపాపములు నశించును,సాయంకాలము ప్రాతఃకాలము రెండు వేళలందు పఠించువారు పాపము లేని వారగుచున్నారు, మధ్యాహ్నకాలమునందు సూర్యా

నికి యెదురుగానుండి సూర్యమండలమును జూచి ధ్యానించువారికి పంచ మహాపాతకములు నశించును, సర్వపాపములున్ను నశించును. ఈ నారాయణోపనిషత్తు ఒకటిమాత్రము పఠించినయెడల నాలుగు వేదములు పఠించినంత ఫలము గలుగుచున్నది. మఱియు పఠించువాడు నిత్యమంగళ స్వరూపుడైన నారాయణ పరబ్రహ్మమునందు అద్వైక్యమును బొందు చున్నాడు. ఇట్లు ఈ నారాయణోపనిషత్తు రహస్యము తెలిసికొన్నవాడు యిందు చెప్పబడిన పూర్ణ ఫలమును బొందగలడు. [ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః] ఈ నారాయణోపనిషత్తు సంపూర్ణముగా ముగిసెను. అని చెప్పి వేద వ్యాసుండు శుకునకు శ్రీమన్నారాయణఅష్టాక్షరీమంత్రమును విశదంబుగా

## షడ్విధసంబంధములు.

బోధించి యిట్లనియె. పుత్రా! ఇట్టిభగవంతుని మనము జన్యజనకత్వము, ప్రాప్యప్రాపకత్వము, ఆధిపత్యదాసత్వము, ప్రేర్యప్రేరకత్వము, వేద్యవేద కత్వము, అంశ్యాంశకత్వము అను ఈ యారు సంభంధములు గలిగి భక్తి చేయవలయును. (1) జన్యజనకత్వమనగా:- ఆ నారాయణుడు మాయా సహితుడై మనలను పుట్టించువాడు, మనము అవిద్యా వృత్తివలన తల్లి గర్భమునుండి బుట్టినవార మనుట. (2) ప్రాప్యప్రాపకత్వ మనగా:- జ్ఞాన భక్తి వైరాగ్య సత్కర్మానుష్ఠానములవలన మన మతని జేరవలసిన వారము, అతడు మనలను తనలో జేర్చుకొనువాడనుట. (3) ఆధిపత్య దాసత్వమనగా:- మనము అతనిసృష్టికి లోబడినవారము, కాబట్టి అతడు మనలను రక్షించు ప్రభువు, మనము అతని యాజ్ఞకు లోబడిన వార మనుట. (4) ప్రేర్యప్రేరకత్వమనగా:- మనముచేయు పుణ్యా పాప కర్మ ములకు తగినట్లుగా మనము స్వర్గనరకములను జేరువారము, అతడు మనలను స్వర్గనరకములయందు మనకర్మానుసారముగా జేర్చువాడనుట. (5) వేద్యవేదకత్వ మనగా:-మనము మన నేత్రములకు కర్ణములకు గోచ రించు పదార్థములను యెఱుగువారము, అతడు ఆ పదార్థములను యెఱుగు జ్ఞానమును మనకు గలిగించువాడనుట. (6) అంశ్యాంశకత్వ మనగా. (మమైవాంశో జీవభూత స్సనాతనః) అనెడు భగవద్గీతావాక్యరీతిని, మనము అతని యంశముగా బుట్టినవారము, అతడు మనజన్మమునకు ఆశ్రయు మైనవాడనుట, ఈ షడ్విధ సంబంధములను తెలిసికొని ఆ భగవంతుని

మనము భక్తిచేసినయెడల అతని యనుగ్రహమువలన మనము బ్రహ్మజ్ఞానముగలిగి ముక్తిపొందగలము. పుత్రా! ఈశ్వరభక్తి, బాహ్యాభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని మూడువిధములు. [శ్లో॥ శ్రవణం కీర్తనం

## నవవిధభక్తులు.

ధ్యానం విష్ణోః పాదసేవనమ్! అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥] అను ప్రమాణరీతిగాను, [మత్తేభపద్యము॥ తనుహృద్భాషల సఖ్యముఞ్ శ్రవణముఞ్ దాసత్వముఞ్ వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుఞ్ సంకీర్తనల్ చింతనం।బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మకఞ్ హరి న్నమ్మి సుజ్జనుఁడై యుండుట భద్రమంచు దలతుఞ్ సత్యంబు దైత్యోత్తమా [అనెడి శ్రీభాగవత వాక్యరీతిగాను, శ్రవణము కీర్తనము పాదసేవనము అర్చనము వందనము దాస్యము సఖ్యము ఆత్మనివేదనమనెడి తొమ్మిదిభక్తిమార్గములు బాహ్యాభక్తియనఁబడును. (1) శ్రవణమనగా—శ్రీమన్నారాయణుఁడే రామకృష్ణాది పెక్కుదివ్యావతారములెత్తి లీలావినోద క్రీడలుచేసి భక్తసంరక్షణంబును, దుష్టశిక్షణంబును జేయుచుండునుగాన, అట్టి అవతారకథలను వినుచు సంతోషచిత్తుఁడై యుండుట. (2) కీర్తనమనగా—అట్టి లీలామానుషవిగ్రహుండైన భగవంతుని రామకృష్ణగోవిందాదినామంబులను రాగతాళములతో పాడుచు అతనిని వర్ణించుచుండుట, ఆ యవతారంబులను ప్రత్యక్షముగా జూచినట్లు మనంబునందలంచి చింతింపుచు అడుగడుగునకు దేహముపులకాంకురంబులును నేత్రములందు ఆనందబాష్పంబులును గద్గదస్వరంబును గలిగి బహువిధంబులుగా కీర్తనలు సేయుట. (3) స్మరణమనగా—భగవంతుని అనంతనామంబులను సదా రామా కృష్ణా నారాయణా శంకరా శివా అనిజపించుచుండుట. (4) పాదసేవనమనగా—భగవంతునియొక్క శ్రీపాదారవిందములను హృదయంబున సేవించుచుండుట. (5) అర్చనమనగా—భగవంతుని అవతారము లగు రామకృష్ణాదిమూర్తులను పుష్పాదులతో నలంకరించి తులసిబిల్వము మొదలగు పత్రములతో నతనిపాదంబులను బూజించుట. (6) వందన మనగా—భగవంతుని దివ్యమంగళ విగ్రహమునకు సాష్టాంగముగ నమస్కరించుట. (7) దాస్యమనగా—వందనంబు జేసిన వెనుక భయభక్తితో, ఓ పరమాత్మా నీవు నాకు రక్షకుడవు, నేను నీ బంటను, కాబట్టి నా తప్పు లన్నియు మన్నించి నన్ను రక్షింపుము.

అని మనంబునం దలంచి బహువిధముల నతనిం బొగడుచు, అతని సన్నిధిని
విడిచివచ్చుటకు మనస్సురాక అతని సమీపంబున స్తంభమువలె కదలక
మెదలక నిలువఁబడుచు ధ్యానించుచుండుట. (8)సఖ్యమనగా—భార్యా
బిడ్డలు మొదలగు తనకు ప్రియమైన వారియందుండు ప్రీతికంటెను భగవం
తునియందు అధిక ప్రీతిగలిగియుండుట (9)ఆత్మనివేదనమనగా—తనచిత్త
మును భగవంతునియందు అర్పణముచేసి ఇతర సంకల్పము లేవియు లేక
నిస్సంకల్పుఁడై తదేకధ్యానంబుగా తన్మయుండై యుండుట. ఇట్టి నవవిధ
భక్తులున్ను బాహ్యభక్తి యనఁబడును. మఱియు అనన్యభక్తి యనగా
[వాసుదేవ సర్వమితి స మహాత్మా సుదుర్లభః ] అనెడు భగవద్గీతా వాక్యరీతిని
ఈ ప్రపంచంబు సర్వమును వాసుదేవ పరబ్రహ్మ మని భావించి,
[శ్లో॥ విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాంచ దైహికమ్ ప్రణమేత్ దండవ
ద్భూమావశ్వ చండాల గోఖరమ్.] అనెడి ప్రమాణమురీతిగా అహంకారమును
లజ్జను విడిచిపెట్టి అశ్వము చండాలును గోవు గాడిదె పక్షి మొదలగు
సకల జంతువులందును భగవంతుఁడే జీవస్వరూపంబుగా నున్నాఁడని యె
ఱింగి వానినెల్ల భగవత్స్వరూపముగా దలచి వానియందు అతిప్రీతి గలిగి
వానికి సాష్టాంగదండములు సేయుచు సదా భగవన్నామమునుధ్యానించు
చుండుట, ఇదే అనన్యభక్తియనబడును. మఱియు ఏకాంతభక్తియనగా
[యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి ]అనెడిభగవద్గీతావాక్యమురీతి
గా సముద్రమునందు తరంగంబు లుండునట్లు నారాయణునియందు సకల
ప్రపంచం బున్నదనియు, [నారాయణో పరజ్యోతి రాత్మానారాయణః పరః]
అను శ్రుతిరీతిని ఈ దేహమున అతఁడు ఆత్మస్వరూపంబై యున్నాఁడని
తెలిసి భ్రూమధ్యంబున లక్ష్యముంచి జ్యోతిస్స్వరూపుని దర్శించుచు తన్మ
యుండై యుండుట, ఇదే ఏకాంతభక్తి యనఁబడును. ఈ యేకాంతభక్తి

### అష్టవిధపుష్పము

గలవారు భగవంతుని తమ మానసంబున అష్టవిధపుష్పంబులచేత పూజిం
తురు. ఎట్లనగా, [శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహమ్। సర్వ
భూత దయాపుష్పం క్షమాపుష్పం విశేషితః శాంతిపుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం
తథైవచ । సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥] అనుశ్లోకమురీతిగా
(1) జీవహింస జేయకుండు వ్రతము మొదటిపుష్పము,(2) తాఁబేలునిద్రించు

నప్పుడుదానిఅవయవములనుకొంచమైనను బయట తెలియనీయక లోపలికి యీడ్చుకొనియెట్లు నిద్రించుచున్నదో, అట్లు జ్ఞానేంద్రియంబులను కర్మేంద్రియంబులను అవి యవి యథేచ్ఛగా బహిర్వ్యాపారములు చేయకుండా మరల్చి అంతర్ముఖమున ద్రిప్పుట, ఇంద్రియనిగ్రహ మనబడును, ఇదే రెండవపుష్పము. (3) భూతదయ పశ్చాత్తాపము అనగా, ఆకలిదప్పులచే బాధింపబడు బీదవారిని, రోగులను జూచినతోడనే తనకు ఆఁకలి కలిగినట్లును తనకు బాధగలిగినట్లున్ను దుఃఖించి పశ్చాత్తాపపడుచు వారికి తన శక్తికొలది అన్నపానాదులనిడి రక్షించుట, ఇదే మూడవపుష్పము. (4) క్షమ మనగా, తనకు ఒకడు అపకారముచేసినను తిట్టినను కొట్టినను వాని యందు కోపములేక అది తన కర్మానుసారముగా జరిగిన కార్యము లని తలంచి వానిని (సుఖీభవ యని) అనగా క్షేమముగా నుండు మని మనఃపూర్వకముగా దీవించుచు వానియందు మైత్రి గలిగియుండుట, ఇదే నాలుగవపుష్పము (5) తాను చేసినట్టి పాపములకు భయపడి తనపాపములను మన్నించునట్లు ఈశ్వరుని వేడుకొనుట శాంతి యనబడును, ఇదే అయిదవ పుష్పము. (6) సదా బ్రహ్మవిచారము జేయుచుండుట తపస్సనబడును. ఇదే ఆఱవపుష్పము. (7) సదా బ్రహ్మమును మానసికముగా ధ్యానించుచుండుట, ఇదే ఏడవపుష్పము. (8) సదా సత్యవాక్యములాడుట, అనగా సత్యమాడుటవలన జీవహింస మానభంగము పరులద్రవ్యము నశించుట మొదలగునవి కలుగుననితోఁచినా అట్టిచోట్ల సత్యమాడుటను విడిచిపెట్టి అసత్యమే చెప్పి ఆ జీవహింస మానభంగము పరద్రవ్యనాశము మొదలగునవి లేకుండునట్లు చేయవలయును. ఇట్టిచోట్లం దప్ప తక్కినచోట్ల సదా సత్యమే చెప్పవలయును, ఇదే యెనిమిదవపుష్పము—ఈ యెనిమిది పుష్పములతో భగవంతుని పూజించుటే నిజమైన మానసపూజ యన బడును. ఇది ఏకాంతభక్తితో చేరిన పూజ యగుచున్నది. ఈపూజవలన ముఖ్యముగా భగవంతుడు పరమానందంబును బొందును, మొట్టమొదట బాహ్యభక్తిగలిగిన వెనుక అనన్యభక్తి గలుగును. అనన్యభక్తిగలిగిన తర్వాత ఏకాంతభక్తి గలుగును. బాహ్యభక్తిగలవాడు తన కులాచారములకు తగిన సంధ్యావందన గాయత్ర్యాదిజపములు సత్కర్మ

ములు జేయుచు, ఆ కర్మములను ఈశ్వరార్పణముగా జేయుచుండును. అనన్యభక్తుండుసత్కర్మములనువిడిచిపెట్టికేవలభగవద్భక్తిమాత్రముగలిగి యుండును. ఏకాంత భక్తిగలవాడు లోకులయొక్క. పాతకములు నశించి వారు పుణ్యవంతు లగుటకుగాను నిత్యనైమిత్తికాదిసత్కర్మములు,అనగా సంధ్యావందన ప్రాణాయామ గాయత్రి జప తప యజ్ఞాది కర్మములను ఈశ్వరుడు వారికి ఆజ్ఞాపించె నని తెలిసి అతని యాజ్ఞాభంగము గాగూడ దని అతని ముఖోల్లాసమునకై నిష్కాముడై ఫలములనుగోరక ఆసత్కర్మములు చేయుచుండును. ఈశ్వరార్పణ కర్మసహితమైన బాహ్యభక్తి, సాలోక్య సామీప్యపదవుల నిచ్చును.కర్మత్యాగ సహితమగు అనన్యభక్తి సారూప్యపదవిని యిచ్చును. లోకులు కడతేరుటకుగాను చేయుచున్న సత్కర్మసహితంబగు ఏకాంతభక్తి, సాయుజ్యపదవిని యిచ్చును. సాలోక్యమనగా భగవంతుండు బ్రహ్మ విష్ణు రుద్ర రూపంబులతోడ వసించు స్వర్గ వైకుంఠ కైలాసాది లోకములను జేరి అక్కడ సంచరించు చుండుట సామీప్య మనగా భగవంతుని సమీపంబునను జేరుట. సారూప్యమనగా, భగవంతునిరీతిగానే చతుర్భుజములు గలిగి అతనితోడ నెప్పుడు నెడబాయక సంచరించు చుండుట. సాయుజ్య మనగాఅతనియందు ఐక్యమగుట. అనిమఱియు శుకునింజూచి వేదవ్యాసుండు యిట్లనియె.[ శ్లో॥ మద్భక్తజనవాత్స

## అష్టవిధభక్తులు.

ల్యం పూజాయాం చానుమోదనమ్।స్వయమభ్యర్చనం చైవమదర్థేడంబవర్జనమ్॥మత్కథాశ్రవణే భక్తిః స్వరనేత్రాగవిక్రియా। మమానుస్మరణం నిత్యం యచ్చమాం నోపజీవతి॥ భక్తి రష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే।సవిప్రేంద్రో ముని శ్శ్రీమాన్ సయతిస్సచ పండితః॥ ] పుత్రా! శుకా! (1) నా భక్తులయందు ప్రేమ (2) నా భక్తులు నన్ను పూజించు చుండగా జూచి సంతోషించుట. (3) తనకు తానే పూజించుట. (4) నన్ను పూజించుట యందు డంబములేక యుండుట. (5) నాదివ్యావతారకథలు వినుటకు నుత్సహించుట. (6) నా యందు భక్తివిశేషముచేత దేహము పులకరింప నేత్రములందు ఆనంద బాష్పములు రాలి కంఠము గద్గదస్వరముగానగుట. (7) సదా నారాయణ గోవింద శంకర శివ మహాదేవ శ్రీరామ కృష్ణా యని నానామంబుల స్మరించు చుండుట. (8) నన్నెడబాసియుండుటకు క్షణమైన తాళకుండుట అనెడి ఈ యెనిమిది విధ భక్తులు గలవాడు తురకవాడైనను మాలవాడై

నను వాడే బ్రాహ్మణోత్తముడు, వాడేఋషిశ్రేష్ఠుడు, వాడే శ్రీమంతుడు, వాడేపరమసన్యాసి, వాడేబ్రహ్మజ్ఞాని అని భగవంతుడు చెప్పియున్నాడు. మరియు. [శ్లో॥ పత్త్రం పుష్పం ఫలం తోయం సదారాధన కారణాత్ ।యో మే దదాతి సతతం సదా భక్తః ప్రియోమమ॥ ]అనెడి కూర్మపురాణ శ్లోకమురీతిని పత్త్రము పుష్పము ఫలము జలము మొదలైనవి యెవడు తాననుభవించకముందుగా నాకు సమర్పించి తర్వాత వాటిని తాను అనుభవించు చున్నాడో, వాడే నాకుప్రియమైనభక్తుడని భగవంతుడుచెప్పియున్నాడుగానమనమఅన్నము మొదలగు యేయేపదార్థములను అనుభవించుచున్నామో అవియన్నియు ముందుగా ఈశ్వరార్పణము జేసియే మనముఅనుభవింపవలయును. అట్లు చేయనివాడు పందితో సమానుడగుచున్నాడు. వాడు భుజించు పదార్థ

భాగవతులమహిమ.

ములు మలముతో సమానమగుచున్నవి. మఱియు[శ్లో॥ శ్వపచోపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః । విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః॥ ]అనెడు శ్రీభాగవత శ్లోకమురీతిగా భగవద్భక్తి గలవాడు మాలవాడైనను వాడుబ్రాహ్మణుని కంటెను శ్రేష్ఠుడు, బ్రాహ్మణసన్యాసియైనను భగవద్భక్తి లేనివాడు కుక్కమాంసమును భక్షించు మాలవానికంటెను హీనుడుసుమా. [శ్లో॥ దానంచ దద్యాత్ శూద్రోపి పాకయజ్ఞై ర్యజేతచ।పిత్ర్యాదికంచ సర్వం వై శూద్రఃకుర్వీత తేనవా॥ ] అనెడి విష్ణుపురాణ శ్లోకమురీతిగా బ్రాహ్మణునికే దానమియ్య వలయు నని జెప్పగూడదు. శూద్రుడైనను భగవద్భక్తి సత్కర్మానుష్ఠానము గలవాడైనయెడల అతడున్ను దానపాత్రుడే. సత్కర్మానుష్ఠానము భగవద్భక్తిగలశూద్రుడు పాకయజ్ఞముచేయవచ్చును. పితృతిథులయందు అతనికి సంతర్పణము చేయవచ్చును. [శ్లో॥ శ్వవిడ్వరాహోష్ట్రఖరైః స్సంస్తుతః పురుషః పశుః । నయత్కర్ణ పథోపేతో జాతు నామ గదాగ్రజః॥ ]శ్రీమన్నారాయణుని స్మరణచేయనివాడును,అతనినామస్మరణకుచెవియొసగనివాడును, బ్రాహ్మణుడైనను కుక్క, ఒంటె, గాడిదె, పంది, పశువు వీనితో సమానుడగు చున్నాడు. [శ్లో॥ శరశపుః ప్రతిపద్య యతిత్వయి శ్రవణవర్ణన సంస్మరణాదిభిః । నర హా శేనభవంతిభృశా మిదంధృతినదుచ్ఛ్వసితంనిఫలంతతః ]భగవద్భక్తిలేని జన్మము

ఉచ్చాఛ్వాసనిశ్వాసములు గలతోలుతిత్తివలె వ్యర్థమే యగుచున్నది. [శ్లో॥ యస్తుశూద్రో దమే సత్యే ధర్మేచ సతతోద్ధితః। తంబ్రాహ్మణమహంమన్యే వృత్తేనహి భవేద్విజః] అనెడు శ్రీభారతశ్లోకరీతిగా శూద్రుడైనను సత్యము ధర్మము దమము మొదలగు సద్గుణములు గలవాడైనయెడల వాడుబ్రాహ్మణుడే, ఎవడున్ను కులమువలన బ్రాహ్మణుడు గాజాలడు. [శ్లో॥ నశూద్రా భగవద్భక్తాః విప్రా భాగవతా స్మృతాః। సర్వవర్ణేషు తేశూద్రా యేహ్యభక్తాః జనార్దనే.] అనెడు శ్రీభాగవత శ్లోకమురీతిగా భగవద్భక్తుడు శూద్రుడుగాడు, అనగా భగవద్భక్తి లేనివాడే శూద్రుడనబడును. భక్తిగలవారందరున్ను భాగవతులనియు బ్రాహ్మణులనియు చెప్పబడును, అయితే బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులనెడు నాలుగు జాతులలోనున్ను భగవద్భక్తి లేనివారందరున్ను శూద్రులే యగుచున్నారు. [శ్లో॥ నవిశేషోస్తి వర్ణానాం సర్వం బ్రహ్మమిదం జగత్। బ్రహ్మణా పూర్వ సృష్టంహి కర్మభిర్వర్ణతాంగతః।] అనెడి శ్రీమహాభారతమునందలి శాంతిపర్వతములోనిశ్లోకమురీతిగా మొట్టమొదట ఈప్రపంచముసృష్టి అయినప్పుడు ఆదిలో జాతిభేదములు లేవు. బ్రహ్మమువల్ల బుట్టిన సర్వమున్ను బ్రహ్మస్వరూపమే కాబట్టి అందరు బ్రాహ్మణులే. అయితే తర్వాత వారువారు చేయునట్టి సత్కర్మానుష్ఠానములకు తగినట్లుగాజాతిభేదములు కల్పింపబడెను. [శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః।]అను భగవద్గీతా వాక్యరీతిని మొట్టమొదట జాతిభేదములు లేవు. అందరున్ను ఒక్కజాతి వారే, అయితే తర్వాత వారివారి గుణములవల్లను, సత్కర్మానుష్ఠానములవల్లను బ్రాహ్మణాది జాతిభేదము లేర్పడినవి. [శ్రుతి॥ నజాతి రాత్మనో జాతి ర్వ్యవహార ప్రకల్పితా] అనెడి నిరాలంబోపనిషత్తు రీతిగా ఆత్మకు జాతిభేదములు లేవు, అయితే లోకులు కల్పించుకొన్నదే గాని, ఆ జాతిభేదములువాస్తవ్యములుగావు. [శ్లో॥ అస్తిచేత్ బ్రహ్మవిజ్ఞానం స్త్రియోవా పురుషస్యవా। వర్ణాశ్రమా తథాచారః తస్యనాస్త్యేవ సర్వదా ] అను ప్రమాణమురీతిగాస్త్రీలకుగాని లేక పురుషులకుగాని యెట్టివారికైనను యే జాతి వారికైనను బ్రహ్మజ్ఞానము గలిగి యుండినయెడల వారికులాచారములు విచారింప గూడదు. వారు బ్రాహ్మణులే, వారిని పూజింప వలయును. ఎట్లనగా, ఋష్యశృంగ మహాఋషి జింకకడుపునబుట్టెను. కౌశికమహాఋషి దర్భయందుబుట్టెను.

జంబుకమహాఋషి నక్కకడుపున బుట్టెను. వాల్మీకిమహాఋషి బోయవాడు. వేదవ్యాసుండగు నేను బెస్తదాని కుమారుడను. ఓరీ! శుకుడా! నాముత్తాతయగు వసిష్ఠమహాఋషి ఊర్వశి అనెడి వేశ్యకుమారుడు. నారదుండు శూద్రస్త్రీ పుత్త్రుడు. అగస్త్యమహాఋషి మట్టికలశము నందు బుట్టినవాడు. సూతమహాఋషి శూద్రుడు మతంగ మహాఋషి మాదిగవాడు వీరందరున్ను భగవద్భక్తి బ్రహ్మజ్ఞానమువల్లనే బ్రాహ్మణులైరి గాని జన్మమాత్రమున గాదు. వీరికి జాతిభేదములు తలంచరాదు మఱియు స్త్రీ శూద్రులు, ఈశ్వరాభక్తి సదాచారము బ్రహ్మజ్ఞానము గలవారైన యెడల వారు వేదాధ్యయనము చేయవచ్చును, మైత్రేయి అనెడి స్త్రీ గార్గి అనెడి స్త్రీ వీరిద్దఱున్ను ఋషిపత్నులు, ఈ స్త్రీలు వేదాధ్యయనము చేసినట్లును వేదమంత్రములుజపించునట్లును వేదమునందే చెప్పబడుచున్నది. మఱియు ధర్మవ్యాధుడను బోయవానివద్ద కౌశికుండను బ్రాహ్మణుడు మంత్రోపదేశమును బొందినట్లు భారతములో ఆరణ్యపర్వము నందు జెప్పబడు చున్నది. కాబట్టి స్త్రీలుగాని పురుషులుగాని ఏజాతివారైనను భగవద్భక్తిగలిగియుండిరేనివారే శ్రేష్ఠులు. [శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః । స్త్రియో వైశ్యాస్తథాశూద్రా స్తేపి యాంతి పరాంగతిమ్ ] అను శ్రీ భగవద్గీతా శ్లోకరీతిగా నెంతపాపజాతి యందు బుట్టినవారైనను స్త్రీలు వైశ్యులు శూద్రులు పంచములు మొదలగు వారైనను, సత్యముగా భగవంతుని యందు భక్తిగల వారైనయెడల వారు సత్యముగ మోక్షము జెందగల రనియు, వారే భాగవతులనియు, అన్ని జాతులలో వారే శ్రేష్ఠులనియు జెప్పబడు చున్నది. మఱియు, [శ్లో॥ అయం మంత్రేదికారః స్యాత్ సర్వస్యచ నశంశయః। బ్రాహ్మణ క్షత్త్రియో వైశ్యో శూద్రోవాప్యంత్యజోపివా।] ఇట్లు పద్మపురాణమున పార్వతీ పరమేశ్వర సంవాదములో భగవన్నామమును ఒకడు ధ్యానించ వచ్చును, ఒకడు ధ్యానించరాదు అను భేదమును లేదు. బ్రాహ్మణుడు మొదలుకొని మాలవాడు వఱకు సకలజాతులవారును ధ్యానింపవచ్చునని చెప్పబడుచున్నది. [శ్లో॥ తిష్ఠదా గచ్ఛతా వాపి స్వపతా జాగ్రతా పివా। శయానోపవిశేషేన జప్యానారాయణస్సదా ] పుత్త్రా! శుకా! నిలుచుకొని యుండునప్పుడు నడుచునప్పుడు నిద్రించునప్పుడు మేలుకొనిసకలవ్యవహార

ములు చేయుచుండునప్పుడు పండుకొనియుండునప్పుడు కూర్చుండు నప్పుడు మలమూత్రములు విడుచుచుండు నప్పుడు స్త్రీ సంభోగము చేయునప్పుడు సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందు ఈ నారాయణ అష్టాక్షరీ మంత్రమును జపించవచ్చును. ఇప్పుడు చేయవచ్చును. ఇప్పుడు చేయరాదు అనెడు నిర్భంధము లేదు సుమీ ! [శ్లో॥ సంవిష్టశ్రీ స్సదాచారీ అభేద స్సర్వదైవతే। ఆశా పాశవినిర్ముక్తో హ్యేతే మోక్షాధికారిణః ] అనెడు పద్మపురాణ శ్లోకము రీతిగా (1) గర్వమును నాశము చేసి అణకువగా నుండుట, (2) సదాచారములు గలవాడుగా నుండుట, (3) నారాయణుడే బ్రహ్మ విష్ణు రుద్రాది సకల దేవతా స్వరూపములుగా నున్నాడని తెలిసి దైవదూషణ దైవభేదము చేయకుండుట, (4) ఆశాపాశమును తెగనఱకుట అనెడి ఈ నాలుగును యెవరు గలిగియున్నారో వారే మోక్షమును జెంద గలరు గాని తక్కిన వారు జెందగలరు. కాబట్టి ఓ శుకా ! నీ వీ నారాయణమంత్రమును జపించుచు దైవభేదమును విడిచిపెట్టి సకలము నారాయణుడే యని తలంచి సదా అతనియందు భక్తిగలిగి యుండుమని శ్రీ మన్నారాయణాష్టాక్షరీ మంత్రమును, భక్తిమార్గంబు సర్వంబును బోధించి మఱియు శుకునితో వేద వ్యాసుం డిట్లనియె. [శ్లో॥ యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్॥ తస్మాత్ జ్ఞానంచ యోగంచ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥ ] అనునట్లు యోగాభ్యాసం

## యోగ మార్గము.

లేనివానికి జ్ఞానము సిద్ధింపదు, కాబట్టి మోక్షాపేక్షగలవాడు యోగమును సాంఖ్యతత్త్వ జ్ఞానమును ఈ రెండును తెలిసి యోగ మభ్యసింప వలయును. కాబట్టి ఇదివరకు నీకు భక్తిమార్గంబునుబోధించితిని, ఇక యోగ మార్గంబును బోధించు చున్నాను జాగ్రతగా విను మని యిట్లనియె. [శ్లో॥ శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః । నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ । తత్త్రైకాగ్రం మనం కృత్వా యతచిత్తేం ద్రియక్రియః ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మ విశుద్ధయే। ] అనెడి భగద్గీతరీతిగా పరిశుద్ధమైనచోటున మిక్కిలి పొడుగుగాను మిక్కిలిపొట్టిగాను లేనిసమయముగానుండు భూమిమీదపరి శుద్ధమైన తెల్లనివస్త్రము లేక కృష్ణాజినము పఱపి ఆయాసనము మీద కూర్చొనిమనస్సును చంచలము లేక ఏకాగ్రహముగానిల్పి యోగాభ్యాసం చేయవలయును. [శ్లో॥ సమంకాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః। సంప్రేక్ష్య

నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్। ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ] అనెడి భగవద్గీతా శ్లోకరీతిగా శరీరమును శిరస్సును కంఠమును సమముగాకదలకుండునట్లునిలుపుచుస్థిర చిత్తముతో తనయొక్క ముక్కుకొనను జూచుచుతక్కినదిక్కులనుజూడక శుద్ధతత్త్వగుణముగలవాడై సకలకోరికలుమాని బ్రహ్మచారివ్రతము నందుండుచు మనస్సును బాహ్యవిషయములందు అంతర్ముఖముగా ద్రిప్పి యిష్టదైవమును గురువును ధ్యానించవలయును. అటుతర్వాత [ శ్లో॥ సర్వ ద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగ ధారణమ్। ఓమి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మనుస్మరన్ । యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్ ] అనెడి భగవద్గీతా వాక్యరీతిగా ఈ దేహమునందు నవద్వారములను నియమించి మనస్సుచలింపక నిలిపిప్రాణ వాయువును భ్రూమధ్యంబునందు జేర్చి కుంభించి, అనగా అక్కడనే కదలక నిలిపి బ్రహ్మస్వరూప మగు ఓంకారమును ధ్యానించుచు దశవిధ ప్రణవ నాదంబులను వినుచు, [ శ్లో॥ నాభికమలమధ్యే జ్యోతి రానందరూపం - హృదయకమలమధ్యే సూర్యబింబానురూపం - భ్రూయుగ ద్విదళమధ్యే హంసమార్గాను రూపం - దశశతం దళమధ్యే బ్రహ్మమార్గానురూపం - సకల మిద మయోయం స్థూలసూక్ష్మా నురూపం - అహాహ పరమపురుషో పాతు మాం నారసింహః ] అను ప్రమాణమురీతిగా భ్రూమధ్య మందైనను, లేక లలాటమందుండునట్టిసహస్రాకార పద్మమందైనను మనస్సును చూపులను ఒక్కటిగా నిలిపి అచ్చట పరంజ్యోతి స్వరూపముగా నుండు పరమాత్మను దర్శించుచు తన్మయంబుగా నుండుటే యోగ మనబడును, ఈ యోగాభ్యాసమునకు ప్రాణాయామమును మొట్టమొదట అభ్యసింప వలయును. ఆవల పంచముద్రలను త్రివిధ లక్ష్యంబులను అభ్యసింప వలయును. కాబట్టి ప్రాణాయామ అభ్యాసమును దెలుపు చున్నాను శ్రద్ధతో విను మని యిట్లనియె.

## ప్రా ణా యా మ ల క్ష ణ ము.

[ తేటగీత పద్యము॥ ప్రణవ పంచాక్షరష్టాక్షరాదికముల । మాత్రగా జేసి పూరక మాత్రల కును రెట్టి కుంభకమున నిల్పి రేచకంబు। నాడిశోధన మట్లు చేయంగ వలయు తేటగీత పద్యము॥ సోముదెస గాలి గొనుచు సుషుమ్న బట్టి । సూరరుదెస వీడి క్రమ్మర సూర్య కలన పింగళంబున గొనిపట్టి పిదప నిగుడ। విడువవలయు యథాశక్తి నడుగ కపుడు।]

అను ప్రమాణము రీతిగా ఓంకారము, పంచాక్షరము, అష్టాక్షరము మొదలగు మంత్రంబులలోపల నేదైన నొకమంత్రంబును గురూపదేశంబున గ్రహించి ఆ మంత్రమును ఒక మాత్రగా జేసికొని యెన్నిమాత్రలు పూరించుచున్నామో దానికి రెట్టింతలు కుంభించి ముందు పూరించిన మాత్రలలో సగము మరల బయటికి రేచించుచు ఈప్రకారముగా రేచించుచు పూరించుచు కుంభించుచు సుషుమ్నానాళమందు, అనగా భ్రూమధ్యమందు దృష్టినిలిపి పరంజ్యోతి స్వరూపంబును దర్శింపవలయును. ఎడమముక్కున ప్రాణవాయువును పూరించి భ్రూమధ్యంబునందు నిలిపి కుడిముక్కున విడుచును. మరల కుడిముక్కున పూరించి భ్రూమధ్యమందు నిలిపి యెడమముక్కున బయటికి విడుచుచు ఇట్లు సదా యథాశక్తిగా ప్రాణాయామము చేయవలయును. (1) రేచకమనగా ప్రాణవాయువును బయటికి విడుచుట. (2) పూరక మనగా ప్రాణవాయువును లోపలికి ఈడ్చుట. (4) కుంభక మనగా లోపలికి కీడ్చినవాయువును భ్రూమధ్యమందుకదలక పట్టినిలుపుట, ఈకుంభకము ఊర్ధ్వకుంభకము అధోకుంభకమని రెండువిధములు. (1) లోపలికి పూరించినవాయువును రెండుముక్కులు మూసి భ్రూమధ్యంబున నిలుపుట ఊర్ధ్వకుంభకమనబడును (2) బయటికి విడిచిన వాయువును రెండుముక్కులు మూసి మరల కొంతకాలము లోపలికి ఈడువ కుండుట అధోకుంబకమనబడును. మఱియొకవిధమయిన

## అంతర్ప్రాణాయామము.

ప్రాణాయామముగలదు, ఎట్లనగా (1) మూలాధారమునుండి ప్రాణవాయువును షడాధారంబుల మీదుగా బ్రహ్మరంధ్రమునకు తీసుకొనిపోయినిలుపుట రేచక మనబడును, మరల (2) బ్రహ్మరంధ్రము నుండి క్రిందికి షడాధారముగల మార్గముగా మూలాధారంబున తెచ్చిచేర్చుట పూరకమనబడును (3) బ్రహ్మరంధ్రమునందు జేర్చి అచ్చట కొంతకాలమువరకు నిలుపుట కుంభక మనబడును. ఈప్రాణాయామము అంతర్ప్రాణాయామమనబడును. ఈ రెండువిధములైన ప్రాణాయామంబులలో గురుముఖంబున నేదైనా నొకదాని తెలిసికొని అభ్యసించి ప్రాణవాయువును వశపరచు కొనవలయును, ఇట్లు ప్రాణవాయువును వశపరచుకొనుటే యోగాభ్యాసమునకు ముఖ్యమైన విషయము, ఈప్రాణాయామ అభ్యాసమును

కడుపునిండా అన్నముండునప్పుడు చేయరాదు మలబాధజలబాధలుదీర్చు
కొనిన పిమ్మట పరకడుపుగా నుండునప్పుడు అభ్యసించవలయును ముఖ్య
ముగాప్రాతఃకాలమునందునుసంధ్యాకాలమునందునుఅభ్యసింపవలయును
మఱియు ముద్రలలక్షణంబును జెప్పుచున్నాను. విను మని యిట్లనియె.

## పం చ ము ద్ర లు.

(1) రెండు కన్నులను వొక్కటిగా జేర్చి కదలింపక ముక్కుకొనలో దృష్టి
నిలిపి చూచుచుండుట భూచరిముద్ర అనబడును. (2) కన్నులు మూసి
యైనను, లేక తెరచియైనను ముఖమును కొంచెము పైకెత్తి నల్లగుడ్డం
తయు లోపలికి పొర్యేటట్లు త్రిప్పి తెల్లగుడ్డుమాత్రము కనుపడునట్లు
చేసుకొని లోపల కనుబొమ్మలనడుమ అనగాభ్రూమధ్యంబునకు పై భాగ
మున నలాటమందు మనస్సును దృష్టిని నిలిపి చిదాకాశంబును జూచు
నడుమ చూపునిలిపి మీాదనున్న లలాటంబును చూచుచుండుట మధ్య
లక్ష్య మనియు, అంతర్లక్ష్యముద్ర అనియు చెప్పబడును. (4) చెవులు
కన్నులు ముక్కు రంధ్రములు మూసి భ్రూమధ్యంబునందు మనస్సునిలిపి
దశవిధ నాదంబులనువినుచు చిత్కళను దర్శించుచుండుట, షణ్ముఖముద్ర
యనబడును, (5) రెండుకన్నులను దెఱచుకొని చూపులను పై కెత్తిభ్రూ
మధ్యమునంజేర్చిచిత్కళనుదర్శించుచుండుట.బాహ్యఖేచరి, లేకశాంభవీ

## త్రి వి ధ దృ ష్టు లు.

ముద్ర యనబడును. మఱియు త్రివిధదృష్టు లెట్లనగా. (1) రెండుకన్నుల
ఱెప్పలను గదియ మూసి భ్రూమధ్యంబునందు దృష్టి నిలిపి చూచుట
అమావాస్యదృష్టి యనబడును, ఇది షణ్ముఖముద్రకు సాధనమైనది. (2)
ముక్కాలుభాగము కన్నులనుమూసి కాలుభాగము తెరచుకొని భ్రూ
మధ్యంబునందు దృష్టినిలిపి చూచుట పాడ్యమిదృష్టి అనబడును, ఇది
బాహ్యఖేచరి అనగా శాంభవీముద్రకు సాధనము. (3) నల్లగుడ్డంతయు
లోపలికిత్రిప్పి తెల్లగుడ్డుమాత్రము బయట కనుపడునట్లుచేసుకొని (తాలు
మూల ద్వాదశాంతము వఱకు) అనగా దవడలకు క్రిందనుండు యెము
కలు మొదలుకొని కనుబొమలకు పైగా నాలుగంగుళములవఱకు లలా

టంబునందు లోపల దృష్టి నిలిపి చూచుట పౌర్ణమిదృష్టి యనబడును.
ఇది అంతఖ్ఖేచరిముద్రకు సాధనముగా నుండు నని యోగరహస్యంబు
సర్వంబును దెల్పి, నాప్రియమైన పుత్త్రుడా ఓ శుకా! నీవు త్రివిధదృష్టుల
చేత పంచముద్రలం బట్టుచు యోగాభ్యాసమును చేయుచుండు మనిఆజ్ఞా
పించగా ఆ శుకమహాఋషి తండ్రియాజ్ఞాప్రకారము దీర్ఘవైరాగ్యముతో
నీశ్వరవుపాసనయు యోగాభ్యాసమును జేయుచుండగా, ఆ యీశ్వ

## అణిమాదిసిద్ధులు.

రుని యనుగ్రహంబువల్లను యోగసిద్ధివల్లను అణిమాది అష్టసిద్ధులు
గలిగి మహాప్రభావుండై ప్రకాశించుచుండెను. (1) అణిమ అనగా, అణు
ప్రమాణ మైన ప్రాణులందు పరమాణుప్రమాణుడై తాను వ్యాపించి
యుండుట (2) మహిమ అనగా, బ్రహ్మ విష్ణు మహేశ్వర సదాశివ విరాట్టు
పురుషులకంటెను పెద్దవాడై యుండుట. (3) గరిమి అనగా, బ్రహ్మాండము
వలె భారముగా నుండుచు లక్షయేనుగులు కట్టియీడ్చినను కదలక మొదల
కుండుట, (4)లఘిమ అనగా, మేరుపర్వతమంత పెద్దవాడై యుండినను
దూది (లేశము)వలె తేలికగా నుండుట: (5) ప్రాప్తి అనగా, తానుతలచిన
మాత్రమున తన కిష్టమైనపదార్థము తనవద్దకు వచ్చునట్లు చేయుట. (6)
ప్రాకామ్యము అనగా, స్వర్గమర్త్యపాతాళలోకములందు యెక్కడికిపోవ
లయునని తలచుచున్నాడో అక్కడికి ఆక్షణంబే ఆకాశగమనముగాబోయి
చేరుట, (7) ఈశత్వము అనగా, సూర్యుడు చంద్రుడు దేవేంద్రుడు మొద
లగు సకలదేవతలకును తాను ప్రభువుగా నుండునట్లు చేసికొనుట. (8) వశి
త్వము అనగా, మనుష్యులు దేవతలు పులి సింహము మొదలగు మృగ
ములు, పాములు తేళ్లు చీమ దోమ మొదలగు సకలజంతువులను తాను
చెప్పినరీతిగా వినునట్లు వశము చేసుకొనుట, ఇవియేఅణిమాదిఅష్టసిద్ధులు,

## యోగులు పొందు ఫలము.

[శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషి శాశ్వతీ స్సమాః। శుచీనాం శ్రీమతాం
గేహే యోగభ్రష్టోపి జాయతే। అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్, ఏతద్ధి
దుర్లభతరం లోకే జన్మయ దీదృశమ్॥]అను భగవద్గీతరీతిగా యీ యోగము
నుండి సంపూర్ణము గాక తప్పినవాడు స్వర్గాది పుణ్యలోకములను జేరి

అచ్చట బహు కాలము సకలసుఖంబు లనుభవించి పిదప భూలోకమునందు ధనవంతులకు బిడ్డగా బుట్టును, లేక జ్ఞానవంతు లగు యోగులవంశమందు బుట్టును, లీట్లు జ్ఞానికైనను లేక ధనవంతునకైనను బిడ్డగాబుట్టుట యోగాభ్యాసులకే గలుగును గాని తక్కినవారట్లు పుట్టుట బహుదుర్లభము. [శ్లో॥ తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ । యతతేచ తతోభూయస్సంసిద్ధౌ కురునందన॥ ]అను భగవద్గీతరీతిగా యిట్లు యోగభ్రష్టుడై మరణించినవాడు, మరల జ్ఞానివంశంబునం బుట్టి పూర్వజన్మమందు యెక్కడనుండి యోగమును విడిచి భ్రష్టుడైనాడో అక్కడనుండి మరల ఆరంభించి పూర్ణసిద్ధిని పొందగలడు.[ శ్రుతి॥ బ్రహ్మణా సహ ముచ్యతే యోగీ॥ ]అనెడి శ్రుతి రీతిగా యోగమునందు పూర్ణ సిద్ధి పొందిన సంపూర్ణ యోగి ప్రాణవాయువును బంధించి బ్రహ్మరంధ్రముగుండా ప్రాణమునువిడిచిపెట్టి బ్రహ్మలోకమును జేరి అచ్చట బ్రహ్మదేవునివలన తత్త్వవిచారణము చేసి అద్వైతఅభేద ఐక్యజ్ఞానమును గలవాడై ఆత్మానుసంధానం జేయుచు బ్రహ్మదేవుడుండువఱకు అతనితోడ ఆలోకమునందే యుండుచు మహాప్రళయములో బ్రహ్మదేవునితోడ తానున్న శుద్ధ నిరాకారపరబ్రహ్మమునందు ఐక్యమగును. ఎంతకష్టపడి యోగము సాధించినను బ్రహ్మలోకమునందైనను పునర్జన్మము గలుగును. ఈ జన్మము విడిచినతోడనే శుద్ధనిర్గుణ పర

## జ్ఞాన మార్గము.

బ్రహ్మమందైక్యము గలుగజాలదు.[ శ్లో॥ అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః । సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ ] అనెడి భగవద్గీతరీతిగా నెట్టి మహాపాపియైనను జ్ఞాన మనెడి తెప్పచేత జననమరణసాగరంబును దాటి బ్రహ్మైక్య మను నిజముక్తిని పొందగలడు.—[ శ్లో॥ యథైధాంసిసమిద్ధోగ్ని ర్భస్మసాత్ కురుతేర్జున । జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా ] అనెడి భగవద్గీతరీతిని అగ్ని యెట్లు కట్టెలను భస్మముగా జేయుచున్నదో, అట్లు జ్ఞానము సర్వకర్మములను నశింపజేసి ముక్తిని జెందునట్లు జేయును. [శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే । తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి॥ ] అనెడి భగవద్గీతరీతిగా పరిశుద్ధమైన జ్ఞానమునకు సమానము యేదియు లేదు. ఈ జన్మమందైనను పూర్వజన్మమందైనను

పుణ్యకర్మములున్ను ప్రాణాయామాది అష్టాంగయోగములను చేసి ముగించిన పుణ్యాత్ములకే యీ జన్మమున జ్ఞానము సిద్ధించును గాని తక్కిన వారికి సిద్ధింపదు, [శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సయతేంద్రియః। జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతిం అచిరేణాధిగచ్ఛతి] అనెడి భగవద్గీతరీతిగా శ్రద్ధగలవాడను, మోక్షాసక్తిగలవాడను, ఇంద్రియయులను వశపఱచుకొన్నవాడను, ఈ జ్ఞానమును జెందునుగాని తక్కినవారు జ్ఞానమార్గమును దెలుసుకొనజాలరు. జ్ఞానమును పొందినమాత్రమున సకలదుఃఖములు నశించి పరమశాంతి యగు మోక్షమును జెందగలడు. [శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్ధ దానశ్చ సంశయాత్మా వినశ్యతి। నాయం లోకో స్తి నపరో నసుఖం సంశయాత్మనః॥] అనెడి భగవద్గీతరీతిగా బ్రహ్మ జ్ఞానము లేనివాడు జననమరణప్రవాహములో జిక్కి నశించును, ఈ గురు వాక్యమునందు నమ్మకము లేనివాడున్ను నశించును, ఈ జ్ఞానమార్గము నందు సందేహములు గలవాడున్ను నశించును, కాబట్టి నీకు సకల సందేహ ములు నశించి బ్రహ్మజ్ఞానము గలుగుటకుగాను తత్త్వబోధ జేయుచున్నాను శ్రద్ధగలవాడై వినుమని యిట్లనియె. [శ్రుతి॥ సపర్యగా చ్ఛుక్రమకాయ మవ్రణ

## ప్రపంచ సృష్టి క్రమము.

మస్నావిరం శుద్ధ మపాపవిద్ధమ్॥] అనెడి ఈశావాస్యోపనిషత్తురీతిగా, పుత్రా! ఈప్రపంచసృష్టికిముందువొక్కటియైతనకు రెండవది లేనిదై ఆదిమధ్యాంత ములు లేనిదై నామరూపములు లేని శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మ మొకటి స్వయంప్రకాశముగా వెలుగుచుండెను. [కందపద్యము॥ అసమానంబ మశబ్దము। రసగంధ స్పర్శరూప రహితం బగుటం బ్రసరించు నింద్రియంబుల। వసంబుగా దొకటి బరమవస్తువు పుత్రా!॥] ఈపద్యము భారతము శాంతిపర్వము 4-వ ఆశ్వాస ములోనిది, ఓ నా ప్రియపుత్రా! ఆ పరబ్రహ్మము తనకు సమానమైన వస్తువు లేనిది, శబ్దస్పర్శరూపరసగంధములు లేనిది, మనోవాక్కులచేత యిట్టిదట్టిదని చెప్పశక్యముగానిది. [శ్లో॥ సవై నదేవాసుర మర్త్య తిర్యగ్ నస్త్రీ నషండో నపుమాన్ నజంతుః। నాయం గుణః కర్మ నసన్న చాసన్ నిషేధ శేషో జయతా దశేషః॥] అనెడి శ్రీభాగవతశ్లోకరీతిగా పరబ్రహ్మము దేవతలు రాక్షసులు మనుష్యులు మృగములు స్త్రీలు పురుషులు షండుడు మొదలగురూపములు గానిది. నామములు లేనిది, గుణములు లేనిది, కర్మలు లేనిది, ఆపరబ్రహ్మ మునందు [శ్రుతి॥ అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీసరూ

పాహ । అజో హ్యేకో జుషమాణోను శేతే - జహాత్యేనాం భుక్తభోగా మజోన్యః ]
అనుశ్రుతిరీతిగా ఆపరబ్రహ్మమునందు రజ్జుసర్పమురీతిగా మహాశక్తియొకటి
కలిగెను. దానినే మూలప్రకృతి యనియు చెప్పుదురు. అది అమలసత్వ
ప్రధాన మలినసత్త్వప్రధానయని రెండురూపంబులాయెను. అమలసత్త్వ
ప్రధానము చంద్రుని యెడబాయని వెన్నెలరీతిగా సదా పరబ్రహ్మమును
యెడబాయకుండుచు లోకులకు బ్రహ్మజ్ఞానమును గలిగించుటకు కారణ
మైనదిగా నుండును, కాబట్టి దానిని అభిన్నాశక్తి యనబడును. మలిన
సత్వప్రధానము, ఆపరబ్రహ్మమును యెడబాసి అధోముఖంబై ప్రపం
చము సృష్టించుటకు కారణమాయెను, ఇది బ్రహ్మమునుండి యెడబాసి
నందునభిన్నాశక్తియనబడును. ఈమలినసత్త్వప్రధానయనెడుశక్తి తెలుపు,
ఎరుపు, నలుపు వర్ణములు గలదియై సత్త్వరజస్తమోగుణంబులతోడ
ప్రకాశించుచు మాయ, అవిద్య, విక్షేపశక్తు లని మూడురూపంబు
లాయెను. తెల్లనివర్ణమై సత్త్వగుణముతో గూడుకొన్నది మాయ యన
బడును. ఎఱ్ఱనిదై రజోగుణముతో గూడుకొన్నది అవిద్య యనబడును.
నల్లనిదై తమోగుణముతో గూడినది విక్షేపశక్తి యనబడును. (1) సత్త్వ
గుణము గలది యగుమాయయందు పరబ్రహ్మమురీతిగా ఒక ప్రతిబింబము
గలిగెను. ఆ ప్రతిబింబమే ఈశ్వరు డనియు, భగవంతు డనియు, సగుణ
సాకారబ్రహ్మ మనియు, మాయాశబలిత బ్రహ్మ మనియు జెప్పబడును.
[కందపద్యము॥ మాయశబలుం డై యటు । సేయక పోరామిభూతసృష్టి యొనర్చున్ । మాయ
నెడబాప భూతని । కాయాభావ మగు నిదియు కవిజనముఖ్యా ] ఈ పద్యము భార
తము శాంతిపర్వము 5-వ ఆశ్వాసములోనిది. ఆమాయాశబలిత బ్రహ్మ
మగు భగవంతుడు ఆమాయను స్వాధీనముగా జేసికొని మాయావినోది
యగుచు త్రిగుణాత్మకుడై బ్రహ్మవిష్ణురుద్ర స్వరూపంబులతోడ ప్రపంచ
మును సృష్టిస్థితిసంహారములు చేయుచుండును. (2) ఎఱ్ఱనివర్ణమై రజో
గుణము గల అవిద్యాశక్తి, నానాభిన్నరూపములుగా ఖండఖండములుగా
నుండును. ఈ అవిద్యయందు బ్రహ్మము ప్రతిబింబించెను. ఆప్రతిబింబములే
జీవాత్మలనబడును. (3) భగవంతుడు జీవాత్మలకు సుఖదుఃఖాది భోగంబు
లనుభవించుటకుగాను ప్రపంచము సృష్టింపదలంచి తమోగుణప్రధాన

మగు విక్షేపశక్తిని వీక్షించగాతక్షణమే ఆవిక్షేపశక్తినుండి శబ్దతన్మాత్రగా నుండు సూక్ష్మ ఆకాశభూతముబుట్టెను. దానియందుండి స్పర్శతన్మాత్రగా నుండు సూక్ష్మవాయుభూతమును, దానినుండి రూపతన్మాత్రగా నుండు సూక్ష్మఅగ్నిభూతమున్ను, దానినుండి రసతన్మాత్రగా నుండు సూక్ష్మజల భూతమున్ను, దానినుండి గంధతన్మాత్రగా నుండు సూక్ష్మపృథివి భూతమున్ను, గలిగెను. ఇవియే సూక్ష్మపంచభూతము లనబడును. ఈ సూక్ష్మభూతములవలన సకలజీవులు భోగంబు ననుభవించుటకు సాధనంబుగా నుండు సూక్ష్మశరీరము గలిగెను. ఎట్లనగా, ఈ సూక్ష్మపంచభూతములు

సూక్ష్మశరీరవివరణము.

సత్త్వరజస్తమోగుణములతో గూడుటవలనసత్వసూక్ష్మపంచభూతములని యు, రజస్సూక్ష్మపంచభూతములయు, తమోసూక్ష్మపంచభూతము లనియు మూడువిధములాయెను. అందులో సత్త్వగుణముతో గూడినసూక్ష్మపంచ భూతములు, సత్వసమష్టి సూక్ష్మపంచభూతములనియు, సత్వవ్యష్టి సూక్ష్మ పంచభూతము లనియు రెండువిధము లాయెను. సమష్టి యనగా అఖండ భాగము, వ్యష్టి యనగా ఖండభాగములుగా నగునవి. (*) సత్త్వసమష్టి సూక్ష్మపంచభూతము లొకటిగాజేరి మనస్సుబుద్ధిఅనెడి రెండుతత్త్వములు గలిగెను. సత్త్వవ్యష్టి సూక్ష్మపంచభూతములు ఒక్కొక్కటిన్ని వేఱు వేఱుగా వరుసగా శ్రోత్రము. త్వక్కు, నేత్రము, జిహ్వ, ఘ్రాణము, లనెడి జ్ఞానేంద్రియంబు లాయెను. ఎట్లనగా. (1) సత్త్వవ్యష్టి సూక్ష్మఆకాశము వలన శ్రోత్రమున్ను, (2) సత్త్వవ్యష్టి సూక్ష్మవాయువువలన త్వక్కున్ను, (3) సత్త్వవ్యష్టి సూక్ష్మఅగ్నివలన నేత్రమున్ను. (4) సత్త్వవ్యష్టి సూక్ష్మ జలమువలన జిహ్వయు, (5) సత్త్వవ్యష్టి సూక్ష్మపృథివివలన ఘ్రాణమును గలిగెను. ☞ ఈ యేడుతత్త్వములున్ను సత్త్వగుణముయొక్క అంశము లగుటవలన జ్ఞానేంద్రియంబులగుచున్నవి. రజోగుణముతో గూడిన సూక్ష్మపంచభూతములున్ను, సమష్టివ్యష్టిగా రెండువిధము లాయెను, రజో సమష్టి సూక్ష్మపంచభూతములు ప్రాణాదిపంచ వాయువు లయ్యెను. రజో వ్యష్టి సూక్ష్మపంచభూతములు వేఱువేఱుగా వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదము, అనెడి కర్మేంద్రియంబు లాయెను. ఎట్లనగా, (1) రజో వ్యష్టి సూక్ష్మఆకాశమువలన వాక్కు పుట్టెను. (2) రజోవ్యష్టి సూక్ష్మ

వాయువువలన పాణిగలిగెను. (3) రజోవ్యష్టి సూక్ష్మఅగ్నివలన పాదము గలిగెను. (4) రజోవ్యష్టిసూక్ష్మజలమువలనగుహ్యము పుట్టెను. (5) రజోవ్యష్టి సూక్ష్మపృథివివలన గుదముపుట్టెను.

## సూక్ష్మశరీర వివరణ చక్రము.

| అపంచీకృత సూక్ష్మపంచ భూతములు. | ఆకాశము. | వాయువు. | అగ్ని. | జలము. | పృథివి. | సత్త్వరజ సూక్ష్మభూత ములు. |
|---|---|---|---|---|---|---|
| సత్త్వసమష్టి సూక్ష్మపంచ భూతములు. | మనస్సు. | | | బుద్ధి. | | అంతరింద్రియ ములు. |
| రజస్సమష్టి సూక్ష్మపంచ భూతములు. | సమాన వాయువు. | వ్యాన వాయువు. | ఉదాన వాయువు. | ప్రాణ వాయువు. | అపాన వాయువు. | పంచ ప్రాణములు. |
| సత్త్వవ్యష్టి సూక్ష్మపంచ భూతములు. | శ్రోత్రము. | త్వక్కు. | నేత్రము. | జిహ్వ. | ఘ్రాణము. | జ్ఞానేంద్రియం బులు. |
| రజోవ్యష్టి సూక్ష్మపంచ భూతములు. | వాక్కు. | పాణి. | పాదము. | గుహ్యము. | గుదము. | కర్మేంద్రియం బులు. |

☞ ఈ పదియేడు తత్త్వములతో గూడినదే సూక్ష్మశరీరము దీనితో గూడుకొని జీవులు స్థూలశరీరంబుద్వారా సకలభోగంబు లనుభవించుచు

పుణ్యపాపకర్మములు జేయుచు మరణకాలంబున స్థూలశరీరమును విడిచి ఈసూక్ష్మశరీరముతోడ స్వర్గనరకాదిపదవులం జేరుచు అచ్చట వారివారి కర్మానుసారంబుగా సుఖదుఃఖము లనుభవించుచు కర్మ శేషంబునకుగాను మరల భూలోకంబునందు వారివారి పూర్వకర్మపరిపాకముకొద్ది స్థూలశరీరంబునందు వ్యాపించి మనుష్య పశు పక్షి క్రిమి కీటకాది జన్మంబు లెత్తుచుందురు.

☞ ఇట్లు సూక్ష్మశరీరముతో గూడియుండు జీవాత్మలకు స్థూలశరీరమున్ను, ఈ జీవాత్మలు వారివారి కర్మానుసారముగా పదవుల జెందుటకుగాను ౧౪ - భువనములతో గూడిన ప్రపంచమున్ను, మఱియు ఈ జీవాత్మలు అనుభవించుటకు సకలభోగపదార్థములున్ను కలుగజేయుచు ఈశ్వరుడు తమోగుణముతో గూడిన సూక్ష్మపంచభూతములను స్థూలపంచభూతములుగా జేసి ఆస్థూలపంచభూతములను, రెండుగా భాగించి మొదటిభాగమును ౧౪-భువనములతో గూడిన ప్రపంచముగా నిర్మించెను. రెండవభాగము స్థూలపంచభూతములను స్థూలశరీరముగా జేసెను. ఎట్లనగా ఈ తమోస్థూలపంచభూతములను, తమోసమష్టి స్థూలపంచభూతము లనియు, తమోవ్యష్టి స్థూలపంచభూతము లనియు రెండుగా భాగించెను, తమోవ్యష్టిపంచభూతములుఒక్కొక్కటిన్ని నాలుగుభాగములగుచు తక్కిన నాలుగుభూతములతోడ జేరుటవలన ౨౫ తత్త్వములతో గూడిన స్థూలశరీరము గలిగెను. ఎట్లనగా,

## స్థూలశరీర పంచీకరణము.

☞ పంచీకరణ మనగా ఒక్కొక్కస్థూలభూతమున్ను ఐదుభాగములగుచు అయిదుతత్త్వము లగుట.

(*) తమోసమష్టి ఆకాశము జ్ఞానమాయెను.
తమోవ్యష్టి ఆకాశము నాలుగుభాగము లాయెను.

(1) ఆ తమోవ్యష్టి ఆకాశములో మొదటి భాగము ఆకాశము, వాయువుతోడం గూడుటవలన మనస్సు పుట్టెను.

(2) ఆ తమోవ్యష్టి ఆకాశములో రెండవభాగము ఆకాశము, అగ్నితోడం గూడుటవలన బుద్ధి పుట్టెను.

(3) ఆ తమోవ్యష్టి ఆకాశములో మూడవభాగము ఆకాశము జలము తోడం గూడుటవలన చిత్తము పుట్టెను.

(4) ఆ తమోవ్యష్టి ఆకాశములో నాలుగవభాగము ఆకాశము, పృథివి తోడం గూడుటవలన అహంకారము పుట్టెను.

ఇట్లు సమష్టివ్యష్టివలన గలిగిన మొత్తము ఈ ఐదున్ను అంతరింద్రియములు. ఇవి ఆకాశపంచీకరణమువలన గలిగినతత్త్వములు—

(*) తమోసమష్టి వాయువు వ్యానవాయువుగా నాయెను.
తమోవ్యష్టి వాయువు నాలుగుభాగము లాయెను.

(1) ఆ తమోవ్యష్టి వాయువులో మొదటిభాగము వాయువు, ఆకాశముతోడం గూడుటవలన సమానవాయువు పుట్టెను.

(2) ఆ తమోవ్యష్టి వాయువులో రెండవభాగము వాయువు, అగ్ని తోడం గూడుటవలన ఉదానవాయువు పుట్టెను.

(3) ఆ తమోవ్యష్టి వాయువులో మూడవభాగము వాయువు, జలము తోడం గూడుటవలన ప్రాణవాయువు పుట్టెను.

(4) ఆ తమోవ్యష్టి వాయువులో నాలుగవభాగము వాయువు, పృథివి తోడం గూడుటవలన అపానవాయువు పుట్టెను.

ఇట్లు సమష్టివ్యష్టివలన గలిగిన మొత్తము ఈ అయిదున్ను పంచప్రాణములనబడును. వాయుపంచీకరణమువలనగలిగినతత్త్వములు.—

(*) తమోసమష్టి అగ్ని నేత్రమాయెను.
తమోవ్యష్టి అగ్ని నాలుగుభాగము లయ్యెను.

(1) ఆ తమోవ్యష్టి అగ్నిలో మొదటిభాగము అగ్ని, ఆకాశము తోడం గూడుటవలన శ్రోత్రము పుట్టెను.

(2) ఆ తమోవ్యష్టి అగ్నిలో రెండవభాగము అగ్ని, వాయువుతోడం గూడుటవలన త్వక్కు పుట్టెను.

(3) ఆ తమోవ్యష్టి అగ్నిలో మూడవభాగము అగ్ని, జలముతోడం గూడుటవలన జిహ్వ పుట్టెను.

(4) ఆ తమోవ్యష్టి అగ్నిలో నాలుగవభాగము అగ్ని, పృథివితోడం గూడుటవలన ఘ్రాణము పుట్టెను.

ఇట్లు సమష్టివ్యష్టివలన గలిగిన మొత్తము ఈఅయిదున్ను జ్ఞానేంద్రియంబు
లనబడును. ఇవి అగ్నిపంచీకరణము వలన గలిగిన తత్త్వములు.

(*) తమోసమష్టి జలము రసముగా అయ్యెను
తమోవ్యష్టి జలము నాలుగుభాగము లాయెను.

(1) ఆ తమోవ్యష్టి జలములో మొదటిభాగము జలము, ఆకాశముతోడం
గూడుటవలన శబ్దము పుట్టెను.

(2) ఆ తమోవ్యష్టి జలములో రెండవభాగము జలము, వాయువుతోడం
గూడుటవలన స్పర్శము పుట్టెను.

(3) ఆ తమోవ్యష్టి జలములో మూడవభాగము జలము, అగ్నితోడం
గూడుటవలన రూపము పుట్టెను.

(4) ఆ తమోవ్యష్టి జలములో నాలుగవభాగము జలము, పృథివితోడం
గూడుటవలన గంధము పుట్టెను.

ఇట్లు సమష్టివ్యష్టివలన గలిగిన మొత్తము యీఅయిదున్ను పంచతన్మాత్ర
లనబడును. ఇవి జలపంచీకరణమువలన గలిగిన తత్త్వములు.—

(*) తమోసమష్టి పృథివి గుద మాయెను.
తమోవ్యష్టి పృథివి నాలుగుభాగము లాయెను.

(1) ఆ తమోవ్యష్టి పృథివిలో మొదటిభాగము పృథివి, ఆకాశముతోడం
గూడుటవలన వాక్కు పుట్టెను.

(2) ఆ తమోవ్యష్టి పృథివిలో రెండవభాగము పృథివి, వాయువుతోడం
గూడుటవలన పాణి పుట్టెను.

(3) ఆ తమోవ్యష్టి పృథివిలో మూడవభాగము పృథివి, అగ్నితోడం
గూడుట వలన పాదము పుట్టెను.

(4) ఆ తమోవ్యష్టి పృథివిలో నాలుగవభాగము పృథివి, జలముతోడం
గూడుటవలన గుహ్యము పుట్టెను.

ఇట్లు సమష్టివలవ గలిగినమొత్తము యీ అయిదున్ను కర్మేంద్రియము
లనబడును. ఇవి పృథివిపంచీకరణమువలన గలిగిన తత్త్వములు.

ఇట్లు ఒక భూతముయొక్క భాగము మఱియొకభూతముతో జేరుట
వలన గలిగిన యీ స్థూలశరీర తత్త్వములు నిన్ను ఆయా భాగము
దానిదాని నిజభూతములో జేరినయెడల సనుస్తతత్త్వములు లయించును
మఱియు నిదిగాక,—

[శ్లో॥ ఆకాశాదీని భూతాని-పంచ తేషాం ప్రకీర్తితాః। గుణశ్శబ్దాదికంపంచ-పంచ కర్మేంద్రియాణిచ। జ్ఞానేంద్రియాణి పంచైతే-ప్రాణాది దశవాయవః। మనోబుద్ధిరహంకార-చిత్తంచేతిచతుష్టయం। తేషాం కారణభూతైకా-ఽవిద్యాషట్త్రింశతః పశుః।విశ్వస్య జగతః। కర్తా-పశోరస్య పరశ్శివః] అనునట్లు పంచభూతములు ౫-ను, పంచ

## స్థూలశరీర పంచీకరణ చక్రము.

| ఆకాశము. | వాయువు. | అగ్ని. | జలము. | పృథివి. | ఇవి తమోగుణ పంచభూతములు. |
| --- | --- | --- | --- | --- | --- |
| జ్ఞానము | మనస్సు. | బుద్ధి. | చిత్తము. | అహంకారము | ఇవి ఆకాశపంచీకరణములు, అంతఃకరణములు. |
| సమాన. | వ్యాన. | ఉదాన. | ప్రాణ. | అపానములు. | ఇవి వాయువు పంచీకరణము ఇవియే పంచ ప్రాణములు. |
| శ్రోత్రము. | త్వక్కు. | నేత్రము. | జిహ్వ. | ఘ్రాణము. | ఇవి అగ్ని, పంచీకరణములు ఇవియే జ్ఞానేంద్రియంబులు. |
| శబ్దము. | స్పర్శము. | రూపము. | రసము. | గంధము. | ఇవి జలపంచీకరణము, ఇవియే పంచతన్మాత్రలు |
| వాక్కు. | పాణి. | పాదము. | గుహ్యము. | గుదము. | ఇవి పృథివిపంచీకరణము ఇవియే కర్మేంద్రియమ్ము. |

తన్మాత్రలు ౫-ను, కర్మేంద్రియంబులు ౫-ను, జ్ఞానేంద్రియంబులు ౫-ను, ప్రాణ అపాన ఉదాన సమాన వ్యాన నాగ కూర్మకృకర దేవదత్తధనంజయము లనెడి ప్రాణవాయువులు ౧౦-ను, అంతఃకరణములు ౪-ను, అవిద్య ౧-న్ని, జీవుడు ౧-న్ని, మొత్తము ౩౬ స్థూలశరీరతత్వము లని

కొందరు చెప్పుదురు. ఈ-౨౫ తత్త్వములతో గూడినదే ఈ స్థూలశరీరము. జీవుడు సూక్ష్మశరీరముతో గూడుకొని ఈ స్థూలము శరీరమునందు వ్యాపించి దీనిద్వారా సకలకర్మములు చేయుచు ఆ కర్మమువలన గలిగిన సుఖదుఃఖంబు లనుభవించుచు మరల మరణించి ఈ స్థూలశరీరమును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ స్వర్గనరకాదిపదవులం జేరుచు అచ్చట నుండి పూర్వకర్మానుసారముగా మరల ఈ భూలోకమునందు తల్లిగర్భము నందు స్థూలశరీరంబులో వ్యాపించి ఆ తల్లిగర్భమునందుండి శిశువుగా భూమిమీఁదజన్మించుచు,ఇట్లు జననమరణసాగరంబున మునిగి మోక్షముం జెందక దుఃఖించుచుండును.

## పంచభూతత్త్వకదంబము.

(1) జ్ఞానము, సమానము, శ్రోత్రము, శబ్దము, వాక్కు ఈ అయిదున్ను ఆకాశభూతములో చేరియుండుటవలన ఇవి ఆకాశకదంబము, లేక ఆకాశపంచక మనబడును.

(2) మనస్సు, వ్యానము, త్వక్కు, స్పర్శము, పాణి ఈ యైదున్ను వాయువు భూతములో చేరియుండుటవలన, ఇవి వాయుకదంబము, లేక వాయుపంచక మనబడును.

(3) బుద్ధి, ఉదానము, నేత్రము, రూపము, పాదము, ఈ ఐదున్ను అగ్ని భూతములో చేరియుండుటవలన, ఇవి అగ్నికదంబము; లేక అగ్ని పంచక మనబడును.

(4) చిత్తము, ప్రాణము, జిహ్వ, రసము, గుహ్యము, ఈ అయిదున్ను జలభూతములో చేరియుండుటవలన, ఇవి జలకదంబము; లేక జల పంచక మనబడును.

(5) అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము ఈ అయిదున్ను పృథివి భూతములో చేరియుండుటవలన, ఇవి పృథివి కదంబము; లేక పృథివిపంచక మనబడును.

## జీవవ్యవహారములు.

ఈ జీవుడు అంతఃకరణములతో గూడుకొని పంచప్రాణవాయువుల సహాయమువలన జ్ఞానేంద్రియంబులందు వ్యాపించి శబ్దాది పంచతన్మాత్ర లనెడి విషయంబుల నెఱింగి కర్మేంద్రియంబులద్వారా సకలకార్యములు చేయుచుండును. ఎట్లనగా,—

(1) జీవుడు కూటస్థుడను అధిదేవతవలన ప్రేరేపింపబడినవాడై నాభి స్థానములోనుండెడి సమానవాయువు సహాయమువలన శ్రోత్రము నందు వ్యాపించి శబ్దములను వినుచు వాక్కుతో మాట్లాడుచుండును.

(2) మనస్సునకు చంద్రుడు అధిదేవత, ఈయధిదేవతవలన ప్రేరేపింపబడిన దగుచు మనస్సు చలించును, అట్లు చలించిన మనస్సు జీవునితోడ కలసికొనగా నాజీవుడు ఈ మనస్సుతోడ గూడుకొని దేహమంతయువ్యాపించియుండు వ్యానవాయువుసహాయమునుచే (త్వక్కంతయు) అనగా శిరస్సు మొదలు పాదములవరకుండు చర్మమంతట సర్వత్ర వ్యాపించి [ఉష్ణము శీతము కఠినము మృదువు] అనెడి నాలుగు విధములగు స్పర్శములను యెఱింగి పాణితోపట్టుట, ఎత్తుట ఇచ్చుట పుచ్చుకొనుట, కొట్టుట, వ్రాయుట, పిసుకుట మొదలగు కార్యము చేయుచుండును.

(3) బుద్ధికి బృహస్పతి అధిదేవత ఈయధిదేవత ప్రేరేపింపబడిన దిగుచు బుద్ధి చలించును, అట్లు చలించి జీవునితోడ గూడుకొనగా జీవుడు బుద్ధితో కలిసి తోని కంఠస్థానమందుండు ఉదానవాయు సహాయమువలననేత్రములందు వ్యాపించి [తెలుపు ఎఱుపు నలుపు పసుపుపచ్చమిశ్రవర్ణము పొడుగు పొట్టి లావు సన్నము] అనునట్టి దశవిధ రూపంబులను యెఱింగి పాదముతో నడచుట, పరుగెత్తుట,నిలుచుట, కూర్చుండుట, ఆడుట మొదలగు కార్యములు చేయుచుండును.

(4) చిత్తమునకు క్షేత్రజ్ఞుడధిదేవత, ఈ అధిదేవతవలన ప్రేరేపింపబడినదగుచుచిత్తము చలించును అట్లు చలించి జీవునితోడగూడుకొనగా జీవుడాచిత్తముతో గూడి హృదయస్థానమందుండు ప్రాణవాయువు సహాయమువలన జిహ్వయందు వ్యాపించి[ఉప్పు పులుసు కారము తీపుచేదువగరు] అనెడు ఆరురసంబుల నెడుగుచుఅన్నపానంబుల భుజించుచు గుహ్యేంద్రియముద్వారా సంభోగానందంబును జెందుచు శుక్లశోణితంబులను మూత్రంబును విడుచుచుండును.

(5) అహంకారమునకు రుద్రుడు అధిదేవత. ఈ అధిదేవతవలన ప్రేరేపింప బడిన దగుచు అహంకారము చలించును. అట్లు అహంకారము చలించి జీవునితో గూడుకొనగా జీవుడు ఆ యహంకారముతోడ గూడుకొని గుదస్థానమందుండు అపానవాయువు సహాయమువలన ఘ్రాణేంద్రియమందు వ్యాపించి (మంచివాసన చెడ్డవాసన) అనెడు రెండువిధము లగు గంధంబులను యెఱింగి గుదముద్వారా మలమును విసర్జించు చుండును.

## జ్ఞానేంద్రియంబులు.

(1) శ్రోత్రము, ఇది ఆకాశములో సంబంధమైన తత్త్వము గనుక ఆకాశగుణమగు శబ్దమును మాత్రము ఎఱుగుచుండును. (2) త్వక్కు, ఇది వాయువులో సంబంధమైన తత్త్వము గనుక వాయుగుణమగు స్పర్శమును మాత్రము యెఱుగుచుండును (3) నేత్రము, ఇది అగ్నిలోసంబంధమైన తత్త్వము గనుక అగ్నిగుణంబగు రూపంబునుమాత్ర మెఱుగుచుండును. (4) జిహ్వ, ఇది జలములో సంబంధించిన తత్త్వము గనుక జలగుణంబగు రసంబును మాత్రము యెఱుగుచుండును. (5) ఘ్రాణము, ఇది పృథివిలో సంబంధించిన తత్త్వము గనుక పృథివిగుణమగు గంధంబుమాత్ర మెఱుగు చుండును. జ్ఞాన మనగా యెఱుగుట. ఈ జ్ఞానేంద్రియంబులు ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క విషయమును యెఱుగుటవలన జ్ఞానేంద్రియములనబడును. జ్ఞానేంద్రియంబులైదున్ను యేది యేది యే యే భూతములో సంబంధించినవో ఆయాభూతనుయొక్క గుణంబును ఆయాజ్ఞానేంద్రియంబు లెఱుగు చుండును గాని తక్కినవాటిని యెఱుంగజాలదు.

## కర్మేంద్రియంబులు.

(1) వాక్కు; ఇదిమాట్లాడుట నములుట మ్రింగుట కఱచుట మొదలగు కార్యములు చేయుచుండుట. (2) పాణి, ఇదియిచ్చుట పుచ్చుకొనుట మొత్తుట మొదలగు కార్యములు చేయుచుండును. (3) పాదము, ఇదినడచుట నిలుచుట పరుగెత్తుట మొదలగు కార్యములు చేయుచుండును. (4) గుహ్యము, ఇదిసంభోగించుటశుక్ల శోణితమూత్రములవిసర్జనకార్యములు చేయుచుండును. (5) గుదము, ఇది మలమును బయటికిత్రోయుచుండును.

కర్మమనగా ఒకకార్యము ఈ కర్మేంద్రియంబులైదున్ను ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క కార్యమును జేయుచుండుటవలన ఇవికర్మేంద్రియంబులనబడును.

ఈ దేహమునందలి తత్వములును ఒక్కొక్క తత్వమును ఒక్కొక్క అధిదేవత ప్రేరేపణచే అది యది దానిదాని కార్యములు చేయుచుండును. ఆ తత్వములను ఆధ్యాత్మికము లనియు, వానికార్యములను ఆధిభౌతికములనియు, వాని అధిదేవతలను ఆధిదైవికములనియు జెప్పబడును.

| సంఖ్య | ఆధ్యాత్మికము. | ఆధిభౌతికము. | ఆధిదైవికము. |
|---|---|---|---|
| 1 | జ్ఞాత. | సకలము యెరుగు జ్ఞానము. | కూటస్థుడు. |
| 2 | మనస్సు. | సంకల్ప, వికల్పములు. | చంద్రుడు. |
| 3 | బుద్ధి. | నిశ్చయించుట. | బృహస్పతి. |
| 4 | చిత్తము. | చపలించుట. | క్షేత్రజ్ఞుడు. |
| 5 | అహంకారము. | దురభిమానము. | రుద్రుడు. |
| 6 | సమానవాయువు. | ఇది నాభిస్థానమందుండుచు మనముతినెడి అన్నము మొదలైనవానిని పచనము చేయును. | జయుడు. |
| 7 | వ్యానవాయువు. | ఇది శరీరమంతట వ్యాపించుచు అన్నరసమును నాడులకు పంచిపెట్టును. | విశ్వయోని |
| 8 | ఉపానవాయువు. | ఇది కంఠస్థానమందుండుచు అన్నము మొదలైన దానిని భక్షించునట్లు చేయును. | అజుడు. |
| 9 | ప్రాణవాయువు. | ఇది హృదయస్థానమందుండుచు ఉచ్ఛ్వాసనిశ్వాసములుగా నాసికారంధ్రములగుండా వెలుపలికి లోపలికి వచ్చుచు పోవుచుండును. ఇట్లు దినమొకటింటికి 21,600 శ్వాసములునడచుచుండును, ఇదియుండుటవల్లనే జీవించియుందురు. | వశిష్టుడు. |
| 10 | అపానవాయువు. | ఇది గుదస్థానమందుండుచు మలమును బయటికిత్రోసి మరల గుదద్వారమును బిగించును. | విశ్వకర్త |
| 11 | శ్రోత్రము. | త్రివిధ శబ్దములను వినుట. | దిక్కులు. |
| 12 | త్వక్కు. | నాలుగువిధములగు స్పర్శములనుయెరుగుట. | వాయువు. |
| 13 | నేత్రము. | దశవిధ రూపములను చూచుచుండుట. | సూర్యుడు. |
| 14 | జిహ్వ. | ఆరువిధములగు రసములను రుచిచూచుట. | వరుణుడు. |
| 15 | ఘ్రాణము | త్రివిధగంధములను వాసనచూచుట. | అశ్వినులు. |
| 16 | శబ్దము. | ఏకదేశశబ్ద గ్రహణము. | సదాశివుడు. |
| 17 | స్పర్శము. | ఏకదేశస్పర్శ గ్రహణము. | ఈశ్వరుడు. |
| 18 | రూపము. | ఏకదేశరూప గ్రహణము. | రుద్రుడు. |
| 19 | రసము. | ఏకదేశరస గ్రహణము. | విష్ణువు. |

| సంఖ్య | ఆధ్యాత్మికము. | ఆధిభౌతికము. | ఆధిదైవికము. |
|---|---|---|---|
| 20 | గంధము. | ఏకదేశగంధ గ్రహణము. | బ్రహ్మ. |
| 21 | వాక్కు. | మాట్లాడుట. | అగ్ని. |
| 22 | పాణి. | ఇచ్చుట, పుచ్చుకొనుట. | ఇంద్రుడు. |
| 23 | పాదము. | వచ్చుట, పోవుట. | ఉపేంద్రుడు. |
| 24 | గుహ్యము. | సంభోగించుట, శుక్లశోణితము అను మూత్రమును విడుచుట. | బ్రహ్మ. |
| 25 | గుదము. | మలవిసర్జనము చేయుట. | మృత్యుదేవత. |

జీ వే శ్వ రు ల శ రీ ర వి వ ర ము.

(1) ఈశ్వరుడు మాయాప్రతిబింబుడు గాన ఈశ్వరునకు మాయకారణ శరీర మనబడును. ఇదే యితనికి సుషుప్తి అవస్థ ఆనంద మయకోశ మనబడును ఈశ్వరుడు యీ కారణశరీరముతో గూడి నప్పుడు ఇతనిని అంతర్యామి లేక అవ్యాకృతుడు అనబడును.

(2) ఈశ్వరుడు సూక్ష్మశరీరముతో గూడినప్పుడు ఇతనికి యిదే స్వప్నా వస్థ యనబడును. ఈశ్వరుడు సూక్ష్మశరీరముతో గూడినప్పుడు ఇత నిని హిరణ్యగర్భు డనబడును. ఈ సూక్ష్మశరీరములో పంచప్రాణ ములు, మనస్సు, బుద్ధి ఈ మూడున్ను చేరియుండుట వలన దీనిలో ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశమున్ను ఒకటిగా జేరియున్నవి.

(3) ఈశ్వరునకు సమష్టి స్థూలభూత పంచీకరణం బగు ఈ మహాప్రపం చమే స్థూలశరీర మగుచున్నది. ఇదియే యితనికి జాగ్రదావస్థ అనియు, అన్నమయకోశమనియు, జెప్పబడును. ఈశ్వరుడు యీ స్థూలశరీరముతో గూడినప్పుడు యితనిని విరాట్టు అనబడును.

(4) ఈ శరీరంబులందు యీ యీశ్వరునకు అధిష్ఠానముగా బ్రహ్మము వసించుటవలన ఆ బ్రహ్మమే పరమాత్మ, సర్వసాక్షీ అనబడును.

(1) జీవుడు అవిద్యాప్రతిబింబము గాన ఆ జీవునకు అవిద్యయే కారణ శరీర మనబడును. జీవుడు దీనితోడ గూడునప్పుడు ప్రాజ్ఞు డనబడును. ఈ కారణశరీరమే జీవునకు నిద్రావస్థ అనియు, ఆనంద మయకోశ మనియు జెప్పబడును.

(2) జీవుడు సూక్ష్మశరీరముతో గూడినప్పుడు ఇతనిని తైజసు డనబడును, ఈ సూక్ష్మశరీరమే జీవునకు స్వప్నావస్థ యగును. ఈ సూక్ష్మశరీరము పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, రూపంబులతో యీ జీవుని ఆవరించుకొని యుండుటవలన దీనిని ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశము లనబడును.

(3) జీవుడు స్థూలశరీరముతో గూడునప్పుడు, ఇతనిని విశ్వుడనబడును, యీ స్థూలశరీరమే యితనికి జాగ్రదావస్థ యనియు, అన్నమయ కోశ మనియు జెప్పబడును.

(4) ఈ శరీరంబులందు యీ జీవునికే అధిష్ఠానముగా బ్రహ్మము వసించుటవలన ఆ బ్రహ్మమే ఆత్మ, కూటస్థుడు జీవసాక్షి అనబడును.

☞ ఈశ్వరునికి శరీరత్రయమున్ను యిచ్ఛామాత్రముచేత గలిగెను. అనగా తాను మాయావినోదియై ప్రపంచమును సృష్టిస్థితిసంహారములు చేయవలయు నని తలచినందువలన తనకు తానే యీశరీరత్రయమును ధరించి సగుణుడై హరిహరాది దేవతారూపములు గలవాడై దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు జేయుచు క్రీడించుచుండును, ☞ అయితే జీవునికిమాత్రము వాని కర్మానుసారముగా యీశ్వరునివలన వానికి శరీరత్రయము గలిగెను.

## అపవాదయుక్తిలక్షణము.

[శ్రుతి॥ తస్మాత్తమః సంజాయతే-తమసో భూతాది ర్భూతాదేః] అనెడు సుబాలోపనిషత్తురీతిగాను, మఱియు, [శ్రుతి॥ అద్వైతం ద్వైత మిత్యాహు-స్త్రీధాతం పంచధా తథా। బ్రహ్మాద్యం స్థావరాంతంచ-పశ్యంతి జ్ఞానచక్షుషః॥ త మేక మేవ పశ్యంతి-పరిశుభ్రం విభుం ద్విజాః। యస్మిన్ సర్వమిదం ప్రోతం-బ్రహ్మస్థావరజంగమమ్॥ తస్మిన్నే వలయం యాతి-స్రవంత్య సాగరే యథా। యస్మిన్ భావాః ప్రలీయంతే-లీనాశ్చ వ్యక్తతాం యయుః। పశ్యంతి వ్యక్తతాం భూయో జాయంతే బుద్బుధా ఇవ॥] అనెడు మంత్రికోపనిషత్తురీతిగాను, వత్సా! శుకా! సముద్రమే తరంగములుగాను నదులుగానుఅయినట్లు అఖండసచ్చిదానందపరబ్రహ్మమే యిట్లుజీవేశ్వర జగత్తులుగా నగుచున్నవి. ఇదే అధ్యారోపయుక్తి యనబడును. కాబట్టి సర్వము బ్రహ్మమే, ఐతే రూపముతో దోచుట మరల రూపము లేక మఱిగిపోవుట అను వికారములు కల్పితంబు లగు తరంగంబులకు గలదు

గాని అధిష్ఠానమగు సముద్రము యేవికారములు లేకనిశ్చలముగా నుండు నట్లు కల్పితంబులగు జీవేశ్వరజగత్తులకు వుత్పత్తి నాశములుగలదు గాని వానికి అధిష్ఠానముగా నుండు పరబ్రహ్మము యేవికారములు లేక నాశ రహితమై యుండును ఇదే అపవాదయుక్తి యనబడును.

## ఆత్మానాత్మవివేకము.

ప్రేతముగా బోవునట్టి ఈస్థూలశరీరము నీవుగావు. ఎందువల్లననగా, పంచభూతములు జడములు, ఈస్థూలశరీరము ఆ పంచభూతముల వలన గలిగినది గాన అది నీవు గావు మనోబుద్ధిఅహంకారములు నీవుగావు; స్థూల సూక్ష్మకారణము లనెడి శరీరత్రయము నీవు గావు. మనస్సు మొదలగు ౨౪-తత్త్వములున్ను నీవు గావు. ఇవి యన్నియు నిన్ను యెఱుగజాలదు. ఇవి జ్ఞానము లేనివి గాన జడము లనియు క్షేత్రమనియు, క్షరమనియు, అనాత్మ యనియు చెప్పబడును. [పద్యము॥ దేహం బనియెడు పెరపున । నూహించును బుధుడు చానసుండుఁగాఁ గాత్మ । స్వాహాప్రియ క్రియఁ బురుషుఁడు । సోహ మనిన కొన్ని రుద్ర యతనిఁ గను టగుఁగా ॥] అనుచు భారతము అనుశాసనికపర్వమున ౪-వ ఆశ్వాసములో హరసనత్కుమార సంవాదంబు నందు చెప్పబడిన పై పద్యమురీతిగా, కట్టె లందుండు అగ్నిరీతిని ఈ దేహమందు యేదైతే వుం డుచు (సోహం సోహం) ఆ బ్రహ్మమే నేను ఆ బ్రహ్మమే నేను అని పలు కుచు, నా దేహము, నాకన్ను నాముక్కు నామనస్సు నాప్రాణము నాబుద్ధి యని ఈ దేహేంద్రియాది సకల తత్త్వములను యెఱుగుచున్నదో, అజ్ఞాన స్వరూప మగు వస్తువే జీవు డనబడును. అతడు జ్ఞానస్వరూపు డగుటవలన చిత్తుఅనియు, క్షేత్రజ్ఞు డనియు, అక్షరు డనియు, పురుషు డనియు చెప్ప బడును. అట్టి ౨౫ వ తత్త్వమగు జీవుడే నీవు గాని ఈ ౨౪-తత్త్వముల తో గూడిన శరీరత్రయము నీవు గావు.

## జీవస్వరూపవిచారణ.

శుకా! అంతఃకరణము అనగా మనసు, దాని కధిష్ఠానచైతన్యమగు ఆత్మ, ఆ యంతఃకరణమునందు ప్రతిబింబించిన (చిదాభాసుడు) అనగా ప్రతి బింబచైతన్యమును ఈ మూడున్ను కాగిన యినుపముద్దవలె వొకటిగా జేరి జీవు డనబడును, ఈమూటిని జేర్చక అంతఃకరణమును మాత్రము జీవు డని

చెప్పెద మన్న యెడల, అది జ్ఞానములేని జడపదార్థము గాన దానినిజీవు డన్న యెడల ఘటము మొదలైన జడపదార్థములనున్ను జీవుడనవలయును. కాబట్టి అంతఃకరణమును జీవుడనగూడదు. ఐతే ఘటము స్వచ్ఛమైనది గాదు కాబట్టి దానిని జీవుడనరాదు, అంతఃకరణము స్వచ్ఛమైనది గనుక దానిని జీవుడని చెప్పెదమన్న పక్షమున, అద్దమున్ను స్వచ్ఛమైనపదార్థము కాబట్టి దానిని జీవు డనవలయును. ఐతే అద్దము బాహ్యపదార్థము గనుక దానిని జీవుడనరాదు. అంతఃకరణము అంతర్పదార్థము కాబట్టి దానినిజీవు డని చెప్పెదమన్న యెడల, అంతఃకరణమురీతిగా ఇంద్రియములున్ను అంతర్పదార్థములే గాన వాటినిన్ని జీవు డనవలయును కాబట్టిఅంతఃకరణమును జీవు డనరాదు. మఱియు జీవుడు (చేతనుడు)అనగా నేనుచేయుచున్నాను; నేను అనుభవించు చున్నాను, అనెడి కర్తృత్వజ్ఞానము గలవాడుగా నున్నాడు;అంతఃకరణముఆకర్తృత్వజ్ఞానము లేనిజడపదార్థముగానదానిని జీవు డనరాదు. అయి తే అంతఃకరణప్రతిబింబమును జీవుడని చెప్పెదమన్న యెడల, అద్దమున్ను దానిలోనిప్రతిబింబమున్ను యెట్లుజడపదార్థములుగా నున్నదో, అట్లు అంతఃకరణమున్ను ప్రతిబింబమున్ను జడము లగుచున్నది కాబట్టి దానిని జీవు డనరాదు. (ఆత్మా నిర్వికారో నిరంజనః-అయమాత్మా బ్రహ్మ) అను శ్రుతిరీతిగా పరబ్రహ్మమగుఆత్మ; కర్తృత్వాదివికారములు లేక నిర్వికారమై సాక్షిమాత్రముగా నున్నదిగాన అట్టి ఆత్మను జీవుడన రాదు. ఐతే అంతఃకరణమును,దానియందు దోచిన ప్రతిబింబమును ఈరెంటిని ఒక్కటిగా జేర్చి జీవు డని చెప్పెద మన్న యెడల, ఈ రెండున్ను రజ్జుసర్పము రీతిగా కల్పితంబులగుటవలన యివి మిథ్య లగుచున్నవి, అప్పుడు జీవుడు ముక్తి పొందుచున్నా డనుమాటకు విరోధ మగుచున్నది. అందువలన ముక్తులెవ్వరు లేక పోవలసివచ్చును. కాబట్టిఅంతఃకరణమును,దాని ప్రతిబింబమును ఈరెంటిని జీవు డనరాదు. అయి తే అధిష్ఠానచైతన్యమగు ఆత్మను,అంతఃకరణ ప్రతిబింబమును యీరెంటిని ఒక్కటిగాజేర్చి జీవుడని చెప్పెద మన్నయెడల, ఆకాశమునందలి చంద్రుడున్ను,దానిరీతిగాప్రతిబింబించిన జలచంద్రుడున్ను చలించుటలేదు. ఐతే జలము చలించుట వలన జలచంద్రుండు చలించునట్లు తోచును గాని వాస్తవముగా జలచంద్రుడు చలించుట లేదు. అట్లుఅధిష్ఠాన పరబ్రహ్మమగుఆత్మయు,ప్రతిబింబమున్ను

చలింపనివారు యేవికారములు లేనివారు. అయితే పాదరసమువలెఅంతః కరణము చలించుటవలన దానియందు దోచిన ప్రతిబింబమున్ను చలించు నట్లు తోచుచుండును గాని వాస్తవముగా అంతఃకరణ ప్రతిబింబము చలిం చుట లేదు కాబట్టి ఆ ప్రతిబింబము కర్తృత్వాది యేవికారములు లేనిది, కాబట్టినిర్వికారమైన ఆత్మను, ప్రతిబింబమును ఒకటిగా జేర్చి జీవుడని చెప్ప రాదు. అయితే అంతఃకరణమును,దాని కధిష్ఠానమగు ఆత్మను ఈ రెంటిని ఒకటిగా జేర్చి జీవు డని చెప్పుదమన్న ఆత్మ సకల పదార్థములందునుఅధి ష్ఠానముగా నిండి యుండుటవలన అద్దమునందును అధిష్ఠానముగా నిండి యుండునుగదా ! అప్పుడు ఆయధిష్ఠాన మగు ఆత్మను, అద్దమును ఈ రెం డును ఒకటిగా జేర్చి జీవుడనవలయును. ఈ రెంటికిన్ని (కర్తృత్వ భోక్తృత్వ వికారములు) అనగా నేను చేయుచున్నాను, నేను అనుభవించుచున్నాను; నేను నాది యనెడి అహంకార మమకారములు లేదు గనుక ఈ రెంటిని జీవుడనరాదు. అట్లు అధిష్ఠాన చైతన్య మగు ఆత్మను,అంతఃకరణమునున్ను ఈ రెంటిని జేర్చి జీవు డనరాదు. అయితే [శ్రు॥ ఆత్మేంద్రియమనో యుక్తం భోక్తే త్యాహుర్మనీషిణః॥ ]అనెడికఠోపనిషత్తురీతిగాఅంతఃకరణముదానికధిష్ఠాన మగు ఆత్మ, అంతఃకరణప్రతిబింబము ఈ మూడున్ను ఒకటిగా జేరియే జీవు నడబడుచున్నది [కందపద్యము॥ ఇనరూపము జలమున దో। చినక్రియ బుద్ధిప్రతి బింబసిద్ధత వెలుగొం। దినయాత్మను పరమార్థత।గను సత్త్వస్థులకు నిజము గానంగదగుణా॥] అనెడి భారతములోనిశాంతిపర్వమునందలిపద్యమురీతిగాను, [కందపద్యము॥ క్షేత్రజ్ఞు డనగ నిఖిల। గాత్ర వ్యాప్తత్వ మహిమ గలిగి సమీరా। నూత్రణమున జీవుం డును। గోత్రమునై సర్వవర్తకుం డగు చుండుణా।] అనెడి భారతములో శాంతి పర్వము 4-వ ఆశ్వాసమునందు చెప్పబడి యుండు పద్యము రీతిగాను, స్యూంతశిలను సమీపించిన సూది చిలించునట్లున్ను, అగ్నిసంబంధ మగు కట్టెలు అగ్నిరీతిగా పదార్థములను దహించునట్లున్ను, అధిష్ఠాన పరబ్రహ్మ మగు ఆత్మసత్తామాత్రమువలన దానిం జేరిన ప్రతిబింబము, ఆత్మరీతిగానే జ్ఞానస్వరూపు డగుచు జీవు డనబడుచు ప్రాణవాయువుతో గూడి సకలశరీ రములందు వ్యాపించి అంతఃకరణ సంగమంబువలన భ్రమించి కీజీవ స్వరూపము మిథ్యయనియు, ఆత్మస్వరూపమే తన నిజస్వరూపమనుటయు

మఱచి దేహాభిమానము గలవాడై అజ్ఞానముచే [కందపద్యము॥ అనఘకులంబు బలంబును । ధనము వయోరూపములను తపమును రాజ్యంబును విద్య యున్ని గూడిన । గును నష్టమదంబు లనియు గాథాత్మలకున్ ।] ప్రియపుత్రా! శుకా! కులమదము, బలమదము, ధనమదము, యౌవనమదము, నేనుఅందగాడను అనెడిరూపమదము, నేనుతపస్సంపన్నుండ ననెడి తపోమదము; రాజ్యమదము, నేను కవీశ్వరుండను మహాపండితుండను అనెడి విద్యామదము అనునీయెనిమిది మదములు తనకు లేవనియు, తానుపరబ్రహ్మమగు ఆత్మస్వరూపుండనియు

## అష్టపాశములు.

తెలియక ఈజీవుండు నీమదము లన్నియు తనకు గలిగినట్లుభావించి, [కంద పద్యము॥ దయయు జుగుప్సయు మోహము । భయమును సంశయము కులము బలశీలములు । న్నియుగూడ నష్టపాశము । లయి వెలయునివాని నాత్మ కడంటక యుండున్ ] మరియు, దయ, విరోధము, మోహము, భయము. సంశయము, కులము, బలము, సదాచారము అను నీ అష్టపాశములు లేని సాక్షిమాత్రమైన ఆత్మస్వరూపమే తానని తెలియక తాను జీవుడని భావించి ఈ అష్టపాశములు గల

## షడూర్మ్ములు.

వాడై [శ్లో॥ బుభుక్షా చపిపాసాచ-ప్రాణస్య-మనసస్స్మృతౌ । శోక మోహౌ శరీరస్య-జరామృత్యూ షడూర్మయః॥ ] ఆకలి దాహము యీ రెండును ప్రాణవాయువు యొక్క వికారములు, శోకము మోహము యీ రెండు మనస్సుయొక్క వికారములు, చావు పుట్టుకలు స్థూలశరీరముయొక్క వికారములు, యీ రెండు యీ యారున్ను షడూర్మ్ములు, ఇవి తనకు లేవనియు, తానుపర బ్రహ్మమగు ఆత్మస్వరూపుం డనియు దెలియక ఈ షడూర్మ్ములు తనకు గలవని భ్రమించి కామ క్రోధ లోభ మోహములు గలవాడై, [శ్రుతిః సంకల్పన స్పర్శన దృష్టి మోహైర్గ్రాసాంబువృష్ట్యాత్మ వివృద్ధజన్మ । కర్మానుగాన్యనుక్రమేణ దేహీ - స్థానేషు రూపా ణ్యభి సంప్రపద్యతే ] అనెడి శ్వేతాశ్వతరోపనిషత్తు రీతిగా ఈ జీవుడు దారా పుత్ర ధనకనకాది ఈలోకమునందలి పదార్థములను దలంచుటవల్లను, స్పృశించుటవల్లను, చూచుటవల్లను మోహించుటవల్లను నానావిధ కర్మములుచేయుచు, మరణించిన వెనుక, ఆకర్మానుసారముగా మరల నానాదేశములందు నానావిధ జన్మము లెత్తుచుండును. [శ్లో॥ శరీరజైః కర్మదోషై-ర్యాతి స్థావరతాంనరః। వాచికైః పక్షి మృగతాం-

మానసై రంత్యజాతితామ్ ] అనెడి శ్లోకమురీతిగా దేహముచే జేయబడినపాప కర్మములకుగాను చెట్లు తీగెలు కొండలుగాను, వాక్కుచే జేయబడిన పాపకర్మములకుగాను పశుపక్షి క్రిమికీటకాదులుగాను, మనస్సుచే దలంచిన పాపకర్మములకుగాను మానవజాతిలో అధమ మైనవాడుగాను పుట్టు చుండును. [శ్లో॥ శుభాశుభ ఫలం కర్మ మనో వాగ్దేహ సంభవమ్ । కర్మజా గతయో నృణా ముత్తమాధమ మధ్యమాః॥ ]అనెడి ప్రమాణము రీతిగా నీజీవుడు చేయునట్టి మానసిక వాచిక కాయికంబు లనెడి మూడువిధములగు పుణ్యపాప కర్మములకు తగినట్లుగా మనుష్య పశు పక్షి క్రిమి కీటకస్థావరాదులందు ఉత్తమ మధ్యమ అధమ జన్మము లెత్తుచుండును [శ్రుతి॥ సత్కర్మ పరిపాకతో బహూనాం జన్మనామంతే - నృణాం మోక్షేచ్ఛజాయతే॥ ]అను పైంగలోపనిషత్తురీతిగా ననేకజన్మములందు దాన ధర్మజప తప వ్రత యాగాదిసత్కర్మములు జేయుటవలనకడపటయొక జన్మంబున నుత్తమమైనమానవుడుగా బుట్టి మోక్షము పొందవలయు నను ఆపేక్షగలవాడై ఒక సద్గురువును వెదకి కనిపెట్టి, [శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా । ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ ] అనెడి భగవద్గీతా వాక్యరీతిగా, ఆసద్గురువునకు సాష్టాంగనమస్కారములు జేసి వారికి చతుర్విధశుశ్రూషలు సేయుచు వారిని మోక్షమార్గమును అనుగ్రహింపు డని వేడుకొనుటవలన ఆ సద్గురుడు కరుణించి తత్త్వబోధ జేసి ఆ శిష్యునికి గల సకలసందేహములు నశించునట్లు చేయును. [పద్యము॥ పురుషుని నవ్యక్తము రెం । డురూపులుగ జూచుటొప్పెడు తెలం గతడుం । బురుషోత్తముండు నరయగ । నిరువురుగా రతడె యాతడీది నిజముసుమీ॥ పద్యము ప్రకృతి దొలగి తన్నుదన్నుగ జూచువివేక దృఢత పంచవింశకుండు । సంగరహితమైన షడ్వింశపదము నిస్సంశయముగ గాంచువంశవర్యా! పద్యము॥ పురుషోత్తముండు పురుషుడు । నిరువు రగుట గలదుగలిగ నేనియొబురుషుం।బురుషోత్తము నందు గలపు । వెరపును నేకత్వమహిమ విజ్ఞాతమగున్॥ పద్యము॥ ఇది విజ్ఞానము కృత్యము।తుది విజ్ఞానంబునడగు దుర్లభము ప్రకాం।తిదశాహీనాత్ములకున్ । పద మదిమోక్షంబు మమతవాసిన గల్గున్. పద్యము॥ జ్ఞానముననకాని జన్మజరామృత్యువుల జయించునట్టి యలఘుమోక్షపదము గల్గ నేరదదె కారణ మగును।జ్ఞానమెల్లభంగి సాధ్యతమము॥ పద్యము॥వినుదృశ్యంబు నదృశ్యం । బును నగు జీవపరతత్త్వమును బ్రహ్మసమా । ఖ్యనెగడు ప్రకృతి కదిలేదనఘా॥]వత్సా! శ్రద్ధగా వినుము, ఈ పద్యములన్నియు

భారతము శాంతిపర్వము 6-వ ఆశ్వాసములోనిది. తర్వాత ఆశిష్యుడు ఈదేహేంద్రియాది సకలప్రపంచమును మాయాభ్రాంతివలన కలుగుటం జేసి ఇవియన్నియు మిథ్య అనుచు వానియందలి ఆశను విడిచిపెట్టి వీనినన్నిటిని వెలుగుచుండెడు జీవస్వరూపుడగు తనకీజీవత్వమున్ను కల్పితంబగుట వలన మిథ్య యనియు, జీవసాక్షిగా నుండు పరబ్రహ్మమగు ఆత్మస్వరూపంబె తన నిజస్వరూపంబనియు (ఆత్మయేపరమాత్మ,పరమాత్మయే ఆత్మయగుటవలన)అట్టిఆత్మస్వరూపుడగు తానేపరమాత్మ, పరమాత్మయే తానని ఆత్మఅభేద ఐక్యజ్ఞానముగలవాడై సదాఆత్మానుసంధానముం జేయుచు సర్వము తానుగా జూచుచు ప్రారబ్ధము నశించినతోడనే దేహము నశించి తాను పరబ్రహ్మమునందు ఐక్యమగుచు ముక్తుడగును.

## ఈశ్వరముక్తిలక్షణము.

పై జెప్పినరీతిగా మాయ, దానికధిష్ఠానమగుపరమాత్మ,మాయాప్రతిబింబము ఈ మూడున్ను ఒకటిగా జేరి ఈశ్వరు డనబడుచున్నాడు ఈశ్వరుడు మాయాసహితుడై ప్రపంచసృష్టిస్థితిసంహారాది కార్యములు చేయుచుండును. ఈ యీశ్వరుడు తనకు ప్రతిబింబస్వరూపము మిథ్య యనియు,అధిష్ఠానమగు కేవలనిర్వికార శుద్ధనిర్గుణపరమాత్మ స్వరూపమే తన నిజస్వరూపమనియు దెలిసి తద్రూపముగా నుండుచు మాయనుదాని కార్యము లగు సృష్టిస్థితిసంహారాది క్రియలను నివర్తిచేసికొన్న యెడల, [శ్రుతి॥ సాకారం సావయవో-నిరవయవం నిరాకారం-తస్మాత్ సాకార-మనిత్యం నిత్యం నిరాకార మితి.] అనెడి మహానారాయణోపనిషత్తురీతిగా, తనదుసగుణమగు సాకారస్వరూపము నశించి కేవల శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మస్వరూప మగును. అనుచు మఱియు వేదవ్యాసుండుశుకునింజూచి,పుత్రా! ఇక నీకు ఆత్మోపనిషత్తునుసంపూర్ణముగా జెప్పబోవుచున్నాను. శ్రద్ధగా విను మని చెప్పందొడంగెను.

## ఆత్మోపనిషత్ప్రారంభము.

[శ్రుతి॥భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః-భద్రం పశ్యే మాక్షిభి ర్యజత్రాః-స్థిరై రంగై స్తుష్టువాగ్ సస్తనూభిః-వ్యశేమ దేవహితం యదాయుః॥] తాత్పర్యము. ఓసురలారా! మేము కర్ణద్వయముచేత మీ మంగళకరమైన వాక్యమును వినుచున్నాము, పూజనీయులైన ఓ యజ్ఞదేవతలారా! మా

నేత్రయుగ్మముచేత మీయొక్క మంగళకరమగు దివ్యరూపమును చూతుముగాక; పటుత్వము గల దేహములవలనను అంగముల వల్లను మిమ్ము లను స్తుతించుచు మా ఆయుష్కాలమంతయు మీకు ప్రియమగునట్టికార్యములను జేయుచు మీయందు భక్తిగలిగి యుందుము గాక. [శ్రుతిః స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః-స్వస్తినః పూషావిశ్వవేదాః-స్వస్తిన స్తార్క్ష్యో అరిష్ట నేమిః-స్వస్తినో బృహస్పతిర్ద దాతు-ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః] తాత్పర్యము. యజ్ఞభోక్తయగు దేవేంద్రుడు, సర్వకర్మసాక్షి యగు సూర్యుడు, సకల శుభములకు మూలాధారుడైన గరుత్మంతుడు, సురగురుండగు బృహస్పతి అను వీరు మాకు మంగళమును యిత్తురుగాక. [శ్రుతి. హరిః ఓం అథాంగిరాః॥] తాత్పర్యము. హరిః ఓం అనునది ఈ ఉపనిషత్తు ప్రారంభించుటకు ముందుగా వేదస్వరూపుడును వేదవేద్యుండును నగు శ్రీమన్నారాయణుని ధ్యానించుట; ఇతనివలన మాకు మంగళము గలుగుగాక అనిఅభిప్రాయము. అంగిరుడను మహాఋషి అధర్వణ వేదశాఖాప్రవర్తకుండు గాన, ఆ యథర్వణవేదమందుండు ఈ ఉపనిషత్తును ఆఋషి చెప్పుచున్నాడు. [శ్రుతి. త్రివిధః పురుషో యత ఆత్మాంతరాత్మ పరమాత్మా చేతి.] తాత్పర్యము. ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ అని మూడువిధములగు ఆత్మలు గలవు. అందులో

## ఆత్మలక్షణము.

[శ్రుతి॥ త్వక్చర్మ మాంస రోమాంగుష్ఠాంగుల్య పృష్ఠవంశ నఖగుల్ఫోదర నాభి మేఢ్రి కట్యూరు కపోల శ్రోత్ర భ్రూ లలాట బాహు పార్శ్వశిరోక్షీణి భవంతిజాయతే మ్రియతే ఇత్యేష ఆత్మా॥] తాత్పర్యము. చర్మము, మాంసము, రోమములు, (పెద్దవ్రేలు మొదలగు అయిదువ్రేళ్లు) వీపులో మధ్య నుండు బ్రహ్మదండియనెడు వెన్నెముక, గోరులు, కాలిమడమలు, కడుపు, నాభి, గుహ్యము, కటిప్రదేశము, తొడలు, చెక్కిళ్లు, కర్ణములు, కనుబొమ్మలు, నెత్తి, భుజములు, ప్రక్కలు, శిరస్సు, నేత్రములు మొదలగు అంగప్రత్యంగ ఉపాంగములతో గూడిన దేహము స్థూలశరీరముఅగుచున్నది. ఇది (అస్తి, జాయతే,

## షడ్భావవికారములు.

వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి॥) అనెడిఆరువికారములుగలది. (1) అస్తి-అనగాతల్లిగర్భమున పిండరూపముగా నుండుట. (2) జాయతే-

అనగా తర్వాత దశమాసంబులు నిండినంతనే తల్లి గర్భమునుండి శిశువుగా బుట్టుట. (3) వర్ధతే-అనగా నానాట అన్నరసముచేత బలిసి యౌవన రూపముగా నగుట. (4) పరిణమతే-అనగా నానాట వృద్ధరూపమగుట. (5) అపక్షీయతే-అనగా నానాట స్థూలముగా నుండు దేహము చిక్కి-పోవుట. (6) వినశ్యతి-అనగా మరణకాలమునందు రూపమే లేకుండా మన్నుతో మన్నుగా మరిగిపోవుట. ఈయారువికారములున్ను యీస్థూల శరీరమునకు సహజలక్షణములుగా నున్నవి. అజ్ఞానులు యీ స్థూలశరీర మునే ఆత్మయని తలంచుచున్నారుగాన దీనికిన్ని ఆత్మయని పేరుగలిగెను.

## అంతరాత్మలక్షణము.

పుత్రా! మఱియు శ్రద్ధగలవాడవై వినుము. [శ్రుతి॥ అథాంతరాత్మా నామ॥] తాత్పర్యము. ఇకమీదఅంతరాత్మను జెప్పుచున్నాడు. [శ్రుతి॥ పృథివ్యాపస్తేజో వాయు రాకాశ-మిచ్ఛాద్వేష సుఖ దుఃఖ కామ మోహ వికల్పనాది స్మృతిలిం గోదాత్తానుదాత్తహ్రస్వదీర్ఘ ప్లుత స్ఖలిత గర్జిత స్ఫుటిత ॥ ముదిత నృత్త గీత-వాదిత్ర ప్రళయ విజృంభితాభిశ్రోత్రా ఘ్రాతా రసయితా నేతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుష-పురాణ న్యాయ మీమాంసాది ధర్మశాస్త్రాణీతి-శ్రవణాఘ్రాణాకర్షణ కర్మవిశేషణం-కరోత్యేషోంతరాత్మా॥] తాత్పర్యము. సూక్ష్మపంచభూతములచేత గలిగిన ౧౭-తత్త్వములతో గూడిన సూక్ష్మశరీరమే స్వరూపముగా గలిగి కోరిక పగ సుఖ దుఃఖములు కామము మోహములు గలిగి మెఱుకమఱపులు సంకల్ప వికల్పములు గలిగి గట్టిగా మాట్లాడుట. (అ ఇ ఉ ఋ ౡ) అను హ్రస్వాక్షరములు (ఆ ఈ ఊ ౠ ౡా) మొదలగు దీర్ఘాక్షరములు మూడు మాత్రలకాలమువఱకు చెప్పెడు ప్లుతాక్షరములు ఇట్టిఅక్షరసహితశబ్దము లను శబ్దించుచు, అనగా పలుకుచు తొట్రుపాటు జెందుచు మేఘమువలె గర్జించుచుసంతోషించుచు. ఆడుచుపాడుచుమృదంగమువీణతంబుర మొదలగు వాద్యములను వాయించుచు మూర్ఛిల్లుచు ఆవులించుచుశబ్దములను వినుచు మంచివాసనలను మూరుకొనుచు రసములనురుచిచూచుచు స్పర్శ పదార్థములను తాకుచు, యెదుటివారు చెప్పుమాటలను సూక్ష్మబుద్ధితో గ్రహించుచుఅహంకరించిసకలకార్యములను జేయుచుపండితుడుగానుండుచు అష్టాదశపురాణములు, తర్కశాస్త్రము, మీమాంసము, (అనగాకర్మ

కాండ జ్ఞానకాండ లనెడి పూర్వమీమాంసము ఉత్తరమీమాంసములు) ధర్మశాస్త్రములు, (అనగా మనుస్మృతి మొదలగు అష్టాదశ స్మృతులు) మొదలగు గ్రంథములను బహుశ్రద్ధతో వినుచు పరిమళములను ఆఘ్రాణించుచు ఆకర్షించుచు ఇట్టి కర్మములను జేయుచు ఈ స్థూలములోపల నుండుచు సూక్ష్మశరీరమే తనకు స్వరూపముగా గలవాడగు (చిదాభాసుడే) అనగా అంతఃకరణ ప్రతిబింబమే జీవు డని చెప్పబడును, ఇతడే అంతరాత్మ యనబడును. వత్సా! మఱియు శ్రద్ధతోడ విను మనుచు

## పరమాత్మలక్షణము.

యిట్లనియె. [శ్రుతి॥ అథ పరమాత్మా నామ॥] తాత్పర్యము. ఇక పరమాత్మ లక్షణమును చెప్పుచున్నాడు. [శ్రుతి॥ యథాక్షర ఉపాసనీయః॥] తాత్పర్యము. వేదాంతంబు లగు ఉపనిషద్వాక్యంబులయందు యేబ్రహ్మమును ఉపాసన చేయదగిన దని చెప్పబడియున్నదో, ఆనాశరహితమైన పరబ్రహ్మమే పరమాత్మ యనబడును. [శ్రుతి॥ సచ ప్రాణాయామ ప్రత్యాహార ధారణా వాలాగ్ర శతసాహస్ర వికల్పనాదిభిశ్చా సలభ్యతే నోపలభ్యతే నజాయతే నమ్రియతే నశుష్యతే నక్లిద్యతే నదహ్యతే నకంపతే నభిద్యతే నస్విద్యతే నిర్గుణ స్సాక్షిభూత శ్శుద్ధో నిరవయవాత్మా కేవలః సూక్ష్మో నిర్మమో నిరంజనో నిర్వికార శ్శబ్ద స్పర్శ రూప రస గంధ వర్జితో నిర్వికల్పో నిరాకాంక్ష స్సర్వవ్యాపీ సోచింత్యో నిర్వర్ణశ్చ పునాత్యశుద్ధా న్యపూతాని నిష్క్రియ స్తస్య సంసారో నాస్తి॥] తాత్పర్యము. ఆ పరబ్రహ్మము, యమనియమ ఆసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనెడి అష్టాంగయోగముచేతను, (అనుమానము చేతను) అనగా ఒకకొండపై ధూమము లేచుచుండగా, అది దానికి కారణ మగు అగ్ని లేకుండా రాజాలదు, కాబట్టి ఆ కొండపై అగ్ని యుండవలయునని సందేహించుట అనుమాన మనబడును. అట్లు చరాచర ప్రపంచమును జూచి దీనికి కారణభూతుడగు పరబ్రహ్మ మొకటి యుండవలయునని అనుమానించి యీ చరాచర జంతుజాల సహిత జగత్తునకు కారణమగు పరబ్రహ్మ మున్నదని సత్యముగానమ్మి వుపాసించుట చేతను, లోకులకు (చామబియ్యము. మఱ్ఱివిత్తనము, గోవుతోక వెంట్రుకలో లక్షభాగములలో నొక భాగముగా గనబడును, అనగా ఆకాశమురీతిని ఆదిమధ్యాంతములు లేక నిరాకారమై సర్వపరిపూర్ణమై, ఇంతచిన్నది ఇంతపెద్దది అని చెప్ప

టకు సాధ్యపడక అవాఙ్మానసగోచరమై ఆవరణరహిత మైనట్టి సచ్చిదా నంద పరబ్రహ్మమును కొందఱు యోగులు మొదలైనవారు అణు పర మాణు స్వరూపములుగా ఆహోజ్యోతిగా శుద్ధస్ఫటికమువలె నున్నదని రూపములు కల్పించుకొని కంటిపాపల నడుమ సూక్ష్మబిందువులో లక్ష్య ముంచి ఉపాసింతురు.) అట్టివారికి మనస్సంకల్పమురీతిగా అట్టి వికల్ప రూపములతో పరమాత్మ ఉపాసనాసిద్ధి పొందిన వారికి గనబడును. ఉపాసనాబలము చాలనివానికి గనబడకను పోవును. ఆ సచ్చిదానంద మగు పరబ్రహ్మము ఇంద్రియములకు గోచరింప నందున అతి సూక్ష్మ మనబడును. అతడు జననమరణములు లేనివాడు జనన మరణాది షడ్భావ వికారములు స్థూల శరీర ధర్మములు గాన ఇవి ఆ పరబ్రహ్మమునకు లేవు. ఆ పరబ్రహ్మము శోషింపడు. తడపబడడు, దహింప బడడు, చలిం పడు, ఛేదింపబడడు, చెమ్మగిల్లువాడు గాడు; ఎందువల్లననగా అతడు పంచభూత స్వరూపుడు గాడు. శోషించుట, దహించుట, చలించుట. ఛేదించుట, చెమర్చుట మొదలగు వికారములు లేవు. కాబట్టి అతనికి ఈ వికార గుణములు లేవు. అతడు మాయా పంచభూత గుణసంబంధ మైన సత్త్వరజస్తమంబు లను త్రిగుణంబులు లేనివాడు. సర్వ సాక్షిగా నున్నాడు. స్వచ్ఛమైనవాడు. శరీరము లేనివాడు గాన శరీర సంబంధమగు తల కన్ను ముక్కు కాళ్ళు చేతులు మొదలగు అవయవములు లేనివాడు. తనకు రెండవ వస్తువు లేనివాడు. అవాఙ్మానసగోచరుడు నేను నాది యనెడు అహంకార మమకారములు లేనివాడు. ప్రకృతి సంబంధ మగు పంచమలములు లేనివాడు షడ్భావవికారములు లేనివాడు. శబ్ద స్పర్శ రూప రస గంధంబు లనెడి పంచతన్మాత్రలు లేనివాడు. ఏల ననగా, ఈ పంచతన్మాత్రలు పంచభూతములయొక్క గుణములు, కాబట్టి ఇవి లేని వాడు. తెలుపునలుపు మొదలగు వర్ణములు, బ్రహ్మచర్యాది నాలుగాశ్రమ ములు, నామరూపములు, బ్రహ్మక్షత్రియాదిజాతులు మొదలగు కల్పనలు లేనివాడు. తనకన్య మేదియు లేకసర్వము తానై పరమానందస్వరూపుడుగా నుండుటవలన తాను కోరదగినపదార్థ మేదియు లేనివాడు. ఆకాశమురీతిగా నంతటనిండి యుండువాడు. ఇట్టి లక్షణములుగల ఆ పర మాత్మమనో

వాక్కులచేత నెఱుగుటకు శక్యముగానివాడు, ఇట్టివాడని చెప్ప గూడని వాడు సృష్టిస్థితిసంహారాదిక్రియలు లేనివాడు. అట్టిపరమాత్మ అపవిత్రమై అశుద్ధము లైన మనబోటిసకలచరాచరవస్తువులనుపరమపావనములుగా జేయుగాక. అతడుమాయవిద్యలనెడిఉపాధిద్వయదోషములు లేనివాడు గనుక అతనికి సంసారము లేదు. [శ్రుతి॥ ఆత్మసంజ్ఞ శ్శివశ్శుద్ధ-ఏక ఏ వాద్వయ స్సదా॥ బ్రహ్మరూప తయా బ్రహ్మ-కేవలం ప్రతిభాసతే॥] తాత్పర్యము. అట్టినిత్యమంగళ స్వరూపుడగు పరమాత్మయే ఈ శరీరంబునందు వసించుటవలన అతడున్ను ఆత్మయనబడుచున్నాడు. ఆత్మస్వరూపుడగుఅతడు ప్రకృతిసంబంధము లేక సజాతీయవిజాతీయ స్వగతభేదము లేదియులేనివాడై సదాబ్రహ్మ స్వరూపముగా నుండుటవలన కేవల నిర్వికారస్వయంప్రకాశుడై వెలుగుచున్నాడు [శ్రుతి॥ జగద్రూపతయా ప్యేతత్ బ్రహ్మైవ ప్రతిభాసతే। విద్యావిద్యాది భేదేన భావా భావాది భేదతః॥] తాత్పర్యము ఆత్మస్వరూపుడగుఆపరబ్రహ్మమే ఈనానావిధనామరూపాత్మక మగు చరాచర ప్రపంచముగా ప్రకాశించు చున్నాడు; ఎట్లనగా, అధిష్ఠానమగు సముద్రజలమే కల్పితంబులగు అలలుగా దోచుచున్నట్లును, మఱియు అధిష్ఠాన మగు ఒకత్రాడే దూరమున సర్పమువలె కల్పితంబై దోచుచున్నను, ఆ త్రాడే అట్లు సర్పముగా దోచుచున్నదిగాని వేఱేసర్పముఒకటి అక్కడ లేనట్లును, పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే కల్పితంబులై స్వప్న ప్రపంచమువలెమిథ్యగానగుఈనానా విధరూప నామాత్మక మగు చరచరా ప్రపంచంబు సర్వంబుగా దోచు చున్నాడు గాని అతని కన్యముగా అణుమాత్రమైన వస్తువుయేదియు లేదు. (విద్యావిద్యలు) అనగా జ్ఞానాజ్ఞానములును, భావాభావములును అతడే అగుచున్నాడు. [శ్రుతి॥ గురుశిష్యాది భేదేన- బ్రహ్మైవ ప్రతిభాసతే॥] తాత్పర్యము॥ గురుశిష్యు లిద్దరున్ను ఆత్మస్వరూపు లగుటవలన వారిద్దరున్ను పరబ్రహ్మ స్వరూపమే. [శ్రుతి॥ బ్రహ్మైవ కేవలం శుద్ధం విద్యతే తత్త్వదర్శనే। నచ విద్యా న చావిద్యా న జగచ్చ నచాపరమ్] తాత్పర్యము. తత్త్వజ్ఞానములేనిఅజ్ఞానదశయందే బ్రహ్మమువేఱు, జగత్తువేఱు, విద్యావిద్యలు వేరుగా నానాభేదములుగా దోచుచుండును గాని, (తత్త్వవివేకము) అనగా ఆత్మా అనాత్మా విచారణచేసిస్వానుభవమును పొందునప్పుడు ఈభేదములేమియు గనబడ

జాలవు, సర్వముబ్రహ్మమాత్రముగానేదోచును. [శ్రుతి॥ సత్యత్వేనజగద్భావం సంసారస్యప్రవర్తకమ్। అసత్యత్వేనభావంతుసంసారస్యనివర్తకమ్॥] తాత్పర్యము. ఈ మాయాకల్పితం బగు జగత్తును సత్యమని భావించుటవలన జనన మరణ సంసారమువృద్ధిపొందుచుండును. ఈజగత్తు అసత్యమని భావించుటవలన జననమరణసంసారమువృద్ధిపొందకనశించును. [శ్రుతి॥ఘటోఽయమితివిజ్ఞాతుం-నియమః కోన్వపేక్షతే।వినాప్రమాణసుష్ఠుత్వం-యస్మిన్ సతిపదార్థధీః॥] ఇది ఘటము లనితెలుగుటకుప్రత్యక్షప్రమాణముండవలయునుఅయితేబ్రహ్మముప్రత్య

## అష్టవిధ ప్రమాణములు.

క్షాది అష్టవిధ ప్రమాణములచేతను పొందగూడనిదిఎట్లనగా, (1) ప్రత్యక్షమనగా; నేత్రములచేత చూడబడెడు నలుపు, ఎరుపు, తెలుపు, పసుపు, పచ్చ, మిశ్రవర్ణము, పొడుగు, పొట్టి, లావు, సన్నము, అనెడి దశవిధరూపములు, ఈదశవిధరూపములు అగ్ని సంబంధమైన తన్మాత్రలు గాన ఇవి బ్రహ్మము గాజాలవు. (యద్దృశ్యం తన్నశ్యమ్) ఇత్యాదివాక్యములచేతకండ్లకు కనబడు పదార్థము లన్నియు నశించునట్టివి, బ్రహ్మముకండ్లచేచూడగూడనిది గాన ప్రత్యక్ష ప్రమాణములకు లోబడనిది, కాబట్టి బ్రహ్మము అప్రత్యక్ష మన బడును. (2) అనుమానము అనగా, కార్యమునకు కారణమున్ను కారణమునకు కార్యమున్ను గల దని వాదించుట. [శ్లో॥ కార్యోపాధిగతో జీవః-కారణోపాధిరీశ్వరః। కార్యకారణవినిర్ముక్తో-పూర్ణబోధోఽవశిష్యతే।] ఇత్యాది వాక్యమురీతిగా అవిద్యా ప్రతిబింబితు డగు జీవుడు కార్యోపాధిని పొందినవాడు. మాయాప్రతిబింబితు డగుఈశ్వరుడుకారణోపాధినిపొందినవాడు. ఈజీవేశ్వరులిద్దరే కార్యకారణోపాధిని పొందినవారుగాని. పరబ్రహ్మము కార్యకారణరహితుడుగావునఅనుమానరహితుడనబడును. (3) ఉపమానమనగా; సజాతీయ విజాతీయ స్వగతభేదములు, అవిలేనివాడు గనుక బ్రహ్మము అనుపమానుడనబడును. (4) శబ్దము అనగా; చెవులకు వినబడు శివకేశవాది నామములు (ఆకాశస్య గుణశ్శబ్దః-నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే) అను శ్రుతిరీతిని ఈశబ్దము ఆకాశగుణమే గాని పరబ్రహ్మము నిశ్శబ్దుడు, కాబట్టి బ్రహ్మము అశబ్ద మనబడును. (5) అర్థాపత్తి, అనగా; ఇక్కడదాఉన్నది, అక్కడదా ఉన్న దని ఒక్క చోటునే నిశ్చ

యించి చెప్పుట, ఐతే పరబ్రహ్మము సర్వపరిపూర్ణుడు గాన అర్థాపత్తి ప్రమాణరహితుడు డనబడును. (6) అభావము అనగా, అసత్యము ఐతే పరబ్రహ్మము త్రికాలములందును సత్యముగానుంకుటవలనఅభావప్రమాణరహితు డనబడును. (7) ఐతిహ్యము అనగా, నూతన నూతనముగా వచ్చుచు పోవుచు నుంకుట, ఇట్లు జగత్తున్ను జీవేశ్వరు లిద్దరున్ను, ఒక్కొక్క ప్రళయమునకున్ను పుట్టుచువచ్చుచునుండువారు, పరబ్రహ్మము రాకపోకలు లేనిది గాన ఐతిహ్యప్రమాణమునకులోబడనివాడు .(8)సంభవము అనగా; ఒకటిగా గూడుట, మరల అనేకభాగములుగా భేదపడుట; ఇవి మాయాకార్యములే గాని పరబ్రహ్మమునందు లేవు గావున పరబ్రహ్మము అసంభవు డనబడును; ఇట్లు అష్టవిధప్రమాణములకు అతీతముగానుండు సచ్చిదానందవస్తువే పరబ్రహ్మము అనబడును. మఱియు, [శ్రుతి॥ అయమాత్మా నిత్యశుద్ధః ప్రమాణే సతి భాసతే।నదేశం నాపి కాలంవా నశుద్ధం వాప్యపేక్షతే॥] తాత్పర్యము. యీ శరీరమందు స్వయంప్రకాశమై అపరోక్షమై యుండు యీయాత్మ సదా సహజముగానే నిర్మలమైనది. అట్టి ఈ యాత్మ శ్రుతిప్రమాణములచేతనే తెలియబడునుగాని కాశీకదక్షేత్రము రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములకు బోవుటవల్లను, ఉత్తరాయణాది పుణ్యకాలములవల్లను పరిశుద్ధిగా నుంకుటవల్లను, తెలియబడజాలదు. అనగా అజ్ఞానముచే ఆత్మ ఆచ్ఛాదింపబడిన దగుచు తాను జీవుడని భ్రాంతిపడుచున్నాడు గాన వేదాంతములైన (తత్త్వమసి) మొదలగు ఉపనిషద్వాక్యములనుచక్కగావిచారించితత్త్వజ్ఞానమునుపొందుట వలన అజ్ఞానము నశించి తాను జీవుడను భ్రాంతియు నశించి ఆత్మతాను కేవలసాక్షిమాత్రబ్రహ్మముగా వెలుగుచుండును. [శ్రుతి॥ దేవదత్తోహమిత్యేతద్విజ్ఞానం నిరపేక్షకం। తద్వత్ బ్రహ్మవిదో ప్యస్యబ్రహ్మాహ మితి వేదనమ్॥] తాత్పర్యము ఒకడు తనపేరు దేవదత్తు డని తెలిసినవెనుక మరల మాటిమాటికి (నేను దేవదత్తుడను, నేను దేవదత్తుడను) అనుచు స్మరింపం బనిలేనట్లు గురువుల వారిమొద్ద తత్త్వవిచారణ చేసి ఆత్మస్వరూపు డగు తానే బ్రహ్మమని తెలిసి ఆత్మానుభవమును పొందినవెనుక సదా తదాకారముగా కేవలసాక్షిమాత్రముగా నుండవలయును గాని మరల (అహంబ్రహ్మాస్మి) నేను బ్రహ్మమైతిని, నేనుబ్రహ్మమైతిననుచుధ్యానింపంబనిలేదు. [శ్రుతి॥ భానునేవ జగత్సర్వం భాస్యతే యస్య తేజసా - అనాత్మక మసత్తుచ్ఛం కిం నుత స్యావభాసకమ్॥]

తాత్పర్యము. సూర్యునివలన ప్రపంచమంతయు ప్రకాశింపఁబడుచున్నది. [జ్యోతిషాం పరో జ్యోతిః నారాయణో - పరో జ్యోతి రాత్మా నారాయణః పరః] ఇత్యాది శ్రుతిప్రమాణములరీతిగా ప్రకాశవంతము లగు సూర్యుడు అగ్ని చంద్రుడు మొదలగు వస్తువులనుకూడా యేబ్రహ్మము తన స్వప్రకాశము చేత వాటిని ప్రకాశింపఁజేయుచున్నదో, ఆబ్రహ్మమునుజడములై తుచ్ఛము లగు ఈ చరాచర ప్రపంచము యెదిన్ని ప్రకాశింపజేయజాలదు. అనగా (తస్య భాసా సర్వ మదమ్) ఇత్యాది శ్రుతులరీతిగాసకల చరాచర ప్రపంచ మును ప్రకాశింపఁజేయు ఆత్మకంటె వేఱుగానేదిన్ని లేదనియు, ఆయాత్మ కంటె అన్యముగా నుండు సకలచరాచర ప్రపంచము మిథ్య లగు జడము లనియు తుచ్ఛము లనియు అభిప్రాయము. [శ్రుతి॥ వేదశాస్త్ర పురాణాని భూతాని సకలా న్యపి - యే నార్థవంతి తం కింను విజ్ఞాతారం ప్రకాశయేత్॥] తాత్ప ర్యము. సకలవేదశాస్త్ర పురాణములున్ను సకలజీవులున్ను యేయాత్మ సత్తామాత్రముచేత అర్థవంతము లగుచున్నవో; అట్టి ఆత్మను ప్రకాశింపఁ జేయునదియేదిన్ని లేదని సత్యముగా నమ్మును.[శ్రుతి॥ క్షుదాం దేహవ్య థాం

## బ్ర హ్మ జ్ఞా ని ల క్ష ణ ము.

త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని-తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ॥] తాత్ప ర్యము. పసిబిడ్డలుఆట్లాడుచుండునప్పుడు యెట్లు ఆకలిన్ని దేహశ్రమయును తెలియక ఆట్లాడు చున్నారో, అట్లుబ్రహ్మజ్ఞాని నేనునాదియనెడిఅహం కార మమకారములను విడిచిపెట్టి సర్వముబ్రహ్మముగా జూచుచు సదా బ్రహ్మమునందే రమించు చుండును, [శ్రుతిః కామాన్ నిష్కామరూపీ సన్-చర త్యేకచరో మునిః స్వాత్మనైవ సదాతుష్టస్స్వయం సర్వాత్మనాస్థితః]తాత్పర్యము. బ్రహ్మజ్ఞాని నిష్కాముడై సకలకోరికలనువిడిచిపెట్టిసదా పరబ్రహ్మమగు తన ఆత్మస్వరూపమందే జ్ఞప్తి గలవాడైతృప్తు డగుచు యెప్పుడును బ్రహ్మస్వరూపుడై యుండును [శ్రుతి. నిర్ధనోపి సదా తుష్టో ప్యసహాయో మహా బలః - నిత్యతృప్త స్త్వభుంజానో ప్యసమ స్సమదర్శనః] తాత్పర్యము. బ్రహ్మజ్ఞాని ధనము లేనివా డయ్యును సదా సంతోషము గలవాడుగా నుండును;ధని కుడు అట్లు సదా సంతోషముగా నుండజాలడు, బ్రహ్మజ్ఞాని సహాయము లేనివాడుగా నున్నను తాను మహాబలము గలవాడుగా నుండును;అనేకు

లను సహాయముగా గలిగి యుండు చక్రాధిపతులుకూడా అంత ధైర్యం బుగా నుండజాలరు, బ్రహ్మజ్ఞాని ఒకవేళ భోజనము చేయకుండినను నిత్య తృప్తి గలవాడుగా నుండును, అనగా ఆకలి దప్పులు ప్రాణవాయువు ధర్మ ములే గాని దేహేంద్రియ ప్రాణాది సకలమునకు సాక్షిగా నుండు నాకు లేవనియు, యెండమావులందు జలముతోచునట్లు భ్రాంతిచే ఆకలిదప్పులు నాకు గలిగినట్లు తోచుచున్నవి. గాని యెంతమాత్రమున్ను నాకు లేదనియు నిత్యానందుడై నిత్యతృప్తుడుగా నుండును, పంచభక్ష పరమాన్నముతో భుజంచినవాడైనను అజ్ఞాని అట్టి నిత్యానందమును నిత్యతృప్తిని పొంద జాలడు. జ్ఞాని అందఱితో సమానునివలెగాకన్నను తానుమాత్రము పక్ష పాతము లేక సర్వమును తనవలెనే జూచు చుండును. [శ్రుతి। కుర్వన్నపి నకు ర్వాణ-శ్చాభోక్తాఫల భోగ్యపి । శరీర్య ప్యశరీరేవ-పరిచ్ఛిన్నోపి సర్వగః ] తాత్ప ర్యము. బ్రహ్మజ్ఞానినిత్యనైమిత్తికాదిసకలసత్కర్మములను జేయుచున్నను, అహంకార మమకారములు లేనివాడగుటవలన చేయనివాడే యగు చున్నాడు శరీర సంబంధములగు సకలసుఖదుఃఖములనుభవించుచున్నను, (కర్తృత్వ భోక్తృత్వములుచిదాభాసునిలక్షణము లేగానివానికి సాక్షిగా నుండు పరబ్రహ్మ మగుఆత్మయే తాననిదృఢనిశ్చయము గలిగియున్నాడు, గాన) ఆ సుఖదుఃఖము లనుభవింపనివా డగుచున్నాడు. శరీరము గల వాడుగాలోకులకుకనబడుచున్నను,(దేహేంద్రియములకు వేఱుగాసాక్షిగా నుండు ఆత్మయే తా నని నిశ్చయించి యున్నాడుగాన) శరీరము లేనివా డగుచున్నాడు, ఒకస్థలమందు ఒకదేహమునం దుండువాడైనను, (ఆత్మ స్వరూపుడై జీవసాక్షిగా నుండు తానే సర్వసాక్షియగు కేవల సర్వపరి పూర్ణపరబ్రహ్మమగుచున్నాడుగాన) తానుసర్వవ్యాపకుడగుచున్నాడు. [శ్రుతి। అశరీరం సదా సంత-మిమం బ్రహ్మవిదం క్వచిత్ । ప్రియాప్రియే నస్పృశత-స్తథై వచ శుభాశుభే॥] తాత్పర్యము. దేహేంద్రియాదులకు వేత్తై కేవలసాక్షి మాత్రుడై అశరీరి యగుచు ఆత్మరూపముగా నుండు యీ బ్రహ్మజ్ఞానిని సుఖదుఃఖములు పుణ్యపాపములు అంటజాలవు. [శ్రుతి। తమసా గ్రస్తవద్భా వా-దగ్రస్తోపి రవిర్జనైః-గ్రస్త ఇత్యుచ్యతే భ్రాంత్యా-హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్॥] తాత్పర్యము. సూర్యుడు రాహుగ్రహముచేత గ్రస్తుడు గాక పోయినప్పటి

కిన్ని లోకులు అజ్ఞానముచేత రాహువు సూర్యుని పట్టి మ్రింగుచున్నాడు అదే సూర్యగ్రహణ మని తలంచునట్లు, [శ్రుతిః తద్వ దేహాదిబంధేభ్యో-విముక్తం బ్రహ్మవిత్తమమ్। పశ్యంతి దేహివ న్మూఢా-శ్శరీరాభాసదర్శనాత్॥] తాత్పర్యము. బ్రహ్మజ్ఞాని దేహము తాననెడి అభిమానము వదలి ఆత్మయే తాననినిశ్చయించి నిర్వికారుడై సాక్షిమాత్రుడై అచలస్వరూపముగా నుండును, కావున ఆ మహాత్ముని పరబ్రహ్మ మని తెలియక లోకులు తమవలెఁ బ్రహ్మజ్ఞానిని జీవునిగా తలంచుచున్నారు. అందువలన బ్రహ్మజ్ఞానికి యేనష్టమున్ను లేదు సుమా. మఱియు, [శ్రుతి. అహి నిర్లయనీవాయం - ముక్త దేహస్తిష్ఠతి। ఇత స్తత శ్చాల్యమానో - యత్కించిత్ ప్రాణవాయునా।] తాత్పర్యము. సర్పము తన కుబుసమునందు అభిమానము లేక విడచిపెట్టునట్లు బ్రహ్మజ్ఞాని దేహాభిమానమును విడిచి ప్రాణవాయువుతోడ గూడుకొని యీ శరీరమందు యిట్టట్టు గదలుచుండును. [శ్రుతి స్రోతసా నీయతే దారు-యథా నిమ్నోన్నత స్థలమ్। దైవేన నీయతే దేహో-యథా కాలోపభుక్తిషు॥] తాత్పర్యము. ఒకనది ప్రవాహముగా బోవుచుండగా అందులో చిక్కుకొన్న ఒకకఱ్ఱ ఆ ప్రవాహ మెట్లు పోవునో అట్లు దానితోకూడా మిట్టపల్లములందు బడుచు బోవుచుండునో, అట్లు ప్రారబ్ధకర్మానుసారముగా వచ్చిన సుఖదుఃఖములను బ్రహ్మజ్ఞానియొక్క శరీరము పొందుచుండును. [శ్రుతిః లక్ష్యాలక్ష్య గతింత్యక్త్వా-యస్తిష్ఠేత్ కేవలాత్మనా। శివఏవస్వయం-సాక్షా-దయంబ్రహ్మవిదుత్తమః।] తాత్పర్యము. అందఱికన్నులకు కనబడు జ్ఞానేంద్రియచేష్ట లగు బాహ్యవ్యాపారములను, ఇట్లు కనుబడని అంతరింద్రియము లగు మనోబుద్ధులయొక్క సంకల్పవికల్ప కర్తృత్వభోక్తృత్వాది వ్యాపారములనువిడిచిపెట్టి బ్రహ్మజ్ఞాని తాను కేవలసాక్షిమాత్ర నిర్వికార స్వయంప్రకాశ పరబ్రహ్మ

## విదేహముక్తిలక్షణము,

స్వరూపుడుగా నేయుండును. [శ్రుతిః జీవన్నేవసదాముక్తః-కృతార్థో బ్రహ్మవిత్తమః। ఉపాధినాశాత్ బ్రహ్మైవ-సన్ బ్రహ్మాప్యేతినిర్ద్వయమ్॥] తాత్పర్యము బ్రహ్మజ్ఞాని జీవించియుండునప్పుడే దేహాభిమానమునువిడిచిపెట్టియుండుటవలన ముక్తుడగుచున్నాడు. మఱియు తానుబ్రహ్మస్వరూపుడుగా నుండుటవలన సకల

మైన సత్కర్మములు చేయకున్నను చేసినంతటి ధన్యు డగుచున్నాడు.
ఘటము పగిలినతోడనే ఘటాకాశము మహాకాశములో చేరునట్లు, ప్రారబ్ధ
కర్మము నశించినతోడనే శరీరత్రయమున్ను జీవోపాధిన్ని నశించి; తాను
అఖండ సచ్చిదానందపరిపూర్ణ పరబ్రహ్మమునందుకలిసిఅభేదపరబ్రహ్మ
స్వరూపు డగుచున్నాడు. [శ్రుతి శైలూషో వేషసద్భావా - భావయోశ్చయథా
పుమాన్।తథైవ బ్రహ్మవిత్ శ్రేష్ఠః- సదా బ్రహ్మైవ నాపరః॥] తాత్పర్యము. ఒక
నాటక సభయందు వేషగాడు రంభాది దేవతా స్త్రీ వేషములను వేసుకొని
ఆడుచుండు నప్పుడు, ఆ వేషములు లేనప్పుడున్ను తానుపురుషుడుగానే
యున్నాడుగాని యెప్పటికిన్ని స్త్రీగా జాలడు; అట్లు బ్రహ్మజ్ఞాని, ముందుతనకు
జ్ఞానము లేక జీవత్వము వచ్చినప్పుడును తర్వాత జ్ఞానముచేత ఆజీవత్వము
పోయినప్పుడున్ను ఈ రెండు కాలములందును బ్రహ్మమేఅగుచున్నాడు.
ఎట్లనగా, వేషగాడు అనేకవిధము లైన వేషములను వేసుకొని ఆడునట్లు
బ్రహ్మమే అవిద్యావశమున నానావిధజీవులుగా తోచుచున్నవి. అయితే
ఆ వేషములన్నియు మిథ్య యగుచు వేషగాడొకడుమాత్రము నిజముగు
చుండునట్లు, బ్రహ్మమేజీవుడుగాతోచుచున్నను అదిభ్రాంతిమాత్రమేగాని
బ్రహ్మము యెన్నడునుజీవుడుగా లేదు [శ్రుతి ఘటేనష్టేయథావ్యోమ-వ్యోమైవ
భవతి స్వయమ్।తథై వోపాధి విలయే-బ్రహ్మైవ బ్రహ్మ విత్స్వయమ్ ] తాత్పర్యము.
ఘటము పగిలినతోడనే ఘటాకాశము మహాకాశములో గలిసి యేకమై
నట్లు, ప్రారబ్ధకర్మమునశించిన బ్రహ్మజ్ఞానినామరూపక్రియలుగలశరీరము
జీవత్వమునునశించి కేవలపరిపూర్ణబ్రహ్మమునందు అభేదఐక్యమగుచున్నా
డు. [శ్రుతి॥ క్షీరం క్షీరే యథాక్షిప్తం-తైలం తైలే జలం జలే। సంయుక్త మేకతాం
యాతి-తథాత్మా న్యాత్మవి న్మునిః ] తాత్పర్యము, పాలుపాలు, నీరునీరు, తైలము
తైలము, కలసి యొకటియగునట్లు, బ్రహ్మజ్ఞాని బ్రహ్మమందైక్యమగుచు
విదేహాము క్తిని పొందుచున్నాడు, [శ్రుతి॥ ఏవంవిదేహ కైవల్య-సన్మాత్రత్వమఖండి
తమ్।బ్రహ్మభావంప్రపద్యైష-యతిర్నావర్తతేపునః ] తాత్పర్యము. విదేహకైవల్య
మును బొందిన జ్ఞాని అభేదపరిపూర్ణ బ్రహ్మస్వరూపుడగుచున్నాడు గాన
మరల జన్మించజాలడు. [శ్రుతి. సదాత్మకత్వవిజ్ఞాన- దగ్ధావిద్యాది కర్మణః।అముష్య
బ్రహ్మభూతత్వాత్ - బ్రహ్మణః కుత ఉద్భవః ] తాత్పర్యము. సత్తామాత్రమగు

పరబ్రహ్మము నేనైతి నను అనుభవజ్ఞానమువలన జన్మములకు కారణములుగా నుండు అజ్ఞానము, కామము, కర్మములు ఈ మూడున్ను స్థూలసూక్ష్మకారణశరీరములున్ను భస్మీపటలముగాదగ్ధమైపోవుటవలనబ్రహ్మజ్ఞానివిదేహముక్తిదశయందు పరిపూర్ణ పరబ్రహ్మమేఅగుచున్నాడు, అట్లు బ్రహ్మస్వరూపుడైనవానికిపునర్జన్మములుగలుగజాలవు. [శ్రుతి॥ మాయాక్లప్తౌ

## బంధవిముక్తులు.

బంధమోక్షౌ-నతు స్వాత్మ వస్తుతః। యథా రజ్జౌ నిష్క్రియాయాం - సర్పాభాస వినిర్గమౌ ] తాత్పర్యము దూరముగా నుండు ఒకత్రాడుజూచి అజ్ఞానము వలన పాము అని భ్రాంతి పడునట్లు, ఆత్మజ్ఞానము లేనివారు తామునిత్యముక్త పరబ్రహ్మ మని తెలియక భ్రాంతిచేత తాము జీవస్వరూపులని తలంచుచున్నారు; అట్టివారికే మాయాకల్పితములైన బంధమోక్షములు గలవు గాని (మరల దాని సమీపంబునకుం బోయి చక్కగా పరీక్షించిచూచిన వెనుక ఛీ ఛీ ఇదిపాముగాదు, త్రాడేఅని భ్రాంతినశించినట్లు) తాను జీవుడనుభ్రాంతిలేనిజ్ఞానికిబంధమోక్షములు లేవు. [శ్రుతి. అవృత్తేస్సదసత్త్వాభ్యాం వక్తవ్యేబంధమోక్షణే। నావృత్తిర్బ్రహ్మణః కాచి-దన్యాభావాదనావృతమ్॥ ]తాత్పర్యము. సంకల్పముశూన్యమగుటవలనబంధమోక్షములు లేవు. బ్రహ్మము అవిద్యోపాధిలేనిదై సంకల్పశూన్యమగు వస్తువుగాన దానికి బంధమోక్షములు లేవు. ఈబంధమోక్షములు అవిద్యాభ్రాంతివలన గలుగునట్టివిగాని సతముగా పరబ్రహ్మ మగు ఆత్మకు బంధమోక్షములు లేవు. [శ్రుతి॥ అస్తీతి ప్రత్యయో యశ్చ - యశ్చ నాస్తీతి వస్తుని। బుద్ధే రేవ గుణావేతౌ-నతు నిత్యస్యవస్తునః॥] తాత్పర్యము. సాధారణముగా మనకండ్లకు కనబడు వస్తువులను (ఉన్నది లేదు) అని నిశ్చయించుట బుద్ధియొక్క వృత్తియే గాని సాక్షిమాత్రస్వరూపు డగు ఆత్మసంబంధమైనది గాదు. ఆత్మ బుద్ధిరూపుడు గాడు కాబట్టి (అస్తి నాస్తి) ఉన్నది లేదు అని నిశ్చయించు వ్యవహారములు ఆత్మకు లేవు. [శ్రుతి॥ అతస్తౌ మాయయాక్లిప్తౌ - బంధమోక్షౌన చాత్మని॥] తాత్పర్యము. కాబట్టి మాయవలన గలిగినటువంటి బంధమోక్షము పరబ్రహ్మమగు ఆత్మకు లేవు. [శ్రుతి॥ నిష్కళే నిష్క్రియే శాంతే - నిరవద్యే నిరంజనే। అద్వితీయే పరే తత్వే - వ్యోమవత్ కల్పనా కుతః॥] తాత్పర్యము. ఆకాశము

రీతిగా నిరాకారమై అవయవములు లేనిదై ఏయొక్క వ్యాపారములున్ను లేనిదై నిర్గుణమై చలనము లేనిదై ఉపశాంతబోధస్వరూపమై దోష రహితమై మాయామలము మొదలగు పంచమలములు లేనిదై తనకు రెండవవస్తువు లేనిదై ప్రకృతికంటెను వేఱై యుండు పరబ్రహ్మమునందుబంధ మోక్షము లనెడు కల్పనలు యెట్లు కలుగును? ఎన్నటికిన్ని కలుగజాలదు. సుమా. [శ్రుతి న నిరోధో న చోత్పత్తి-ర్నబద్ధో నచ సాధకః। నముముక్షు ర్నవై ముక్త-ఇత్యేషాపరమార్థతే త్యుపనిషత్॥] తాత్పర్యము. నాశము ఉత్పత్తిసంసార బంధము మొదలగునవి బ్రహ్మమునకు లేవు కాబట్టి బ్రహ్మస్వరూపు డగు బ్రహ్మజ్ఞానికిన్ని పై జెప్పినట్టి ఉత్పత్తినాశములు సంసారబంధము మొద లైనవి లేవు. సంసారబంధము లేకపోవుటవలన బ్రహ్మానుభవముగల బ్రహ్మ జ్ఞానికి శ్రవణమననాది సాధనము లక్కర లేదు. సాధన చతుష్టయసంపత్తియు అతనికి అక్కర లేదు. అజ్ఞానము, కామము, కర్మాదులనునివృత్తిజేసికొను వాడే ముక్తుడనబడును. బ్రహ్మజ్ఞానికి అజ్ఞానము, కామము, కర్మములు లేవు గనుక తాను వానిని నివృత్తి చేసికొనవలయు నను వ్యవహారములు లేదు; అందువలన తాను ముక్తుడను భ్రాంతియుతనకు లేదు. అజ్ఞానభూమి యందు సంచరించువారే సకలలౌకికవైదిక కర్మములు వర్ణాశ్రమాచార ములున్ను గలదు గాని జ్ఞానభూములయందు సంచరించు బ్రహ్మజ్ఞానులకు పై జెప్పిన వ్యవహారము లేదిన్ని లేవు సుమా. [శ్రుతి హరిః ఓంతత్ సత్ బ్రహ్మా ర్పణమస్తు-భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః॥] తాత్పర్యము. ఈ ఆత్మోపనిషత్తు సంపూర్ణముగా ముగిసెను. ఇట్లు ఈఉపనిషత్తుఅంతములో (భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః) అనెడు ఈ శాంతివాక్యమునుమూడుమార్లు చెప్పవలసి నది, మఱియు పుత్రా! శుకా! ఆణవ కార్మిక మాయిక మాయేయ తిరో

పంచమలములు.

ధానములను పంచమలములు ఏదియనగా; (1) బ్రహ్మజ్ఞానము పలుమాఱు పుట్టుచుండగా దాని మఱుగుపఱచునది ఆణవమలము. (2) వేదాంతవిష యంబులను పెద్దలు బోధించు చుండగా దానియందు బుద్ధి నిశ్చలముగా నిల్వక పరామరికగా నుండుట కార్మికమలము. (3) ఒకప్పుడైనను బ్రహ్మమున్నదను జ్ఞానము పుట్టకుండుట మాయికమలము. (4) సచ్చిదా

నందపరబ్రహ్మమునందు అసత్యబుద్ధిని పుట్టించి తదన్యంబులగు దేవతాంతర మంత్రాంతర మతాంతరము లను సత్యములను బుద్ధి పుట్టించుట తిరోధానమలము. (5) సదా పాపకార్యములందే ఇచ్ఛగలిగి యుండుట మాయేయమలము; ఈ పంచమలములు లేనివారే బ్రహ్మజ్ఞానులు గాని

## అజ్ఞానభూములు.

తక్కినవారు బ్రహ్మజ్ఞానులు గాజాలరు. మఱియు బీజజాగ్రము. జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తి అని అజ్ఞానభూములు యేడు గలవు. అవి యెట్లనగా; (1) బీజజాగ్రము అనగా; శుద్ధనిర్గుణ నిరాకార సచ్చిదానంద పరబ్రహ్మమునందు గలిగినట్టి అవ్యక్తమగు మూలప్రకృతి యనెడి తెలివియే బీజజాగ్ర మనబడును. (2) జాగ్రము అనగా; ఆ తెలివి ప్రపంచాభిముఖమై నేనను అభిమానము గలదియై సంకల్పసహితమై యుండుట జాగ్ర మనబడును; దీనినే మహత్తు అనబడును. (3) మహాజాగ్ర మనగా; ఆ తెలివియే నానావిధ నామరూపములుగా జీవేశ్వర జగత్తులుగానోపజేయుచు నేను నాదియనెడి అహంకార మమకారములే స్వరూపములుగాగలిగియుండుటే మహాజాగ్ర మనబడును; దీనినే అహంకారమనబడును. (4) జాగ్రత్స్వప్న మనగా; జాగ్రదావస్థయందు తానుజూచినవి, చూడనివి అగునట్టి సకలవస్తువులను మనస్సునందు సంకల్పించుకొని మనోరాజ్యము చేయుటజాగ్రత్స్వప్నమన బడును (5) భోజనముచేసి నిద్రించుచు స్వప్నమున జాగ్రదావస్థయందు దాను జూచినదానినన్నియు మనస్సున సంకల్పించుకొని మనోరాజ్యము చేయుట స్వప్న మనబడును (6) స్వప్నజాగ్రము అనగా; మునుపుజాగ్ర దావస్థయందు దానుజూచిన దానిని మఱచి మరల దానిని స్వప్నమున జ్ఞప్తికి తెచ్చుకొనుట స్వప్నజాగ్ర మనబడును. (7) సుషుప్తి అనగా; ప్రపంచమును, దానియందలి పదార్థములును యేదిన్ని బొత్తిగా జ్ఞప్తికి రాక గాఢాంధకారము మూసుకొనియుండు నిద్రావస్థయే సుషుప్తి యనబడును, ఈ యేడున్ను అజ్ఞానభూములు. వీనియందు సంచరించు

## జ్ఞానభూములు.

వారు జనన మరణ ప్రవాహములో దగిలి అల్లాడుచుందురు. మఱియు శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి, అసంసక్తి, పదార్థభావన

తుర్యములని యేడు జ్ఞానభూములుగలవు. అవి యేవియనగా; (1)శుభేచ్ఛ అనగా; దుర్జనసహవాసమును విడిచిపెట్టి మోక్షమును పొందవలయునని ఆశ గలుగుట. (2) విచారణ అనగా; సజ్జనసహవాసము చేసి వారు బోధించునీతివాక్యములవలన వేదాంతశాస్త్రములు చదివితత్త్వవిచారణ చేయుట. (3) తనుమానసి అనగా; అట్లు తత్త్వవిచారణ చేసి బ్రహ్మము సత్య మనియు, తక్కిన తనుకరణ భువన భోగములన్నియు అసత్యము లనియు తెలిసి దేహాది సకలప్రపంచంబునందు ఆశవిడిచిమహావైరాగ్యముతో కామక్రోధలోభ మోహాదులనుదెగనడిచి సదా పరబ్రహ్మమును పరోక్షముగా ధ్యానించు చుండుట. (4) సత్త్వాపత్తి అనగా: (తత్త్వమసి)అనెడు మహావాక్య విచారణ చేసి దేహేంద్రియ ములకు సాక్షిగా నుండు ఆత్మస్వరూపు డగు తానే పరబ్రహ్మ మనియు, పరబ్రహ్మమే తాననియు తెలిసి అపరోక్షజ్ఞాని యగుచు సదా (అహం బ్రహ్మాస్మి)అనుచు ఆత్మానుసంధానముం జేయుచుండుట. (5) అసంసక్తి యనగా; అట్లు ఆత్మయే సత్య మని యెఱింగి ఆత్మానుసంధానమును జేయుచు అసత్యము లగు దేహాదిప్రపంచమును మఱచిపోవుట అనగా, సంకల్పశూన్యముగా నుండుట. (6) పదార్థభావనఅనగాసముద్రమునకు వేఱుగా తరంగంబులు లేనట్లు ఆత్మస్వరూపు డగు దాను తన కన్యముగా ప్రపంచము లేదనియు ఈ ప్రపంచంబు తనయందు కల్పితం బగుచు దోచుటవలన ఇది మిథ్య యనియు నిశ్చయించి సదా త్రిపుటిరహితు డగుచు సకలదృశ్యములను మఱచి సాక్షిమాత్రుడై ఆనందించు చుండుట;దీని నే జీవన్ముక్తి యనియు,తుర్యావస్థ యనియుజెప్పుదురు. (7) తురీయము అనగా; ఆకలి దప్పులు మొదలగు యేవికారములు లేక అన్నపానాదులనువర్జించిసకలప్రపంచవాసనలునశించి ప్రాణవాయువును సహస్రారమందు జేర్చి ఇట్టట్టు గదలకపట్టికుంభించి నిలిపి కేవలపరబ్రహ్మము తానుతానై సదా నిర్వికల్పసమాధియం దుండుట; దీని నేకొందరు విదేహముక్తి యని జెప్పుదురు అయినను యదిసరికాదు, ఏలఘటము పగిలినంతనే ఘటాకాశము మహాకాశములో గలిసి యేకమగునట్లు, ప్రారబ్ధకర్మము నశించి నంతనే దేహమున్ను జీవోపాదిన్ని నశించి ప్రత్యగాత్మ పరబ్రహ్మము నందైక్యమగుటే విదేహముక్తి యనియు,విదేహకై

వల్యమనియు జెప్పబడును. శుభేచ్ఛ, విచారణ, తనుమానసిఅనెడి ఈ మూడుజ్ఞాన భూములందు సంచరించువారు అభ్యాసులు గాన వారికి జగత్తు విషయ రూపముగా గోచుటవలన అది జాగ్రదావస్థ యనబడును. తక్కిన నాలుగుభూములందు సంచరించువారు ఆరూఢులనియు, అనుభవజ్ఞానులని యు జెప్పబడును. అందులో సత్త్వాపత్తియనెడుజ్ఞానభూమియందు సంచరించు వారికి జగత్తు సంకల్పరూపముగా దోచుటవలన అది స్వప్నావస్థ యన బడును. నంసక్తియనెడి జ్ఞానభూమియందుసంచరించువారికి జగత్తుతోచక పోవుటవలన అది నిద్రావస్థ యనబడును. పదార్థభావన యనెడి జ్ఞానభూమి యందుసంచరించువారికి జగత్తు చిన్మాత్రముగా గోచుటవలనఅదితుర్యా వస్థయనబడును. తురీయమనెడిజ్ఞానభూమియందు సంచరించువారికి (ద్రష్ట దృక్కు దృశ్యము లనెడి) త్రిపుటి గోచక సత్తామాత్రముగా దోచుటవలన అదితుర్యాతీత మనబడును. శుకా! జాగ్రత్తగా నేను జెప్పబోవుదానిని విను మని యిట్లనియె. మొదటి మూడు జ్ఞానభూములయందు సంచ రించుచు మరణించినవారు ఉన్నతమైనపదవులను జేరిఅచ్చటసకలసుఖంబు లనుభవించి మఱల భూలోకమున జన్మించి, మెల్లమెల్లగా క్రమేణానాలు గవభూమి మొదలు యేడవ భూమివఱకు దేనినైనను జేరి జీవన్ముక్తులగుచు మరణించినతర్వాత విదేహకైవల్యముబొందగలరు; గాని, ఆవల జననము నకును మరణమునకును రాజాలరు. మొదటిభూమి యగుశుభేచ్ఛ యందు జేరుటయే బహుకష్టము; మొదటిభూమిలో జేరినయెడల తర్వాత క్రమేణముక్తిపొందగలరు; కాబట్టి అట్టివారికి ముక్తి కరతలామలకముగా

## చతుర్విధబ్రహ్మజ్ఞానులు.

నుండును. జీవన్ముక్తులకు బ్రహ్మజ్ఞానులు, బ్రహ్మవిత్తు బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వర్య బ్రహ్మవిద్వరిష్ఠు లని నలుగురు గలరు. (1) బ్రహ్మవిత్తులు, లోకోపకారార్థముగా సకలసత్కర్మములు జేయుచు గృహస్థాశ్రమమం దుండుచు సదా శిష్యులకు వేదాంతశాస్త్రములు బోధించు చుందురు, లేక సన్న్యాసమునైనను పొంది యుందురు; వీరు సత్త్వాపత్తియనెడు నాలుగవ జ్ఞానభూమిలో సంచరించు చుందురు. [పద్యము॥ లేదని యెవ్వరి నడుగరు । రాదని చింతింపరోరులు రప్పించినచో । కాదని యెద్దియు మానరు । భేద ము వాదముల లేక క్రీడింత్రు మదిన్॥] అనునట్లు ఈ బ్రహ్మవిత్తు లను జ్ఞానులు

తమకు దొరకని వస్తువులను గోరజాలరు, అయ్యో అవి దొరక లేదే అని చింతింపరు, ఇకమీద దొరకబోవు దానికై యెదురుచూచుచు అపేక్షచేత కాచియుండరు, దైవాధీనముగా ప్రారబ్ధ కర్మానుసారము తమకు లభించినవానిని అనుభవించుచుందురు, ఎండవెన్నెలవలెదోచినను చచ్చినపీనుగు మరల బ్రతికి సంచరించుచున్నను ఆకాశమందుండి అమృతము వర్షమురీతిగాగురిసినను ఇవియన్నియు అతిశయముగా దలపజాలరు. (2) (భిక్షాన్నం దేహరక్షార్థమ్) అనునట్లు దేహము సంరక్షించుటకుగాను భిక్షమెత్తిన అన్నమును భుజించి ఏకాంతస్థలమును జేరి బ్రహ్మనిష్ఠ జేయుచుండు వారే బ్రహ్మవిద్వరులు; వీరే ఐదవజ్ఞానభూమి యగు సంసక్తియందు సంచరించువారు. (3) బ్రహ్మవిద్వరీయులు, అనగా ఏకాంతస్థలమునందు జేరి బ్రహ్మనిష్ఠ జేయుచు శిష్యులు మొదలైనవారు మేలుకొలుపగా లేచి అన్నపానాదుల గోరువారు. బ్రహ్మవిద్వరీయు లనబడుదురు; వీరే ఆరవజ్ఞానభూమియందు సంచరించువారు. (4)సదా నిర్వికల్ప బ్రహ్మనిష్ఠలో నుండుచు తానుగానైనను నిష్ఠ విడిచి లేవక, లేక శిష్యులు మేలుకొలిపినను లేవక అన్నపానాదుల వర్జించి ప్రపంచస్మరణలేక సదా సమాధినుండువారు బ్రహ్మవిద్వరిష్ఠు లనబడుదురు; వీరే ఏడవజ్ఞానభూమి యందుసంచరించువారు. అయినను ఈనలుగురున్ను బ్రహ్మపరోక్షజ్ఞానులే గాన ఈ నలుగురికిన్ని ముక్తియందు యెంతమాత్రమున్ను భేదము లేదు సుమా! అని సర్వమును బోధించి శుకునిం జూచి వేదవ్యాసుం డిట్లనియె. ఈ జీవన్ముక్తులగు బ్రహ్మజ్ఞానులుపంచదశ జ్ఞానయోగాంగములతో జ్ఞాన

## పంచదశజ్ఞానయోగాంగములు.

యోగంబు సాధించుచుందురు. ఎట్లనగా; (1)యమము—అనగా; ఆకాశాది పంచభూతములున్ను, శరీరత్రయమున్ను, జ్ఞానేంద్రియకర్మేంద్రియాదిసకల తత్త్వములున్ను సర్వము పరబ్రహ్మమనియు, ఆపరబ్రహ్మమే తాననియు దలంచుటయమమనబడును. (2)నియమము—అనగా; దేహేంద్రియంబులకు సకలమునకు తాను వేఱై విలక్షణుఁడై సాక్షిమాత్రముగా నుండువాడనియు, ఈ యింద్రియ వ్యాపారములున్ను సకల సుఖదుఃఖములున్ను తనకు లే

వనియు, బ్రాహ్మణాదిజాతులు శరీరత్రయము నామరూపక్రియలు త్రిగుణంబులు తనకు లేవనియు తెలిసి సర్వకాలసర్వావస్థలయందును తాను బ్రహ్మానందసాగరములో మునిగియుండుట నియమమనబడును. (3) త్యాగము-అనగా; దేహేంద్రియంబులు తాను గానని వానియందు అభిమానమును లేకుండుట త్యాగమనబడును. (4) మౌనము అనగా; మనోవాక్కులచేత ఇట్టిదట్టిదని వూహించి చెప్పరానట్టి పరబ్రహ్మమే తానని తెలిసి పలుమాఱు వృధాగా మాట్లాడుచుండక మితభాషియై తాను మాట్లాడినప్పటికిన్ని మాటలాడితి ననియుం దలంచక ఏ తలంపులు లేక నిస్సంకల్పుడై నిరంతరము బ్రహ్మానందామృతమును పానము జేయుచుండుట మౌనమనబడును. (5) దేశము-అనగా; ఎక్కడ మనస్సు నిల్పినమాత్రమున సకలేంద్రియ వికారగుణములు నశించి జనన మరణ తాపత్రయసుఖదుఃఖాదులు నశించి తాను సదా బ్రహ్మస్వరూపుడగుచు ఆనందించుచుండునో ఆ స్థలమే దేశమనబడును. (6) కాలము-అనగా; ప్రపంచ సృష్టిస్థితిసంహారముల సంబంధము లగు భూత భవిష్యత్తు వర్తమానముల నెడు త్రివిధకాలములను మీఱి ప్రపంచాతీతముగా నుండు పరబ్రహ్మమే కాలమనబడును. జ్ఞానయోగి అట్టి కాలస్వరూపమగు పరబ్రహ్మము తానై దశవిధప్రళయకాలములకు లోబడక యేకరీతిగా స్వయంప్రకాశముగా వెలుగుచుండును. (7) సుఖాసనము-అనగా; ఏది త్రికాలములందు నాశము లేక సిద్ధముగా నుండునో ఆ పరబ్రహ్మమే ఆత్మస్వరూపుడగు తానని అపరోక్షజ్ఞానము గలవాడై సదా ఆ బ్రహ్మమే తానై యుండుట, ఆసనమనబడును. (8) మూలబంధము-అనగా అష్టపాశబంధములకు కారణముగా నుండు మూలప్రకృతి యనెడు మాయయే మూలబంధ మనబడును; ఏ పరబ్రహ్మమును దర్శించిన మాత్రమున ఈ మూలప్రకృతి యనెడి మూలబంధము తనకు తానే వీడిపోవునో, ఆ పరబ్రహ్మమే మహామూలబంధమనబడును. (9) దేహసామ్యము-అనగా; సముద్రమునందు గలసిన నదులవలె బ్రహ్మానంద సాగరంబున పదునాలుగు యింద్రియములయొక్క వృత్తులు జేరి లయించి తన్మయంబై సమరసము గలిగియుండుటే దేహసామ్యమనబడును. (10) దృక్కు-అనగా; భూచరి ఖేచరి అంతర్లక్ష్యము షణ్ముఖి శాంభవి

## పంచజ్ఞానముద్రలు.

అనెడు జ్ఞానముద్రలందు దృష్టినిలుపుట. ఎట్లనగా; (1) జ్ఞానభూచరిముద్ర

అనగా; బాహ్యేంద్రియంబులగు శ్రోత్ర త్వక్కు నేత్ర జిహ్వా ఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియముల యొక్కయు, వాక్కు పాణి పాద గుహ్యా గుదము లనెడి కర్మేంద్రియముల యొక్కయు, విషయములగు శబ్దస్పర్శ రూప రస గంధవచన దాన గమన విసర్జనానందములందు లక్ష్యము నిలుపుట బాహ్య లక్ష్యమనియు, భూచరియనియు జెప్పబడును. (2) ఖేచరి అనగా; అంత రింద్రియంబు లైన మనోబుద్ధి చిత్తాహంకారవృత్తు లగు సంకల్ప నిశ్చయ చంచల కర్తృత్వములందు లక్ష్యమునిలుపుట ఖేచరియనబడును. (3) మధ్యలక్ష్యమనగా, బాహ్యేంద్రియంబులగు జ్ఞానేంద్రియ కర్మేంద్రి యంబులందును, అంతరింద్రియంబు లగు మనోబుద్ధి చిత్తాహంకారంబుల విషయంబులందును లక్ష్యమునిలుపుటమధ్యలక్ష్యమనబడును. (4) షణ్ముఖి అనగా; ఐదు జ్ఞానేంద్రియంబులందును, మనస్సునందును ఈ ఆరునందు లక్ష్యమునిల్పుట, షణ్ముఖిముద్ర యనబడును. (5) శాంభవి అనగా; పై జెప్పిన నాలుగులక్ష్యములను ఒక్కటిగా జేర్చి అంతర్బాహ్యములందు స్వయంప్రకాశముగా వెలుగుచుండెడు పరబ్రహ్మమగు కేవలసాక్షిమాత్ర మాత్మయందు లక్ష్యమునిలుపుట శాంభవీముద్రయనబడును; ఈశాంభవీ ముద్రయే అన్నిముద్రలలోపల శ్రేష్ఠము; ఇదే పరమదృక్కు అనబడును; దీనినిసాధించువారే నిజమైన బ్రహ్మజ్ఞానులుగానితక్కిన వారుగాజాలరు. [శ్రుతి॥ ద్రష్టృదర్శనదృశ్యానాం-విరామో యత్రవా భవేత్। దృష్టి స్తత్రైవ కర్తవ్యం- ననాసాగ్రావలోకనమ్.] అనునట్లు, (ద్రష్ట దృక్కు దృశ్యములు) అనగా; సకలము జూచుచుండు జీవుడు, జీవసంబంధ మగు జ్ఞానము, జీవునికి దోచు చుండు సకల చరాచరప్రపంచంబు ఈమూడున్ను యెదుట లక్ష్యముంచిన మాత్రమున లయించునో అదియే పరమదృక్కు అనియు, పరమ ఉత్తర శాంభవీముద్ర యనియు జెప్పబడును.

## త్రివిధదృష్టులు.

మఱియు (1) బహిర్లక్ష్య మనగా నేత్రములును దెఱచుకొని మనస్సును చంచలము లేకుండానిలిపి యెదుటనుండుయేదైననొకదృశ్యవస్తువు నందు దృష్టినిలిపి చూచుచుండుట. (2) మధ్యలక్ష్యమనగా నేత్రములను దెఱచిచిత్తమును అచంచలముగావికాగ్రముగానిలిపిభ్రూమధ్యంబునందు

దృష్టినిలిపి బహువిధ చిత్కళలను జూచుచుండుట; ఇందు (దర్శనమునందు) అనగా నేత్రములందే లక్ష్య ముంచి చూచుటవలన ఇది మధ్యలక్ష్య మన బడును. (3)అంతర్లక్ష్యముఅనగా;భ్రూమధ్యంబున కంతరంబున లక్ష్యము నిలిపి అక్కడ నుండు వింతలన్నియు జూచుచుండుట; ఇందు ద్రష్టయందు లక్ష్య ముంచి చూచుటవలన దీనిని అంతర్లక్ష్య మనియు,పూర్వశాంభవీ ముద్ర యనియు జెప్పబడును; ఈ మూడువిధము లగు లక్ష్యములును అభ్యాసులగు తారకయోగము సాధించువారిమార్గములు. ఐతేఅమనస్క జ్ఞానయోగులకు ఈ మూడులక్ష్యములు పనికిరాజాలవు. కేవలముఆరూఢ జ్ఞానులగు అమనస్కయోగులకు (ద్రష్ట దృక్కు దృశ్యములు) చూచువాడగు జీవుడు, వానిచూపులు, వానిచూపులకుకనబడు నానావిధరూపములు ఇవి యే పరబ్రహ్మమునందు లయ మగుచున్నదో, ఆ కేవలసాక్షిమాత్ర పర బ్రహ్మ మగు ఆత్మయందే దృష్టిని జేర్చి తన్మయంబుగా నుందురు గాని తారకయోగులరీతిగా భ్రూమధ్యంబునందు దృష్టి నిలుపజాలరు. ఈపరమ దృక్కుస్థానమేఉత్తరశాంభవీముద్ర,జ్ఞానశాంభవీముద్రఅనబడును.(11) ప్రాణాయామము అనగా; జ్ఞానేంద్రియంబులైదింటిని కర్మేంద్రియంబు లైదింటిని, అంతఃకరణ చతుష్టయమును, పంచప్రాణ వాయువులును మొత్తము ౨౪-తత్త్వములనున్ను, సకలచరాచరములతో గూడిన ఈ ప్రపంచమున్ను పరబ్రహ్మముగాను ఆపరబ్రహ్మమే తానుగాను భావించి స్వస్వరూపమునకంటె అన్యమేదిలేదనిఅఖండవృత్తిగలవారై సాక్షిమాత్రు డై ఆనందించుటప్రాణాయామమనబడును.(1)మనస్సునకుబాహ్యాంతరం బులందు కనబడుచుండు సకలదృశ్యపదార్థములును,కామక్రోధాదులును ఇవి ప్రకృతికల్పితములు గావున ఇవితానుగాననిని షేధించుటే రేచకమన బడును. (2) అజ్ఞాన విపరీతసందేహములు లేకుండా బ్రహ్మమే నేనని యెరు గుటే పూరకమనబడును, (3)తర్వాతసంకల్పవికల్పములులేక సకలదృశ్య ముల మఱచి నిర్వికల్పముగా కేవల ప్రజ్ఞామాత్ర పరబ్రహ్మముతానుగా నుండుటే కుంభకమనబడును; ఇదేజ్ఞానులు జేయు ప్రాణాయామముగాని కర్మయోగులవలె ముక్కులో నుండు ప్రాణవాయువు బిగబట్ట జాలరు. (12) ప్రత్యాహారము అనగా; శాంతశమదమాది సకలసద్గుణంబులను

కామ క్రోధ లోభ మోహాది సకలదుర్గుణములను, ఈ సర్వమును పరబ్ర హ్మముగా దలంచుట ప్రత్యాహార మన బడును. (13) ధారణ అనగా; [శ్రుతి॥ యద్య త్పశ్యతి చక్షుర్భ్యాం - తత్త దాత్మేతి భావయేత్।యద్యత్ స్పృశతి హస్తాభ్యాం - తత్త దాత్మేతి భావయేత్-యద్య చ్ఛృణోతికర్ణాభ్యాం - తత్తదాత్మేతి భావయేత్.] అనెడు త్రైవల్యోపనిషత్తు రీతిగాను; [శ్లో॥ మనసా వచసా దృష్ట్యా-గృహ్యతే స్యై రపీంద్రియైః। అహ మేవనమత్తోన్య-దితిబుద్ధ్యధ్వమంజసా.] అనెడు శ్రీభాగవతశ్లోకరీతిగాను మనకన్నులకు కనబడునది. చేతుల చేత తాకబడునది, చెవులచేత వినబడునది మొదలగు సర్వంబును: అన గా మనస్సునకు గోచరించు సకలంబును పరబ్రహ్మ మని భావించుట ధారణ యనబడును. (14) ధ్యానము అనగా; [శ్రుతి॥ సోహం చిన్మాత్ర మేవేతి చింతనం ధ్యాన ముచ్యతే.] అనెడి త్రిశిఖిబ్రాహ్మణోప నిషత్తురీతిగా దేహేంద్రియాది ఇర తత్త్వములును నేను గాను, ఈ దృశ్యము లగు వీనిని తెలుసుకుచుండు సాక్షిస్వరూపమగు నేనే ఆ పరబ్రహ్మమనిదలంచు (సోహంభావమే) ధ్యానమగును. (15) సమాధి అనగా; [పద్యము॥ సర్వావ స్థలయందును । సర్వంబును బ్రహ్మ మనుచు సతతము గనినన్।సర్వవికృతిరహిత సహా జ । నిర్వాణ సమాధి యగు వినిర్మలరూపా.।] అనెడి సీతారామాంజనేయ సం వాద మనెడి శాస్త్రములో నుండు పద్యమురీతిగా, జాగ్రత స్వప్నము సుషుప్తి తుర్య మనెడు నాలుగవస్థలున్ను, ఆ యవస్థలందు దోచెడి సకల ప్రపంచభోగ్య భోగసాధన శూన్య సాక్షాత్కారము లనెడు స్థూల సూక్ష్మ కారణశరీరములు, ఆత్మ ఇవి యన్నియు[శ్రుతి॥ నేహనానాస్తి కించ న, సర్వం ఖల్విదం బ్రహ్మ.] అనునట్లు సకలమున్నుపరబ్రహ్మమనుచుసదా భావించు చుండుటే సహజ నిర్వాణ సమాధి యనబడును అనుచు వేద వ్యాసుండు శ్రీశుకులవారికి నిట్లనియె పుత్రా! ఇదివరకు నీకు పంచ దశ జ్ఞానయోగంగముల నెల్ల బోధించితిని, ఇకమీద జీవన్ముక్తి రహస్యంబగు సోహంభావ మనెడిహంస స్వరూపసంచారరహస్యంబును ఆత్మసాక్షాత్కారంబును బోధించెదను శ్రద్ధ గలవాడవై వినుమని విశ దంబుగ ఆ రహస్యముల చెప్ప నారంభించెను. [పద్యము॥ దేహం బనియెడు పెరవున । నూహించును బుధుడు దాననుండుట గాఢ । స్వాహాప్రియయుక్రియల బురు షుడు। సోహ మనిన రుద్ర యతని గనుటగున్] అనుచు భారతమునందు

అనుశాసనికపర్వంబున ౭౨వ ఆశ్వాసములో హరసనత్కుమారసంవాదంబునందు జెప్పబడిన పై పద్యమురీతిగా ఈ దేహంబున ఇడా పింగళ



శ్రీ వేదవ్యాసమహాఋషి.



శ్రీ శుకమహాఋషి.

శ్రీవేదవ్యాసులు శుకులవారికి
ఆత్మసాక్షాత్కారమును బోధించుట.

యనెడి సూర్యచంద్రులనాడుల మార్గమున షడాధారములందు దినమొక్కటింటికి ౨౧౬౦౦ సార్లు ఆరోహణ అవరోహణము లనెడు రేచకపూర్వకంబులద్వారా (సోహమని అజపగాయత్రి యనెడి జ్ఞానగాయత్రిని) ఈ జీవాత్మ తనకు తానే (నేనే బ్రహ్మము నేనే బ్రహ్మము) అని జపించుకొను చుండును, ఇదే సోహంభావరస్యము; సద్గురుగోప్యము; ఇదే ఆత్మారామధ్యానము; ఇదే బ్రహ్మైక్యకారణము; ఇదేపరమహంస లగు బ్రహ్మజ్ఞానుల ఆత్మానుసంధానరహస్యము. ఈ మంత్రమునకు సప్తకోటి మహామంత్రములున్ను సరిగావు. కాబట్టి నీవు నడుచుచు వినుచు చూచుచు సకలకార్యములు చేయుచున్నను సదా ఈ సోహం భావమునందు హంసతోడ నీ మనస్సు సంచరించుచుండుటే సవికల్ప సమాధి యనియు,

సహాజసమాధి యనియుం జెప్పంబడును చూడుము, అని సోహంభావ రహస్యమును బోధించి తర్వాత వేదవ్యాసులు శుకులకు ఆత్మసాక్షాత్కార మగు నిర్వాసనా వహాళ చిన్ముద్రను కనుసన్న జేసి అభినయించి చూపి, పుత్రా! రజ్జు సర్పమువలె మాయాభ్రాంతిచే గోచు ఈ దేహేంద్రియాది సకల ప్రపంచము మిథ్య యని దలంచి ఆత్మస్వరూపుఁడ వగుసీవే పరబ్రహ్మమని దృఢనిశ్చయమును జెంది సదా ఈ చిన్ముద్రయందే నిలిచి కేవలసాక్షిమాత్ర బ్రహ్మముగా నుండుము, ఇదే నిర్వికల్ప సమాధియని బ్రహ్మజ్ఞానంబును సంపూర్ణముగా బోధించినంతనే శ్రీశుకులవారు మహా దీర్ఘవైరాగ్యముతో సదాసోహంభావమందుండుచు ఏకాంతమున చిన్ముద్ర సాధించుచు బ్రహ్మానంద స్వరూపులై యుండెను. ఇట్లు కొన్నాళ్లు గడచిన వెనుక శుకులవారు మరల తన తండ్రియగు వేదవ్యాసునిం జూచి, తండ్రీ! బ్రహ్మజ్ఞాన విషయంబులో నింకను నాకు సందేహము లున్నవి అని చెప్పగా వ్యాసుండు చిఱునవ్వునవ్వుచు శుకునింజూచి యిట్లనియె, పుత్రా! నీవు విదేహదేశపురాజగు జనకమహారాజు యొద్దకుం బోయి అతనినిదర్శింపుము, అతఁడు నీ సందేహములను దీర్చగలఁడు, అతని ప్రభావమును జెప్పుచున్నాను వినుమని యిట్లనియె, జనకమహారాజు మహా

జ న క మ హా రా జు క థ.

బ్రహ్మజ్ఞాని, అతఁడు నీయొక్క ముత్తాత యగు వసిష్ఠ మహాఋషియొద్ద వేదాంత కాలక్షేపము వినుచుండును, అట్లు కాలక్షేపము వినుచుండు నప్పుడు సకలమైన ఋషులును సన్న్యాసులును అచ్చటికి వచ్చి ఆకాలక్షేపమును వినుచుందురు, వసిష్ఠమహాఋషి వారందరువచ్చి కాచియుండినను జనకమహారాజు వచ్చునంతవఱకు అతనిని యెదురు చూచుచుండి అతడు వచ్చినతర్వాత కాలక్షేపము నారంభించు చుండును, ఇట్లుండగా, ఆ కాలక్షేపమునకు వచ్చునట్టిమహాఋషులును సన్న్యాసులును ఒకరితో నొకరు చెప్పుకొన్నదేమనగా; ఆహా! మనమందఱము నాశాపాశమును కాల్చివేసి వనవాసముసేయుచునిశ్చలముగా నున్నాము; మనము వచ్చినతోడనే ఈ వసిష్ఠులవారు కాలక్షేపమారంభించుటలేదు, జనకుడురాజ్యాపేక్ష గలిగి భార్యాబిడ్డలతోనుండు బద్ధసంసారి, అతఁడు వచ్చునంతవఱకు కాచియుండి తర్వాత ఈవసిష్ఠులవారు కాలక్షేప మారంభించుచున్నారు,

ఇందువలన మనకు అవమానముగదా! అని రహస్యముగా జెప్పుకొనుచు గుసగుస లాడుచుండిరి. ఆసంగతి వసిష్ఠులవారు యెఱింగి ఆహా! ఈ ఋషులు జనకునివైరాగ్యమును దెలియక బహుగర్వించి యున్నారు అని తనమదిలో దలంచుకొనుచుజనకమహారాజువచ్చినంత నెకాలక్షేపమారంభించి చెప్పుచు తన యోగమహిమవలన ఆ మిథిలాపురి యనెడి జనకుని పట్టణమును అగ్ని తగులుకొని రగులుకొనునట్లు చేసెను. అంత అగ్ని ప్రవేశించి ఆ రాజ్యమంతయు దహించుచుండగా ఆ రాజభటులు కాలక్షేపము జరుగుచుండుచోటికి పాఱివచ్చి హాయని యెలుగెత్తి యేడ్చుచు, రాజేంద్రా! మనపట్టణ మంతయు అగ్నిపడ్డిమై భస్మముగాబోవుచున్నది. అంతఃపురమంతయు అగ్ని యంటుకొని రగులు చున్నది. అంతఃపురస్త్రీలున్ను బిడ్డలున్ను అల్లాడుచున్నారు. పట్టణమందలి ప్రజలందరు భస్మముగా దహించిపోవు చున్నారు. మేము మాత్రము తప్పించుకొని మీతో విన్నవించుటకుగాను వచ్చినామని చెప్పుచుండగా ఆమాటలనులక్ష్యపెట్టవినక దీర్ఘవైరాగ్యముతో జనకమహారాజు తనఆచార్యు లగువసిష్ఠమహాఋషి బోధించు వేదాంతవాక్యములను జాగ్రత్తగా వినుచుండెను ఇంతలో వసిష్ఠులవారు తన యోగశక్తివలన ఆ యగ్నిజ్వాలలు మెల్లగాకాలక్షేపసభకుకూడా వ్యాపించునట్లు చేసెను. అంత నా యగ్నిజ్వాలలు ఆ పట్టణమునుండి గుప్పుం గుప్పుం పొగ లెగయుచు మెల్ల మెల్లగా సభదగ్గిరకు వచ్చుచుండగా అచ్చటనున్న ఋషులున్ను సన్యాసులున్ను వారు ఱంకు వారివారి కృష్ణాజినమున్ను దండకమండలువులున్ను ఎక్కడకాలిపోవునో అని దిగులుపడి అవియెల్ల చుట్టి చంకలో బెట్టుకొని కాలక్షేపమునువినుచుండిరి. అంత అగ్నిజ్వాలలు సమీపమునకు రాగా రాగా వారు తాళజాలక చెప్పక లేచి పాఱిపోయిరి. అప్పుడు జనకమహారాజుమాత్రము కొంచమైనను చలించక దీర్ఘవైరాగ్యముతో ఆచార్యునియొద్ద కాలక్షేపమును వినుచుండెను. అంతలో రాజభటులు రాజేంద్రా! మే మెంత విన్నవించినను నిశ్చింతగా నున్నారే అయ్యో ఇదేమి యాశ్చర్యము, అనుచు ఆ రాజభటులు వసిష్ఠులవారినిం జూచి, స్వామీ గురువర్యా! అయ్యో అగ్నిజ్వాలలు వీచుచు వచ్చుచున్నదే? మాప్రాణములు పోవునట్లున్నదే!

అని యెన్నుచుండగా అప్పుడు వసిష్ఠులవారు జనకమహారాజుం జూచి, రాజేంద్రా ! నీపట్టణ మగు మిథిలాపురి కాలిపోవుచున్నది. శీఘ్రముగా లేచి పొమ్ము పొమ్ము; కాలిపోవకుండునట్లుగాను యేదైన నొక యుపాయము చేయుము. అని చెప్పగా, ఆ మాటలువిని జనకమహారాజిట్లనియె. [గీతపద్యము: ఒక్కదెసను దృష్ణ యొలయదు గావున నేమియర్థములను లేమిలేదు కాల కొచ్చెమిథిలగాలదు నాకనిః దొక్కడైననింతనిక్కముండు ] [శ్లో॥ మిథిలాయాం ప్రదీప్తాయాం-నమే కించిత్ ప్రదహ్యతిః]అనునట్లుజనకమహారాజువసిష్ఠులవారినిం జూచి, స్వామీ ! గురువరేణ్యా! లోకమునందలి పదార్థములలో దేనియందును నాకు ఆశ లేదు. కాబట్టి ఈ వస్తువు నాకు గలదు. ఈవస్తువునాకులేదనెడు కొఱతలేదు. నాకు విషయంబులందు ప్రీతియున్నను గదా ఈవస్తువులు గలదు లేదనెడు భ్రాంతి నాకుగలుగును. నేనుదేవరవారికటాక్షము వలన మహావైరాగ్యముతోనున్నాను గాన గలదు లేదను భ్రాంతి నాకు లేదు. మిథిలాపురి కాలిపోయినప్పటికిన్ని ఒకగడ్డిపోచైననుకాలిపోవునట్లు నాకు తోచలేదు స్వామీ ! ఇది సత్యము. ఎవరికి లోకములోని వస్తువులందు ఆశయున్నదో వారికే ఆ వస్తువులు నశించునప్పుడు దుఃఖము గలుగును. "నిస్పృహస్య జగత్ తృణం భవతి" అనునట్లు ఆశ లేనివారికిజగత్తున్ను దీనిలోనినానావిచిత్ర పదార్థములున్ను ఒకగడ్డిపోచవలెదోచును: నాకు దేనిమీదను ఆశ లేదు. కాబట్టి యేది రగిలిపోవుచున్నదో,ఏదిరగిలిపోక యున్నదో నే నెఱుగను నా కక్కర లేదని చెప్పగా, అతనినిస్పృహ వైరాగ్యమునకు వసిష్ఠులవారు సంతోషించి మరల తన యోగమహిమ వలన ఆ యగ్నిని చల్లారునట్లు చేసెను. తర్వాత మిథిలాపట్టణంబు మును పటి వలెనేక్షేమముగా నుండునట్లు చేసెను. అట్లు అగ్ని చల్లారినవెనుక సకలఋషులున్ను సన్న్యాసులున్ను మరల కాలక్షేపమును వినుటకు వచ్చిచేరిరి. అప్పుడు వసిష్ఠులవారు ఆఋషులను సన్న్యాసులనుజూచియిట్లనియె. ఓఅయ్యలారా ! మీరిదివరకు మీకంటె ఆశాపాశమును కాల్చివేసిన వైరాగ్యపురుషులు లేరని తలంచి యుంటిరే! స్వల్పమైన కష్టాజినాదులును, దేహమును యెక్కడ కాలిపోవుచున్నదోఅని అభిమానించి పాఱిపోతిరిగదా! ఇంతటి వారిని వైరాగ్యపురుషు లని యెట్లు చెప్పదగును! ఈ జనకుడు మహాచక్రవర్తి, తనదేశము భార్యాబిడ్డలు మొదలైనవి రగిలి

పోవు ననెడి అభిమానము లేక నిరాశతోడ యిక్కడనే యుండెను గాన ఇతడే మహావైరాగ్య పురుషుడు, ఇందువల్లనే ఇతడు వచ్చునంత వఱకు గాచియుండి కాలక్షేపము చెప్పచున్నాను ఇకమీదనైనను మీరు మేమే సన్న్యాసులమను మీగర్వమును విడిచి సమదర్శనముగా సకలమును జూచుచుండు డని వారికి జ్ఞానవైరాగ్యమును బోధించు చుండెను; కాబట్టి శుకా ! ఆ జనకమహారాజు మహాజ్ఞానసంపన్నుండు గాన నీవతని యొద్దకుం బోయినయెడల అతడు నీ సందేహములను దీర్చగలడు. నీవు పోవునప్పుడు అణిమాదిసిద్ధిని పొందియున్నామే అని గర్వించి ఆకాశగమనముగా పోవద్దు, భూమిమీద నడిచి మిథిలాపురికిం బోయి జేరుము. సకల సురమునిగణవంద్యుండగు ఆ జనకమహారాజునీయందు కరుణగలవాడై నీయొక్క సకల సందేహములను మాన్పగలడు. ఆ రాజేంద్రుని యెదుట

## గురుమహిమ.

గర్వమును మోహమును విడిచిపెట్టి అతనిని గురుమూర్తిగా సేవింపుము. [పద్యము 'గురు దైవ్వడైననగుని| వ్వారవుపదేశించువాడె వేల్పుగ శ్రద్ధా|పరమతిగాశలయు జననమరణంబులు శ్రద్ధ లేని మనుజుం డెఱుగ.] అనెడి భారత శాంతిపర్వము ౬-వ ఆశ్వాసములో జెప్పబడియుండు పద్యమురీతిగా, ఏ జాతివాడైనను బ్రహ్మజ్ఞానమును బోధించువాడే గురు డనదగును. అతనిని మనుష్య మాత్రుడని తలంచరాదు. సాక్షాత్ పరబ్రహ్మముగా తలంచవలయును. [శ్లో॥ గురుర్న సస్యాత్ - స్వజనో న సస్యాత్ - పితా న సస్యాత్ జననీ న సస్యాత్। దైవం న సస్యాత్ నృపతిశ్చ సస్యాత్ - నమోచయేద్య స్సముపేత మృత్యుమ్॥]అను శ్లోకమురీతిగా పునర్జన్మకారణ మగు మృత్యువువల్లనుండి తన్ను దప్పించి మోక్షమునందు జేరుటకు వుపాయమును దెల్పనివారు గురువు స్వజనము, తల్లిదండ్రులు, దేవుడు, రాజు మొదలైన వారైనను వారివలన ప్రయోజనము లేదు, కాబట్టి మనము బ్రహ్మఋషులమనియు, అతడుఒక రాజనియుసామాన్యముగా నతని దలంపబోకుము. అతడుఎంతటిమహాత్ములచేతను బూజింపదగినవాడు, కాబట్టిఅతనియెదుటమిక్కిలిఅణకువగలవాడై యుండుముఅని జెప్పినంతనే శుకులవారు మంచిదనితండ్రియనుమతిని బొంది ప్రయాణమై పాదచారిగా నడచుచు మేరువు మొదలగు అనేక పర్వతములనుమహానదు

లనుదాటి భరతఖండంబును జేరి మార్గముగాబోవుచు దారిలో నెట్టివిచిత్ర వస్తువులు కనబడినను దాని లక్ష్యపెట్టి చూడక పోయి విదేహ దేశమునందు మిథిలాపురి యను పట్టణంబును జేరి అందు జనకమహారాజు వుద్యానవనంబును జేరి యచ్చటదానిద్వారంబునుదూరుచుండగా నచ్చటి ద్వారపాలకులు అతని నడ్డగించిరి. అందుకు శుకుండు మాటు బలుకక పరమశాంతముతో మౌనముగా నిలువబడియుండెను, అంతనాద్వారపాలకులు అత్యాశ్చర్యమొంది మేడలోనికిం బోయి తమ రాజేంద్రునకా సమాచార మెఱింగించిరి. అంత నారాజేంద్రుండు తన ప్రధానమంత్రినిం బంపి అత డెవ్వరని విచారించి రమ్మనగా ఆమంత్రిపోయి శుకునిం జూచి విచారించి రాజు వద్దకు వచ్చి వేదవ్యాస మహాఋషి పుత్రుడగు శుక మహాఋషి వచ్చియున్నారని చెప్పగా, ఆజనకమహారాజు ఆ శుకఋషి తన గురు పుత్రుండని యెఱింగి అతని హృదయంబును శోధింపం దలంచి యెదుర్కొన రాకుండెను. అప్పుడు శుకులవారు కోపావేశమును జెందక పరమశాంతముతో నేడుదినంబులవరకు ద్వారంబునందు కాచి యుండెను. అప్పటికిన్ని ద్వారపాలకులు లోపలికి విడువనందున వేఱొక ద్వారంబునందు ఆప్రకారము పోగా అచ్చట నుండు ద్వారపాలకులు అడ్డగించినందున అక్కడనున్న ఏడుదినంబులవరకు నిలబడుచు కాచి యుండెను. తర్వాత జనక మహారాజు శుకులవారి శాంతగుణమునకు పరమాశ్చర్యంబు జెంది యధికభయభక్తులతో తొట్రుపాటుపడ అర్ఘ్యపాద్యంబులు తనశిరస్సుమీద మోసికొని తనసభవారితోడ అతని నెదుర్కొనపోయి అతనికి అతివినయభయభక్తులతోడ సాష్టాంగదండంబు బెట్టి దోడ్కొనిపోయి తనయంతఃపురంబునందు నవరత్నమయంబగు స్వర్ణపీఠంబున నతనిం గూర్చుండబెట్టి పాదకమలములను దివ్యమైన అక్షతలతో బూజించి అర్ఘ్యమిచ్చి గోదానమును జేయగా। గురుపుత్రులకు ఆప్రకారము చేయవలయు ననుట ధర్మమని యెఱింగి శుకుండా పూజను అంగీకరించెను. అంత నా జనకమహారాజు మిగుల అణకువతోడ అతనియెదుట నిలువబడుచుండగా శుకుండు అతనిం గూర్చుండుడని నియమించినంతనే జనకమహారాజు భూమిమీదం గూర్చుండెను. అతనిమంత్రులు సభాపండితులు మొదలైనవారు శుకునింజూచి అతనికి దీర్ఘదండంబులు జేసి

అతనిచుట్టును నిలువబడుచుండిరి, ఇట్లు మర్యాదజేసినదానిన్ని పూర్వము ద్వారమందు కాచియుండునట్లు అవమానము చేసినదానిన్ని మనస్సున దలంచక శుకుండు సమదృష్టిముగా శాంతిస్వరూపముగానుండెను. అప్పుడు



వేశ్యకాంతల భరతనాట్యము.

జనకమహారాజు చంద్రబింబమువంటి ముఖముగల దేవతాస్త్రీలకంటెను మిగుల సుందరవతులుగా నుండు వేశ్యామణులను రావించెను. ఆవేశ్యలు మిక్కిలి వినోదముగా ఆడుచుబహుచమత్కారముతో కనుఱెప్పలల్లార్చి సైగలుసేయుచు చిరునవ్వు నవ్వుచుగళకంపము చేయుచుఅతివిచిత్రముగా శృంగారముగా భ్రూవిక్షేపము జేసి మోహము పుట్టునట్లు అభినయించుచు దేవగంధర్వగానమునకు సమానముగా సరససంగీతపదములు శ్రవణానందముగా పాడుచు తంబూరు మీటుచు వీణాగానము జేయుచుండిరి. ఆ సమయంబున శుకులవారు వారిసౌందర్యమును శృంగారచేష్టలను కొంచెమైనను లక్ష్యపెట్టిచూడక దీర్ఘవైరాగ్యముతో నుండుటం జూచి, రాజేంద్రుడు సంతోషించి తనపురోహితునిం బిలిచి ఆ శుకమహాఋషికి పంచభక్ష్య పరమాన్నంబులతోడ షడ్రసోపేతం బగు సరసాన్నమును బెట్టించగా, ఆశుకుండా పదార్థములందు రుచులు గోరకుండుటను పురోహితుని వలన దెలుసుకొని రాజేంద్రుండు అతని దృఢవైరాగ్యమునకు కడు విస్మయం బంది ఆతని సెలవుపొంది తన సభామంటపంబును ప్రవేశించి

కొలు వుండెను. ఆ రాత్రి మరల రాజేంద్రుడు శుకులవారియొద్దకు జేరి కొంతసేపు మృదువుగా క్షేమవార్త లాడుచుండిరి. తర్వాత, అతని యనుమతిని రాజేంద్రుడు తనశయనగృహంబునుం జేరి నిద్రించి మరునాడు ప్రాతఃకాలమున లేచి నిత్యకర్మానుష్ఠానములను దీర్చుకొని మరల శుకులవారియొద్దకు వచ్చినంతనె శుకుండా రాజేంద్రుం జూచి, హే మహాత్మా! నాకు జ్ఞానమార్గంబును నాతండ్రియగు వేదవ్యాసులుబోధించిరి.అందులో నాకు కొంత సందేహము లున్నవని నేనతనితోడం జెప్పగా, అతడు జనక మహారాజు యొద్దకుం బోవుమనేని అతడు నీ సందేహములను దీర్చగలడు పొమ్మని ఆజ్ఞాపించెను.అందువలన మీదర్శనంబునకై వచ్చితిననగా.జనక మహారాజు మందహాసములు చేయుచు శుకునిం జూచి యిట్లనియె.

## వేదవ్యాసులు నారాయణ నందనుం డనుట.

గురుపుత్రా! దేవరవారి తండ్రియగు శ్రీ వేదవ్యాసులువారు శ్రీమన్నారాయణ నందనుండగాన అతని చరిత్రమును జెప్పెదవినుండని యిట్లనియె. తొల్లి మహాప్రళయమునందు శ్రీమన్నారాయణుండు సముద్రమధ్యంబున వటపత్రశాయిగా బవ్వళించి యోగనిద్రాభిరతుండై యుండెను. తర్వాత. మరల జగత్తును సృష్టింపదలంచి తన నాభికమలము వలన బ్రహ్మదేవుని పుట్టించెను ఆ బ్రహ్మదేవుడు సకలచరాచరములగుజీవకోట్లతోడ ప్రపంచమును గలిగించెను, ఆ బ్రహ్మదేవుని ముఖమునందుండి ఋక్కు, యజస్సు, సామము, అధర్వణంబు లనెడి నాల్గువేదంబులు గలిగెను. శ్రీమన్నారాయణుండు ఆ వేదములను రక్షించుటకుగానుఅవాంతరతముండు (అను పేరుగలిగిన) వేదాకపుత్త్రుని తనమనంబునందు బుట్టించెను.అట్లు పుట్టి చేతులెత్తి మొక్కుకొని అధికభయభక్తులతో యెదుట నిలబడుచుండు ఆ కుమారునిం జూచి శ్రీమన్నారాయణుం డిట్లనియె. వత్సా! నీవు నావలన నాలుగు వేదములను శ్రద్ధతో విని వానిని జక్కగా భూలోకమునందలి జనులకు బోధపడునట్లు విభజింపుమని ఆ వేదములను బోధించి ఆజ్ఞాపించెను. ఆ భగవంతుని యాజ్ఞాప్రకారము అవాంతరతముం డను ఆ కుమారుండు వేదములను భాగించెను, అందుకు నారాయణుండు మిక్కిలి

సంతోషించి, పుత్రా! నీవు వేదములను యెల్ల వారికి అర్థము విశదముగా బోధపడునట్లు భాగిం చితివి. కాబట్టి ఇకమీద నీవు వేదవ్యాసుండనిపిలువ బడుదువుగాక. అని పలికి, పుత్రా! ఇకమీద నీవు (ప్రతిమన్వంతరంబు నందు) అనగా నొక్కొక్క ప్రపంచసృష్టియందు నీవు నాకు పుత్రుండవై పుట్టను త్రికాలజ్ఞాని వగుచు లోకులకు నాదివ్యావతారకల్యాణ గుణంబు లను, సదాచారమును, ధర్మమార్గంబునుబోధించుచు సకలసురమునిగణం బులచేత స్తుతింపబడినవాడుగా నుండుము. వసిష్ఠమహాఋషి మనుమండగు మహాజ్ఞాన సంపన్నుండైన పరాశరమహాఋషికి పుత్రుండవై పుట్టుము. కురుక్షేత్రము రాజులందరున్ను నీవలనం బుట్టి వారుపరస్పరము రోషముచే యుద్ధము జేసి వారికులమెల్లను నాశనము చేసికొందరు గాక. పుత్రా! కాలవిపరీతముచేత చెడునట్టి వేదములనుఅప్పుడుగూడచక్కగాజేసిసకల దేవతలకున్ను ఋషులకున్ను సంతోషమును చేయుము. లోకమునందలి ప్రజలకు ధర్మమార్గములందుండు సకలసందేహములు దీరునట్లుగా గ్రంథ ములు గల్పించి వారిచే కీర్తింపబడినవాడవు కమ్ము. కల్పితమోహము గలవాడవుగా నుండగలవు. నీకు నిర్మోహి యగు పుత్రుండు శుకుడను వాడు పుట్టగలడు. అప్పటప్పటికి వేదములను భాగించు సూక్ష్మబుద్ధియు, సాంఖ్యతత్త్వజ్ఞానమున్ను నీకు గలుగుచుండును గాక, అనిఆశీర్వదించి ఆ భగవంతుడు అదృశ్యం డాయెను. తర్వాత ఆ యవాంతరతముండను నాతడే యీశ్వరాజ్ఞానుసారముగా పరాశరమహాఋషికి పుత్రుడై పుట్టి నాలుగు వేదములను విశదముగా అర్థమేర్పడునట్లు భాగించుటవలన వేద వ్యాసులనుపేరప్రసిద్ధిజెందెను. అంతటిమహానుభావులగు దేవరవారితండ్రి బోధించినజ్ఞానమార్గంబును సత్యముగానమ్మి అనుష్టింపు చుండుడు. అని చెప్పగా, శుకుండు మరల జనకమహారాజునింజూచి, రాజేంద్రా! మహాను భావా! నాతండ్రి యాజ్ఞాప్రకారము దేవరవారు నా సందేహములనుదీర్చ గోరుచున్నా నని ప్రార్థించి కొన్ని సందేహములను ఆ రాజేంద్రుని వలన నేర్పుకొనుట కారంభించెను.

శ్రీ ర స్తు.

శ్రీసద్గురవే నమః.

# సందేహనివారణప్రకరణము.



జనకమహారాజు.



శ్రీశుకమహర్షి.

శుక జనక సంవాదము, ప్రశ్నోత్తరములు.

1. శుక-ప్రశ్న.— రాజేంద్రా! అఖండ సచ్చిదానంద సర్వపరిపూర్ణ స్వయంప్రకాశ పరబ్రహ్మ మగుఆత్మను అంధకార మగు అవిద్యాశక్తి ఆవరించుకొని ఉన్న దని చెప్పినయెడల దీపప్రకాశమునందు అంధ కార మున్న దనుట యెట్లు విరోధమో అట్లు విరోధముగా నున్నది. కాబట్టి అది సరికాదు. అయితే బ్రహ్మ మగు ఆత్మయందు అవిద్యలే దని చెప్పుదమంటే; ఆ యవిద్యాశక్తికార్యము లగు విక్షేప ఆవరణ శక్తులు సకలదృశ్యములను ప్రపంచమును తోచునట్లున్ను మఱచు నట్లున్ను చేయు చున్నవి అవి యట్లు చేయుచున్న యెడల పరబ్రహ్మ మగుఆత్మను అవిద్య లేదనవచ్చును. మఱియు అవిద్య లేదన్న యెడల గురువున్ను వేదాంతశాస్త్రాభ్యాసమున్ను లేకుండవలయును. ముక్తి

పొందుటకు గురువున్ను వేదాంతశాస్త్రవిచారమున్ను ఆవశ్యకము గానున్నది ఐతే అవి యక్కర లేదన్నయెడల వేదాంతశాస్త్రములు వ్యర్థముగా బోవుచున్నవి. అందువలన శ్రవణ మననాదులక్కఱలేక పోవుచున్నవి. అట్లు గాక ముముక్షువులు సదా వేదాంతశాస్త్రవిచారణ చేయుచున్నారు గాన వేదాంతులగు అద్వైతులు న్యాయము తెలియని మందబుద్ధులుగా నుండవచ్చునని సందేహమున్నదని చెప్పెను.

జనక-ఉత్తరము.—గురుపుత్రా! మునివర్యా! కట్టెయందు అగ్ని అణగి యుండునట్లు, అజ్ఞానదశయందు బ్రహ్మమగు ఆత్మయందు అవిద్య యున్నదనుటకు విరోధము లేదు సుమా! కాబట్టి ఆ యవిద్యాశక్తి కార్యములగు ఆవరణ విక్షేపశక్తులుండవచ్చును. ఐతే కట్టెతో కట్టెను మథించగా ఆకట్టెయందుండి పుట్టిన అగ్ని ఆకట్టెలను గాల్చి భస్మముగా జేయునట్లు సద్గురుకటాక్షమువలన తత్త్వమస్యాది వేదాంత మహావాక్యములయొక్క వాచ్యార్థలక్ష్యార్థములను తెలిసికొనుటచేత గలిగెడు తత్త్వజ్ఞానమువలన విక్షేప ఆవరణములనెడు కార్యప్రపంచమున్ను, వానికి కారణమగు అవిద్యయున్ను కాల్చి నాశము చేయుటవలన జ్ఞానస్వరూప పరబ్రహ్మమగు ఆత్మ యందు అవిద్య యున్నదనుటవలన విరోధము లేదు అందువలన విక్షేపఆవరణములున్ను వుండవచ్చును. అవి యున్న యెడల అవిద్యయు నుండుటవలన గురుసేవయు వేదాంతవిచారణయు చేయవలసినదే. ఐతే ఇట్టి వేదాంతశాస్త్ర పర్యాదలు తెలియనికొందరు పామరులు శాబ్దజ్ఞానమాత్రులై చుఅద్వైత బ్రహ్మజ్ఞానుల పరిహసించుచుందురు అందువలన వారు జనన మరణ ప్రవాహములో దగులుకొని అల్లాడుచుందురు.

2. శుక-ప్రశ్న—రాజేంద్రా! వేదాంతశాస్త్రములందు బ్రహ్మమగుఆత్మకున్ను అవిద్యకున్ను విరోధములేదనుట. నిద్రావస్థయందు అంధకారముగా నుండుచీకటికిన్ని, అచ్చట తేజోమయముగానుండు ఆత్మకున్ను సరిబోల్చబడియున్నది, అయితే; అట్లు విరోధము లేనియెడల అవిద్య మొదలైనవి నశించి ముక్తిపొందవలయునని యేల చెప్పవలయును?

జనక-ఉత్తర.—మునివర్యా! ఆత్మ తానే అంతఃకరణమునందు ప్రతిబింబించి అవిద్యావశమున తన్ను జీవుడని భ్రమించి ముక్తిని గోరి ఆత్మానాత్మ విచారణచేసి ఆవిచారణజ్ఞానమువలన జీవభ్రాంతి నశించి శరీరత్రయమునకు తాను సాక్షీ యగు జ్ఞానము వచ్చినప్పుడు (వృత్తిజ్ఞానము) అనగా ఆ విచారణజ్ఞానము మాయాకార్యము లగు నామరూపంబులతోడ సకల ప్రపంచమున్ను, దానికి కారణమైన అవిద్యనున్ను నాశముచేసి కట్టెలేని అగ్నిరీతిగాను, జలమునందు గలిసిన చిల్లగింజరీతిగాను స్వస్వరూపమగా ఆత్మయందు తాను ఐక్యమగుటచే ముక్తి గలుగును. ఇది గాక, సూర్యుడు అగ్ని స్వరూపముగానున్నను వానివలన గృహాదులు కాలుట లేదు. ఐతే: ఆ సూర్యకిరణము సూర్యకాంతము రాతిమీద వ్యాపించినప్పుడు దానియందుండి అగ్నిపుట్టి సకలపదార్థములను భస్మముగా జేయునట్లు జ్ఞానస్వరూపమగు ఆత్మ అవిద్యను పోగొట్టజాలదు గాని అజ్ఞానస్వరూపమగు ఆత్మ సత్తామాత్రమువలన గలిగిన అంతఃకరణ సంబంధమగు విచారణజ్ఞానము అవిద్యను నాశముచేయగలదు. అందువలన విచారణజ్ఞానమునకున్ను అవిద్యకున్ను విరోధముగలదు. కాబట్టి ఆ విచారణజ్ఞానమువలన నామరూప ప్రపంచము మిథ్యయని యెఱుగవలయును.

3. శుక-ప్రశ్న—రాజేంద్రా! సకలప్రపంచమున్ను మిథ్యఅయినను వేదములున్ను మిథ్యయే గదా? అట్టి అసత్యములైన వేదములవలన అజ్ఞాన మెట్లు నాశన మగును? ఆ అసత్యమైన వేదములవలన సత్యమైన మోక్ష మెట్లు గలుగును?

జనక-ఉత్తర,—మునికుమారా! స్వప్నమందు జూచిన పెద్దపులి నిద్రాభంగము కలుగజేసి ఆ పులియు మిథ్యగా బోవునట్లు, వేదములు అజ్ఞానమువలన బ్రహ్మము వేఱు, తాను వేఱుగానున్నాడను జీవునియొక్క అజ్ఞానమును నాశముచేసి తానే బ్రహ్మము, బ్రహ్మమే తాను అనెడు బ్రహ్మాద్వైతజ్ఞానమును గలుగజేసి కడపట ఆ వేదములున్ను దానితోడ సకలప్రపంచమున్ను మిథ్యగా బోవును.

4. శుక-ప్రశ్న—రాజేంద్రా! అంతఃకరణ సంబంధమగు విచారణజ్ఞానము అవిద్యను నాశము చేయుననుట, ప్రత్యక్ష విరోధముగానున్నది. ఎల ననగా; నూలే వస్త్రముగానైనట్లు కారణమగు అవిద్యయే కార్యమగు

అంతఃకరణ మగుటవలన దానిసంబంధ మగు విచారణజ్ఞానమున్ను అవి ద్యాకార్యముగానే యున్నది అందువల్ల అజ్ఞాన మెట్లు నశించును?

జనక-ఉత్తర.—మునిపుత్రా ! ఇనుముసంబంధమైన ఉక్కు ఆ యినుమును ఖండించునట్లున్ను, (కార్యమైన) ప్రవృత్తిజ్ఞానము, అనగా అంతఃకరణసంబంధ మగు విచారణజ్ఞానము. వానికి కారణమైన(అవిద్యను) అనగా అజ్ఞానమును ఖండించును.

5. శుక-ప్రశ్న.— రాజేంద్రా!సమాధి నిష్ఠయందున్ను నిద్రావస్థయందున్ను (వృత్తిజ్ఞానము) అనగా విచారణజ్ఞానము లయించు చున్నదిగదా! ఐతే సమాధినిష్ఠ కాలమందు శరీరము నిలబడియున్నది. నిద్రావస్థలో నిలబడక క్రింద పడిపోవుచున్నది. అట్లు పడిపోవుటకు కారణమేమి?

జనక-ఉత్తర.—మునిపుత్రా ! సమాధినిష్ఠాకాలమందు వృత్తిజ్ఞానమునందు చిత్తవృత్తులుఅణగి యుండుటవలన అప్పట్లో శరీరము నిలబడు చుండును. నిద్రావస్థయందు అజ్ఞానములో చిత్తవృత్తులు లయించుట వలన శరీరము క్రింద పడిపోవును.

6. శుక-ప్రశ్న.—రాజేంద్రా ! దేహేంద్రియాది ౨౪-తత్త్వములున్ను జడపదార్థములగుచున్నవి. ౨౫ - తత్త్వమగు జీవుడు రజ్జుసర్పమువలె మిథ్యాస్వరూపు డగుచున్నాడు ఆత్మ నిర్వికారసాక్షి స్వరూపుడు, ఇట్లుండగా, ఈ కామక్రోధ మోహాదికార్యములను సృష్టించిన వారెవరు?

జనక-ఉత్తర.—అవిద్యయే; అనగా అజ్ఞానమే సృష్టించుచున్నది.

8. శుక-ప్రశ్న.—రాజోత్తమా! మోక్షదశయందు(చిదాభాసుడు) అనగా జీవుడు నాశమగుటవలన, బ్రతికియుండు మనుష్యుడు తానుచచ్చుటకు ముందు పుచ్చుకొనగలడా?

జనక-ఉత్తర.— మునిపుంగవా! పరలోకప్రాప్తి బొందగోరుమనుష్యులు, తాము కాశిగంగలోపడి ప్రాణములు విడుచునట్లు జీవన్ముక్తి పొందు జ్ఞానులకు విదేహముక్తియందు జీవత్వము నశించు చున్నది.

8. శుక-ప్రశ్న.—రాజశ్రేష్ఠా ! దేహాదిప్రపంచము దేనివలన మిథ్యగా పోవును?

జనక-ఉత్తర.—ఋషివర్యా! (సత్తు) అనగా నాశము లేని వస్తువు యిది (అసత్తు) అనగా నాశమగు వస్తువు యిది అని సదసద్వివేకముచేసి సద్రూపమైనపరబ్రహ్మమగుఆత్మయేతానని యెఱిఁగి అపరోక్షజ్ఞానము జెందుటవలన దేహాది సకల ప్రపంచము మిథ్యగా బోవును.

9. శుక-ప్రశ్న.—రాజాధిప! మోక్షము జెందువాఁడు ఏవఁడు?

జనక-ఉత్తర.—ఋషిపుంగవా! ఉభయాత్మగా నుండు జీవాత్మయే.

10. శుక-ప్రశ్న.—రాజేంద్రా! దేహముం బొందినజకు అద్వైతభావము యెట్లు కలుగును?

జనక-ఉత్తర.—మునివర్యా! దేహాదిప్రపంచముపాపాధికభ్రాంతియగుట వలన అద్వైతము కూడును.

11. శుక-ప్రశ్న.—రాజశేఖరా! శుక్తియందున్న వెండియందున్న తెల్ల వర్ణము ఏకలక్షణముగా నుండుటవలన శుక్తియందు వెండియుండునట్లు (వివర్తము) అనగా భ్రాంతి తోఁచవచ్చును గాని పరబ్రహ్మము సచ్చిదానంద లక్షణములు గలదిగాను, ప్రపంచము అనృతజడ దుఃఖలక్షణములు గలదిగాను వుండుటవలన ఈ రెండున్ను ఒకటికొకటి విరోధ లక్షణము గలదిగా నున్నది గాన బ్రహ్మమే జగత్తనా భ్రాంతివలన యెట్లు తోఁచగలదు?

జనక-ఉత్తర.—మునికులోత్తమా! బ్రహ్మము సత్యమైనది, అట్లే ప్రపంచమున్ను సత్యమను భ్రాంతి వచ్చినందున బ్రహ్మమునందు (వస్తుమే) అనగా కల్పితమే ప్రపంచ మనవచ్చును.

12. శుక-ప్రశ్న.—రాజాధిపా! ఇంద్రియములు, మనస్సు, జీవుడు ఈ మూఁడు ఒకటిగా గూడియే లోకమునందలి ఒక్కొక్క పదార్థమును యెఱుగవలయును; అట్లుపు బ్రహ్మమును యెఱుంగుటకున్ను ఈమూఁడున్ను కావలసియున్నది గదా! అట్లు ఈ మూఁటిచేత యెఱుగబడిన వన్నియును దృశ్యవిషయము లగుచున్నవి. (యద్దృశ్యం-తన్నశ్యమ్) అనునట్లు దృశ్య పదార్థములన్నియు నాశమగునట్టివి గాని బ్రహ్మమును ఈ మూఁటిచేత యెఱుగబడినయెడల అదియుదృశ్యవస్తువగును; దృశ్యవస్తువైనయెడల నాశమగును గదా! అయితే ఇంద్రియములు మనస్సు జీవుడు అనెడి యీ మూఁటిచేత బ్రహ్మమును యెఱుగుటకు సాధ్యపడ దన్నయెడల

ఆ బ్రహ్మము (శశవిషాణములు) కుందేటికొమ్ములవలె శూన్యమగు చున్నది గదా?

జనక—ఉత్తర.—మునికులతిలకా! పరబ్రహ్మమగు ఆత్మ, సర్వసాక్షిగా నుండుటవలన దాని నెఱుగుటకు నింద్రియము లక్కఱలేదు; మఱియు ఆత్మ(స్వయంప్రకాశముగా నుండుటవలన దాని నెఱుంగుటకు మనస్సు అక్కఱలేదు; మఱియు, ఆత్మ)స్వయముగా జ్ఞానస్వరూపముగా నుండుటవలన,[శ్రుతి। విజ్ఞాతార మరే కేన విజానీయాత్॥]అనెడుకఠోపనిషత్తు రీతిగా, అట్టి ఆత్మ తన్ను తా నెఱుగుటకు జీవసహాయ మక్కఱలేదు [శ్రుతి॥ తస్యభాసా సర్వమిదం విభాతి॥]అనునట్లుస్వయముగా జ్ఞానస్వరూపముగా నుండు ఆత్మ సత్తామాత్రముచేతనే ఇంద్రియములు, మనస్సు, జీవుడు ఈ మూడును జ్ఞానముగలదిగా తోచుచున్నవి లేకున్న యెడల జడములగుచున్నవి గాన అట్టి ఆత్మను వేఱె యొకవస్తువు యెఱుగ జాలదు. అయితే ఆత్మతానే (ఆత్మజ్ఞానముచేతనే) తన్ను బ్రహ్మమనియు, దేహేంద్రియాదులున్ను జీవత్వమున్ను తనకు కల్పితములనియు, తత్త్వవివేకముచేత యెఱుగుచున్నది.

13. శుక—ప్రశ్న.—రాజచంద్రా!మాయ స్వయముగా నుండునదా? లేక పరాధీనముగా నుండునదా?

జనక—ఉత్తర.—మునివరేణ్యా! నిర్వికారముగా నుండు పరబ్రహ్మమును జీవేశ్వర జగత్తులుగా దోచునట్లు ఈ మాయయె చేయుటవలన ఇది స్వయముగా నున్నది, మఱియు నిత్యమగు పరబ్రహ్మమునకు వేఱుగా అనిత్యమైనదిగా నుండుటచేతను, [పద్యము చేతను డగు పురుషుని నిశ్చే తనయగు ప్రకృతి పొంది చేతనతాప్రస్థిత యగుఁ బరతత్త్వము। లాతత్త్వంబను మహాబ్ధియందలి తరగల్।] అనుచు భారతమునందు అనుశాసనికపర్వము ౪–వ ఆశ్వాసములో సనత్కుమారుడు రుద్రునకు సాంఖ్యయోగంబును దెల్పుచోట చెప్పబడిన పదమురీతిగా, [పద్యము॥ పురుషుడు చైతన్యాత్ముఁడు।నరనాయకప్రకృతిచేతనారహితజగ।ద్ధుని పురుషుని వెలుగునఁదా।భరియించు బురుషుఁ బొగుచు దనమైఁ దిరుగుఁ॥]అనుచు భారతమునందు శాంతిపర్వము ౬–వ ఆశ్వాసములో ఆధ్యాత్మిక అధిభౌతికములు చెప్పుచోట జెప్ప

బడియున్న పద్యముకీతిగా, (చేతనమై) అనగానిత్యనిర్మల జ్ఞానస్వరూప మగు బ్రహ్మ సన్నిధానమాత్రమున(అచేతన మగు) అనగా జడ మగు మాయయు చేతనస్వరూపముగా దోచుటచేతను అది పరాధీనముగా నున్నది.

14. శుక-ప్రశ్న.—రాజేంద్రా! బ్రహ్మమునకు జగత్తుభిన్నమా? లేక అభిన్నమా?

జనక-ఉత్తర.—గురుపుత్రా! అజ్ఞానదృష్టిలో భిన్నముగాను, జ్ఞానానుభవదృష్టిలో అభిన్నముగాను, శాస్త్రదృష్టిలో భిన్నాభిన్నముగాను వుండును.

15. శుక-ప్రశ్న.—రాజాధిపా! బ్రహ్మము యెందువల్ల మాయకుఆధారముగా నున్నది ?

జనక-ఉత్తర.—మునిపుంగవా! బ్రహ్మముసద్రూపముగానుండుటవలనను మాయ అసద్రూపముగా నుండుటవలనను బ్రహ్మముమాయకుఆధారముగా నున్నది.

16. శుక-ప్రశ్న.—రాజోత్తమా! మాయను జూచుచుండగా బ్రహ్మము గనబడుట లేదు, బ్రహ్మమును జూచునప్పుడు మాయ గనబడుట లేదు; ఎందువలన అట్లు అగుచున్నవి?

జనక-ఉత్తర.—[పద్యము. దంతిరూపంబుచే నొప్పుదారు వరయ। దారువగు గాక పరికింప దంతి యగునే। విశ్వరూపంబుచే దోచు విశ్వమూర్తి విష్ణుడగు గాక పరికింపవిశ్వమగునె॥] [పద్యము। వారణమంచుభ్రాంతుడగువానికి దారువుదోపదాక్రియన్। దారు వటంచు గాంచు విహితజ్ఞునకుం బరికింపగల్గునే। వారణ మట్లు సర్వమనువానికి బ్రహ్మము గానుపింప దట్లూరక బ్రహ్మమంచు గనుయోగికి సర్వము గల్గి తోచునే.] ఈ పద్యములు సీతారామాంజనేయ సంవాదములోనివి. గురుపుత్రా! దారువుచే జేయబడిన యేనుగును జూచి నిజమగు యేనుగని భ్రమించువానికి అది దారువుగా దోచదు ఐ కేదగ్గర జేరిపరీక్షించి చూచి అది దారువే యని తెలిసికొన్నవానికి అదియేనుగనుభ్రాంతి పుట్టదు; అట్లు మాయాప్రపంచమును తలంచుచున్నవానికి బ్రహ్మము తోచదు. దారువు యేనుగను దారువని నిశ్చయించువానికి అదిదారువైనట్లు సర్వమును బ్రహ్మమాత్రముగా జూచువారికి మాయాప్రపంచము దోచదు.

17. శుక-ప్రశ్న.—రాజేంద్రా! మాయను వంధ్యాపుత్త్రునివలెను మిథ్య, గాను జడముగాను యేల చెప్పవలయును?

జనక-ఉత్తర.—మునిపుంగవా! జ్ఞానస్వరూప మగు బ్రహ్మమునకంటెను వేఱుగానుండుటవలన జడముగాను. అసత్యమగుటవలన వంధ్యాపుత్త్రవత్తుగాను, అనిర్వాచ్య మగుటవలన మిథ్యగాను అగుచున్నది.

18. శుక-ప్రశ్న.—రాజేంద్రా! మాయ, జగత్తు, చిచ్ఛక్తి, బ్రహ్మము అను ఈ నాలుగునున్ను మాయలోపల వేఱు వేఱుగా విభజించి యెఱుగుటెట్లు?

జనక-ఉత్తర.—మునిపుత్త్రా! (1) నామరూపములను తోపజేయునదే మాయ. (2) నామరూపములుగా నుండు ప్రపంచమే జగత్తు. (3) సూర్యకిరణమే బహిర్ముఖమున మిథ్యగా నుండు జలముగాను, అంతర్ముఖమున ప్రత్యక్షముగా దోచు యెండమావులుగాను వుండునట్లు పరబ్రహ్మప్రకాశమే అంతర్ముఖమున చిచ్ఛక్తిగాను, బహిర్ముఖమున మాయాశక్తిగాను దోచెను. ఆచిచ్ఛక్తివల్లనే గ్రుడ్డులోపల నుండు పక్షిపిల్లలు నానావిధవిచిత్రవర్ణములుగా బుట్టుచున్నవి. ఆ చిచ్ఛక్తి మహిమ లేకుంటే రాజులేని దేశమువలె సకలము మాఱుపాటుగా నగును. ఆ చిచ్ఛక్తిలేని యెడల అగ్ని జలమువలె చల్లగానుండును; చేదు వస్తువులు తీపుగా నుండును; సముద్రజలమంతయు మన్నుగానగును; ఆచిచ్ఛక్తిలేకున్న యెడల ఈజగత్తుయొక్క సహజస్వభావము వేఱుగా మాఱిపోవును. (4) నామరూపక్రియలు లేక సదానాశరహితమైయుండునదే బ్రహ్మము, సుమా.

19. శుక-ప్రశ్న.—రాజేంద్రా! రజ్జువునందు భ్రాంతిచేత సర్పముదోచుచుండును, యథార్థముగా నుండు సర్పమును ముందుగా నొకప్పుడు చూచి యున్నందువల్లనే ఆ జ్ఞప్తి యుండుటవలన రజ్జువును జూచిన మాత్రమున అదిసర్పమనుభ్రాంతిగలిగెను; అట్లు ప్రపంచముఅనాదిగా నిత్యముగా వున్నదనుబుద్ధి యుంటే గదా బ్రహ్మమునందుభ్రాంతిచేత ప్రపంచము దోచు చున్నదని చెప్పవలయును.

జనక-ఉత్తర.—మునివరేణ్యా! ఈ భూలోకములోని వెండి, సర్పము అనుభవమూలముగా నుండు పదార్థములు. అయితే అట్లు అనుభవ

మూలముగా గలిగిన భ్రాంతికాదు. ఎట్లెననగా. గంధర్వపట్టణ మస
త్యము; దానిలో నుండు సర్పములున్ను అసత్యము; అట్టి అసత్యముగా
నుండిన్ని గంధర్వనగరమునిన్ని, గంధర్వనగరమందలి సర్పములనిన్ని
లోకులు చెప్పుకొనుట పరంపరగా కలదు గాన నున్నది గదా! అట్టి
మిథ్యయగు సర్పమువలె బ్రహ్మమునందు వివర్తముగా ప్రపంచము
దోచు చున్నది గాని ప్రపంచము అనాదిగా సత్యమైనది కాదు సుమీ!
ఇంతేకాదు. పిల్లవానికి కల్లము చేయగా రాదు. ఏలయన వాని మనో
భ్రాంతి వలన వానికి చేయగా నున్నదిగాని ఒకప్పుడైనను కల్లము
చేయుగా లేదు. అట్లు మాయామయమగు భ్రాంతివలన బ్రహ్మమే జగత్తుగా
దోచు చున్నదిగాని, బ్రహ్మము ఒకప్పుడైనను జగత్తుగా కాలేదు
జగత్తు అనునదిన్ని బ్రహ్మమునకంటె వేరై ఒకటి లేనేలేదు సుమా.

20. శుక-ప్రశ్న.—రాజశ్రేష్ఠా! కాలభేదముచేత రజ్జువును జూచి సర్ప
మని భ్రమించి మరల సమీపమునకుం బోయి పరీక్షించిచూచి ఛీఛీ
ఇది సర్పముగాదు, త్రాడే అని కనిపెట్టిన మాత్రమున పాము అసత్య
మగుచున్నది, అట్లు బ్రహ్మమే సత్యమని తెలిసినతోడనే ప్రపంచమున్ను
అసత్యము గావలయును, అట్లు జ్ఞానులకు ప్రారబ్ధకర్మమునుపట్టి దేహ
మున్ను ప్రపంచవికారము లగు ఆకలిదప్పులు సుఖదుఃఖములు ఏల
తోచుచున్నది?

జనక-ఉత్తర.—గురుపుత్రా! కర్మశేష మగు ప్రారబ్ధమునందు వలనగు సోపా
ధిక భ్రాంతివలన ప్రపంచవికారములు తోచుచున్నది. ఒకచోట రగులు
చున్న అగ్నిని చల్లార్చినప్పటికిన్ని అచ్చట కొంతసేపు ఉష్ణమున్నాను
ధూమమున్నాను వుండునట్లు బ్రహ్మజ్ఞానముచేత అవిద్య నశించిపోయి
నప్పటికిన్ని దాని కార్యము లగు దేహేంద్రియాది ప్రపంచము మాత్రము
ప్రారబ్ధము నశించువరకు భ్రాంతివలన తోచుచుండును దీనినే సోపా
ధిక భ్రాంతి యనబడును.

21. శుక-ప్రశ్న.—రాజోత్తమా! స్థాణువునందు పురుషభ్రాంతి గలిగి
నప్పుడు దగ్గరపోయి శోధించి చూచిన పిమ్మట స్థాణువేగాని అదిపురు
షుడుగా దోచినది అసత్యమే భ్రాంతిమాత్రమే యని తెలుసుకొన్న
వాడు, స్థాణువు ఈ రెండున్ను నిత్యముగా నుండునట్లు జీవుడు అజ్ఞాన

దశయందు బ్రహ్మమును ప్రపంచముగా నెంచి భ్రాంతి బొందెను, తర్వాత తత్త్వవివేకము చేసి బ్రహ్మమే సత్యము; జగత్తు మిథ్యఅని తెలుసుకొను చున్నాడే, అప్పుడు ఆ జీవుడు సత్యమైనవాడుగానుండి గదా తెలుసుకొను చున్నాడు; కాబట్టి బ్రహ్మమును జూచి జీవుడు, జీవునిచే తెలుసుకొనబడిన బ్రహ్మము ఈ రెండున్ను వేఱు వేఱుగా సత్యముగా నుండుటవలన అద్వైత మని యెట్లు చెప్పవచ్చును?

జనక—ఉత్తర [పద్యము। తరుణివేషంబు గైకొన్న పురుషు డరయఁ।బురుషుఁడగుగాక పరికింపఁ దరుణియగునె। జీవభావంబు జేకొన్న కేవలాత్మ। యాత్మఁ డగుగాక మఱి జీవుడగునె తెలియ।] ఈపద్యము సీతారామాంజనేయ సంవాదముఅనెడి గ్రంథములోనిది మునికుమారా! ఒక నాటకసభయందు వేషగాడు స్త్రీవేషమువాల్చి ఆడుచుండునప్పటికిన్ని, తానుపురుషుడుగాని స్త్రీగా జాలడు, అట్లు పరబ్రహ్మమగుఆత్మ అవిద్యాప్రతిబింబ ముపాధివశము తానే తన్ను జీవు డని భ్రాంతిపడుచున్నాడు; అందువలన తానే జీవు డనబడు చున్నాడు. మరల తత్త్వవివేకమువలన అవిద్యోపాధినశించి, తాను జీవు డనుభ్రాంతి నశించి తన్ను పరబ్రహ్మముగా తానే అను భవమున దెలిసికొను చున్నాడు గాన ఆత్మ సత్తామాత్రమువినాజీవు డను పదార్థము వేఱే ఒకటిలేదు, కాబట్టి అద్వైతము గూడును.

22. శుక—ప్రశ్న.—రాజేంద్రా! ముఖమునకు అద్దము వేఱుగా నుండు వస్తువు గాన ఆ యద్దమునందు ముఖమువలె ఒక ప్రతిబింబము దోచ గలదు, ఐతే బ్రహ్మమునకు వేఱుగాకమాయ,అవిద్యలు అభిన్నముగా నుండుటవలన ఆ మాయావిద్యలందుబ్రహ్మముప్రతిబింబింపదు;అందు వలన జీవుడు ప్రతిబింబ మని యెట్లు చెప్పవచ్చును?

జనక—ఉత్తర.—మునికుమారా! సర్వవ్యాపకముగా నుండు ఆకాశము నందు ఘటజలము అభిన్నముగా నుండిన్ని ఆ జలమునందు ఆకాశము వలె ఒక ప్రతిబింబము దోచునట్లు బ్రహ్మమునకు అభిన్నముగానుండు మాయావిద్యలందు బ్రహ్మమువలె ఒకప్రతిబింబము తోచుచుండును. అదే జీవు డనబడును. కాబట్టి జీవుడు ప్రతిబింబ మను న్యాయము చెల్లును.

23. శుక-ప్రశ్న.—రాజోత్తమా! రూపముగా నుండు చంద్రుడు రూపముగా నుండు అద్దమునందు ప్రతిబింబించును గాని అరూపముగా నుండు బ్రహ్మము మాయావిద్యలందు యెట్లు ప్రతిబింబించును?

జనక-ఉత్తర.—మునిపుత్రా! అరూపముగానుండు ఆకాశము రూపముగా నుండుజలమునందు ప్రతిబింబించునట్లు అరూపముగా నుండు బ్రహ్మము మాయావిద్యలందు ప్రతిబింబించగలదు.

24. శుక-ప్రశ్న.—రాజాధిపా! రూపముగా నుండు పృథ్వి ఉపాధివశమున ఘటాకారమును పొందగలదు గాని అరూపముగా నుండు బ్రహ్మము యెట్లు నామరూప ప్రపంచముగా కాగలదు?

జనక-ఉత్తర.—గురుపుత్రా! మట్టిని వేఱుగా విడిచి ఘటము ఒక పదార్థముగా వున్నదా అని చూడగా లేనట్లు సత్తామాత్ర మగు ఆత్మను వేఱుగా విడిచిపెట్టి చూడగా ప్రపంచముయొక్క నామరూపములు అరూపముగా బోవుచున్నవి; మఱియు అరూపముగానుండుఆకాశము నీలముగా పచ్చగా నానారూపములుగా గనబడునట్లు అరూపముగా నుండు బ్రహ్మరూపముగా నుండు ప్రపంచముగా గనబడుచున్నది.

25. శుక-ప్రశ్న.—రాజచంద్రా! అంధకారముగా అజ్ఞానముగా నుండు నిద్రావస్థలో జీవుని, వానికి సాక్షిగా నుండు ఆత్మనుఈరెంటిని ప్రత్యేకించి వేఱువేఱుగా నెట్లు యెఱుగవచ్చును?

జనక-ఉత్తర.—మునివర్యా! నేనుసుఖముగా నిద్రించితినని చెప్పువాడు జీవుడు,ఐతే నేను నిద్రావస్థలోఈనామరూపాత్మక మగు ప్రపంచము కొంచెమైనను యెఱుగకుంటిని అనువాడే సాక్షిస్వరూపుడగు ఆత్మ.

26. శుక-ప్రశ్న.-రాజవర్యా!జీవన్ముక్తుడగుజ్ఞానికిజ్ఞానసాక్షాత్కారము పొందియు కర్మశేష మగు ప్రారబ్ధమున్న దనినపక్షమున ద్వైతమగుచున్న దే? ప్రారబ్ధము జ్ఞానికి లే దన్నయెడల వారు సకల వ్యవహారములు చేయుచున్నారే? ఆ వ్యవహారములు రావచ్చునా.

జనక-ఉత్తర.—మునికుమారా! జ్ఞానికి తాను జీవుడను భ్రాంతినష్టమైనందున ప్రారబ్ధ మనుభవించు చున్నను,నాశరీర మేఅనుభవించుచున్నది, నేను నిర్వికార నిరహంకార సాక్షిమాత్రముగానున్నానని యెఱుగుట వలన తనకు ద్వైతభ్రాంతియు, ప్రారబ్ధానుభవమున్ను లేదుసుమా

27. శుక-ప్రశ్న.—రాజేంద్రా! శబ్దతన్మాత్రముగానుండు ఆకాశమునుండి వాయువు మొదలగు తక్కినభూతములు యెట్లు గలిగెను?

జనక-ఉత్తర—మునిపుత్రా! చేదుగానుండు వేపవిత్తనమువలన బుట్టిన వేపచెట్టున్ను చేదుగానుండునట్లు కారణభూతమైన ఆకాశముయొక్క గుణమగు శబ్దము తక్కిన నాలుగు భూతములందును వుండుటవలన ఆ నాలుగు భూతములు ఆకాశమునుండియే గలిగెను.

28. శుక-ప్రశ్న.—రాజేంద్రా! బంధమనగా నెద్ది, మోక్షమనగా నెద్ది?

జనక-ఉత్తర—మునివర్యా! బ్రహ్మమును యెఱుగను అనుట బంధము; ఆత్మస్వరూపుడగు తన్ను దప్ప వేరే యొకబ్రహ్మము లేదని యెఱుగుట మోక్షము.

29. శుక-ప్రశ్న—రాజశిఖామణీ! జీవుడు ఏకమే అని యేక జీవవాదము చెప్పినయెడల మోక్షము పొందినవాడున్ను లేడు, ఇకమీద పొందుటను లేదు; ఇందువలన నానాజీవులు గలరని చెప్పినయెడల అద్వైతహాని వచ్చుచున్నదే?

జనక-ఉత్తర.—మునిపుంగవా! జ్ఞానదృష్టికి ఏక జీవవాదము చెప్పబడుచుండుటవలన కూడును అనగా, [ శ్రుతి ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ] అను ఉపనిషద్వాక్యము రీతిగా, ఒక్క చంద్రుడే అనేక జలచంద్రులుగా దోచునట్లు పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే నానావిధ అంతఃకరణములందు ప్రతిబింబించి నానాజీవములుగా దోచుచున్నాడు గాన జీవులందరున్ను ఏకమే యిట్లు యెఱుగుటే జ్ఞానదృష్టియనబడును. ఇట్లు తెలియకుండుటే అజ్ఞానమనబడును. ఐతే ఒకకుండలోని జలము యింకిపోయినయెడల ఆ కుండయందలి ప్రతిబింబచంద్రుడు మాత్రము ఆకాశచంద్రునియందు గలసిపోవును గాని తక్కిన నీళ్ల కుండలయందలి ప్రతిబింబములు అట్లుగా జాలవు. ఆ ప్రకారముగా ఒకజ్ఞానియొక్క అంతఃకరణము నశించినయెడల అందలి ప్రతిబింబమగుజీవుడు నశించి అజ్ఞాని జీవోపాధి లేనివాడై పరబ్రహ్మమందు గలిసి యేకమగుచు, ముక్తిపొందునుగాని బ్రహ్మజ్ఞానము లేకున్నయెడల అంతఃకరణమున్ను దానియందలి ప్రతిబింబమున్ను నశించదు; అందువలన బ్రహ్మైక్యము లేక

జననమరణములు గలుగుచుగాన బ్రహ్మజ్ఞానికి ప్రత్యేకముగ నదేహము ము పొందజాలదు. అందువలన నానాజీవత్వము వ్యవహారదశయందే యని చెప్పబడుచున్నది.

30. శుక-ప్రశ్న.—రాజేంద్రా! బ్రహ్మ మొకఁడేగాని దానికి రెండవది లేకున్న యెడల త్వంపద విచారణ చేయవలసిన దిలేదు: చేయవలసినదే యున్న యెడల ప్రత్యగాత్మస్వరూపమగు తనకు వేఱుగా బ్రహ్మ మొకటి యుండవలయును గదా?

జనక-ఉత్తర—ఋషివర్యా! అజ్ఞానసృష్టివలన జీవరూపుఁడగు తనకు జననమరణములు గలవనెడు భ్రాంతి అనాదిగా వచ్చియుండుటవలన ఆయజ్ఞానము నశించి తానే బ్రహ్మమని తన నిజరూప మెఱుఁగుటకుగాను ఒక్కొక్కరున్ను త్వంపదశోధన చేయవలసినదే. ఇట్లు తత్త్వవిచారణ చేసి తన నిజస్వరూపమును యెఱిఁగిన వెనుక దేహాదిప్రపంచము సర్వము ఆత్మస్వరూపుఁడగు తనయందు నిర్జీవమువలె మిథ్యగా తోఁచుటవలన తనకంటె వేఱుగా నే పదార్థమును లేదు సుమా.

31. శుకప్రశ్న.—రాజచంద్రా! గురుఁడు అవయవములతోఁ గూడ నుండఁగా అతఁడు అశరీరి యని యెట్లు చెప్పవచ్చును?

జనక-ఉత్తర.—మునివర్యా! బ్రహ్మజ్ఞాని యగు గురుఁడు దేహేంద్రియాదులు తాను గాననియు, వానికి సాక్షిగానుండు ఆత్మయే తానని సదా దేహాభిమానము లేనివాఁడై చిద్రూపముగా నుండుటవలన అతఁడు అశరీరియే యగుచున్నాఁడు.

32. శుక-ప్రశ్న.—రాజోత్తమా! గురుఁడు సకలవ్యవహారములు చేయుచు శిష్యులకు తత్త్వములు బోధించుచున్నాఁడు; అప్పుడు మనస్సుండియే గదా ఈ కార్యములన్నియు చేయవలయును కాబట్టి అతఁడు సంకల్ప వికల్పములు లేనివాఁడని యెట్లు చెప్పవచ్చును?

జనక-ఉత్తర.—మునిసత్తమా! సంకల్పవికల్పములు మనోవికారములు; ఐతే బ్రహ్మజ్ఞాని యగు గురుఁడు, [శ్లో॥ నాహం దేహేంద్రియాణ్యంతరంగో] అను శ్రుతిరీతిగా మనస్సు తాను గాననియు, మనస్సునకు వేఱుగా సాక్షిగా నుండు ఆత్మయే తాననియు దృఢనిశ్చయము గలిగి యున్నాఁడు గాన సంకల్ప వికల్పములు తనకు లేవు.

33. శుక-ప్రశ్న.—రాజేంద్రా! దేహమా, లేక జీవుడా? అన్నమును భుజించుట.

జనక-ఉత్తర—మునివర్యా! అగ్నిసంబంధ మగు ఉదాన వాయువే అన్నమును భుజించును.

34. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఆకలి, దాహము ఈ రెండున్ను యెవరికి గలుగు చున్నవి?

జనక-ఉత్తర.—మునిపుంగవా! ఆకలిదప్పులు ప్రాణవాయువుధర్మములే.

35. శుక-ప్రశ్న — రాజాధిపా! స్వస్వరూపనిశ్చయ మెఱిగినవారికిభోక్తృత్వము యేల లేదు?

జనక-ఉత్తర.—మునిచంద్రా! కర్తృత్వభోక్తృత్వములు బుద్ధియొక్క ధర్మములు, [బుద్ధేః పరం ఆత్మా] ఆ బుద్ధి తానుగా ననుచు దానికి వేఱుగానుండు సర్వసాక్షి తాననుచు దలంచుటవలన అది లేదుసుమా.

36. శుక-ప్రశ్న —రాజేంద్రా! అవిద్యయున్ను, తాను జీవుడను భ్రాంతి యున్ను నశించి దేహాదిప్రపంచము సర్వము ఆత్మస్వరూపు డగు తన యందు ఆరోపితములుగా దెలిసి నిస్సంకల్పముగా సాక్షిమాత్ర స్వరూపుడుగా నుండు జ్ఞానికి; తాను జీవించి యుండువఱకు ప్రారబ్ధమున్ను, శరీరేంద్రియ వ్యాపారములకు నియమితమున్ను అనగా, ఆ యింద్రియములను దానిదాని కార్యములందు నడిపించువాడున్ను లేదు. అయినను, ఆ శరీర యింద్రియములు సకల కార్యములు చేయుచు సకల మనుభవించుచున్నది? వానిని అట్లు చేయునట్లు యెవడు చేయుచున్నాడు?

జనక-ఉత్తర.—ఋషివర్యా! ఒకయింటిలో కాపురమున్నవాడు ఆయిల్లు విడిచి పోయినతర్వాత ఆ యింటియజమానుడు ఆ యింటిని ఒప్పుకొన్నట్లు, నిస్సంకల్పుడై సాక్షిమాత్రముగానుండు జ్ఞానిశరీరము సర్వజీవశరీరములే తనకు కారణశరీరముగా గల ఈశ్వరునకు కార్యశరీర మగుటవలన ఆ యీశ్వరుడు ఆ శరీరమును నాది యని అభిమానించి దాని సకలేంద్రియంబులకు నియమితముగానుండుచు దానిదాని కార్యములను అదియది చేయునట్లు చేయుచున్నాడు.

37. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవుడు ప్రతిబింబమగుటవలన మిథ్యాస్వరూపుడగుచు జ్ఞానవైరాగ్యముచే నశించి పోవుచున్నాడే అప్పుడు ఐక్య మెవరికి కలుగుచున్నది?

జనక-ఉత్తర.—ఋషిపుంగవా! జీవసాక్షిగా నుండు ప్రత్యగాత్మకును పరబ్రహ్మమునకును ఐక్యము గలుగుచున్నది.

38. శుక-ప్రశ్న.—రాజేంద్రా! బంధముక్తులు జీవునికా, లేక ఆత్మకా?

జనక-ఉత్తర.—మునిపుత్రా! సర్వపరిపూర్ణమగు ఆత్మకు బంధముక్తులు లేవు. జీవుడున్ను తాను గురుకటాక్షముచేత తనకీ స్వరూపము మిథ్యయనియు, నిత్యముక్త పరబ్రహ్మము ఆత్మయే తాననియు దెలిసికొనుట వలన జీవునకున్ను బంధముక్తులు లేవు.

39. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఘటవిషయజ్ఞానమునందు వృత్తి నష్టమైనయెడల ఘటరూపమును సాక్షి యెఱుగుచున్నది గదా! అట్లు ఘటవృత్తులు లేనప్పుడు ఆసాక్షియగు ఆత్మ తనకు తానే యెఱుగును గదా?

జనక-ఉత్తర.—మునిపుత్రా! (వృత్తి) అనగా అంతఃకరణము, అవి లేకున్నయెడల (చిదాభాసుడు) అనగా జీవుడు లేడు. అట్టి అంతఃకరణము లేని ఘటము అజ్ఞానమగుచు జడమగుచున్నది, అట్టి అంతఃకరణము లేని ఘటమును సాక్షియగు ఆత్మ యెఱుగ పనిలేదు.

40. శుక-ప్రశ్న.—రాజేంద్రా! వృత్తిజ్ఞానము అనగా అంతఃకరణసంబంధమగు తత్త్వవివేకమువలన నిర్వికల్పజ్ఞానము, అజ్ఞానమును నాశముచేసి ఆవల ఆవృత్తిజ్ఞాన మెట్లు నశించును?

జనక-ఉత్తర.—మునిపుత్రా! అంధకారమును నాశముచేయు దీపము సూర్యునియెదుట నశించునట్లున్ను, స్వయంజ్యోతిగా స్వభావజ్ఞానముగా నుండు ఆత్మసన్నిధానమున వృత్తిజ్ఞానము నశించును.

41. శుక-ప్రశ్న—రాజాధిపా! దేహమే తాననియున్నప్పుడున్ను, జీవుడే తాననియున్నప్పుడున్ను, సాక్షియే తాననియున్నప్పుడున్ను, బ్రహ్మమే తాననియున్నప్పుడున్ను ప్రపంచము యే ప్రకారముగా గనబడుచుండును?

జనక-ఉత్తర.—మునికుమారా! దేహమే తానని యున్నప్పుడు ప్రపంచము నిత్యమైనదిగాను, జీవుడే తానని యున్నప్పుడు నిత్యానిత్యము

గాను, సాక్షియే తానని యున్నప్పుడు మిథ్యగాను, బ్రహ్మమే తానని యున్నప్పుడు సముద్రమునకు తరంగములు అన్యముగా లేనట్లు తన కంటె అన్యముగా లేనట్లుగాను తోచును.

42. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఆత్మయే సర్వపరిపూర్ణబ్రహ్మమై సకల జీవులయొక్క తలంపులన్ను తెలియవలయును గదా?

జనక-ఉత్తర.—మునిపుత్రా! చైతన్యస్వరూప మగు ఆత్మ సర్వపరిపూర్ణమైనను ఉపాధిభేదమువలన ఆయాశరీరసాక్షియగు ఆత్మ ఆయాశరీరజీవతలంపులనే తెలియుచుండును.

43. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవుడువృత్తిజ్ఞానముచే, అనగా అంతఃకరణసంబంధ మగు జ్ఞానముచే దేహాదితత్వముల తెలిసినట్లయితే ఆ కారణమే జీవుడు మిథ్యాస్వరూపుడగుచు నష్టమగుటవలన ఈ జీవుడు దేహమును తెలియుచున్నాడనుటకూడను, వృత్తిజ్ఞానమే దేహమును తెలియగవలయును గదా?

జనక-ఉత్తర.—గురుపుత్రా! (చిదాభాసుడు) అనగా జీవుడులేని (వృత్తి) అనగా అంతఃకరణమున్ను తెల్లనివస్త్రమువలె జడమగుటవలనజీవునకే దేహము ప్రయోజనమగుచున్నది గాన దేహమును జీవుడే తెలియుచున్నాడు గాని అంతఃకరణము తెలియజాలదు.

44 శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఆత్మవృత్తిజ్ఞానము గలుగుటకు ముందుగా అనగాతత్త్వవిచారణజ్ఞానము గలుగుటకు ముందుగా అజ్ఞానమునకు సాక్షిగా నుండుటవలన అదియే సమాధిగా నుండవలయును గదా?

జనక-ఉత్తర.—మునిపుత్రా! అజ్ఞానము సాక్షిస్వరూపుడగుఆత్మను తెలియగనందువల్లనుబీజాంకురన్యాయమురీతిగ అజ్ఞానముత్పత్తిలకన్నిటికి కారణ మగుటవల్లను దానిని సమాధి యనరాదు.

45. శుక-ప్రశ్న—భూపా! దేహేంద్రియాదులకు సాక్షిగానుండు ఆత్మ తానని తెలిసిన పెద్దలకు వ్యవహారదశయందు జీవుడును (వృత్తియు? అనగా అంతఃకరణమున్ను నుండుటవలన అద్వైతహానియగునుగదా?

జనక-ఉత్తర.—మునికుమారా! అంతఃకరణమున్ను జీవుడున్ను సముద్రమునకు కంటెను తరంగంబులు వేఱుగా లేనట్లు ఆత్మస్వరూపుడగు తనకంటెను వేఱుగాలేదని తెలియుటవలన అద్వైతము చెల్లును.

46. శుక-ప్రశ్న.—రాజశ్రేష్ఠా! జీవుడే బ్రహ్మమనుట ఉపాసనవల్లనా?

జనక-ఉత్తర.—ఋషివర్యా! ఉపాసించు దేవత తన కన్యమగుటవలన ఉపాసనవలన జీవుడు బ్రహ్మము గాజాలడు.

47. శుక-ప్రశ్న—రాజోత్తమా! ఐతే జీవుడు బ్రహ్మ మనుట ఉపచార వార్తయే గదా?

జనక-ఉత్తర.—మునిపుత్త్రా! తన కన్యముగా నుండువానికే ఉపచార వార్తలు చెప్పవలయునుగాని తనకే చెప్పగూడదు.

48. శుక-ప్రశ్న.—రాజచంద్రా! జీవుని బ్రహ్మమనుట గౌణన్యాయము వల్లనా?

జనక-ఉత్తర.—మునివర్యా! ఒకపురుషుని జూచి వీడు సింహ మనుట గౌణమేగాని సింహమును సింహ మనుట గౌణము గాదు, అట్లు పర బ్రహ్మ మగు జీవుని బ్రహ్మ మనుట గౌణము గాదు.

49. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవుని బ్రహ్మమనుట గుణిగుణన్యాయము వల్లనా?

జనక-ఉత్తర.—మునికుమారా! నల్లకలువ పుష్పమున్ను దాని నీలవర్ణ మున్ను అన్యోన్యముగా నుండుటవలన, ఆరెంటిని గుణిగుణములనిచెప్ప వచ్చును. ఐతే, జీవాత్మకు తాను జీవుడనుభావము భ్రాంతివల్ల నేర్పడి నది గాని సహజముగా అన్యోన్యమైనది గాదు గాన గుణిగుణన్యాయ మువలన జీవుడు బ్రహ్మ మనరాదు.

50. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవుని బ్రహ్మమనుట కార్యకారణ న్యాయమువల్లనా?

జనక-ఉత్తర.—మునిపుత్త్రా! పాలు దాని రూపము చెడి పెరుగగుట పరి ణామలక్షణ మనబడును. అట్లు బ్రహ్మము దానిరూపముచెడి జీవ రూపము గాలేదు, ఐతే సచ్చిదానందపరబ్రహ్మమగు ఆత్మ తానేఆవ రణశక్తివలన మఱుగుపడి భ్రాంతిచే జీవుడుగా తోచుచున్నాడు, ఆ భ్రాంతి నశించినతోడనే తాను తన నిజస్వరూప మగు ఆత్మస్వరూపు డగుచు నాశములేనివాడై సదా బ్రహ్మస్వరూపముగా నుండుటవలన **ఆరంభ పరిణామ కార్య కారణ వాదములవలన అని చెప్పగూడదు.**

51. శుక-ప్రశ్న.—రాజేంద్రా! వేదోక్తముగా జీవుడున్ను పరమాత్మయును ఈరెండును వుంశుటవలన అద్వైతము కూడదు గదా?

జనక-ఉత్తర.—మునివర్యా! పరబ్రహ్మ మగు ఆత్మయు జీవుడున్ను బింబ ప్రతిబింబము లగుటవలన అద్వైతము చెప్పవచ్చును.

52. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవాత్మ శరీరసంబంధ మగుచు నీవు నేను అను అభిమానము గలదియై వ్యవహారములు చేయుచున్నది గాన దీనికి కర్తృత్వ భోక్తృత్వములుగలదు. అవియుండుటవలన ప్రపంచమున్ను నిత్యముగదా?

జనక-ఉత్తర.—మునికుమారా! జీవోపాధివలన, అనగా తాను జీవుడను భ్రాంతియుండునప్పుడు కర్తృత్వభోక్తృత్వములు గలదు; ఒకరాజు స్వప్నమునందు తాను భిక్షుకుడుగా భిక్షమెత్తి జీవించుచుండునట్లుకల గని మేల్కొని జాగ్రదావస్థలో తనమంత్రి మొదలైనవాండ్రతో తాను స్వప్నమునందు భిక్షుకుడుగానున్నట్లు చెప్పుచున్నను తన మనస్సులో తాను ఒకకాలమున్ను భిక్షుకుడుగా లేదని తెలిసికొన్నట్లు, జీవన్ముక్తియందు స్వప్నమువలె ప్రపంచము మిథ్య యనియు, పరబ్రహ్మ మగు ఆత్మయే తాననియు దృఢనిశ్చయము గల జ్ఞాని పూర్వవాసనవలన తాను జీవునిరీతిగా కర్తృత్వభోక్తృత్వములు గలిగి సకలవ్యవహారములు జేయుచున్నప్పటికిన్ని అతనికి అహంకారము లేనందున తాను జీవుడు గాజాలడు; అందువలన తనకు కర్తృత్వభోక్తృత్వములు లేవు. తత్త్వజ్ఞానమువలన జ్ఞాని తాను జీవు డనుభ్రాంతి నశించి తక్షణమే బ్రహ్మస్వరూపుడైనప్పటికిన్ని ప్రారబ్ధదేహము నశించువఱకు అన్యుల దృష్టికి జీవునిరీతిగానే కర్తృత్వభోక్తృత్వమును గలవాడుగా సకల వ్యవహారములు చేయుచుండును.

53. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఆత్మశరీరసంబంధముగా నుండగా ఆ యాత్మ నిరుపాధి యని యెట్లు చెప్పవచ్చును?

జనక-ఉత్తర.—మునిపుత్త్రా! ఘటమునందు ఆకాశ ముండినప్పటికిన్ని నామరూపములు లేని ఆకాశము ఆకుండలో అణగియుండునట్లుతోచుచున్న దేగాని ఒకప్పుడున్ను ఆకాశమును ఘటము ఆవరింపజాలదు; అట్లు ఆత్మ శరీరములో నుండినప్పటికిన్ని శరీరసంబంధము లేనివాడగుటవలన ఆ యాత్మ నిరుపాధికుం డగుచున్నాడు.

54. శుక. ప్రశ్న.—రాజాధిపా! కార్యముగానుండు ప్రపంచమునకు ఉత్పత్తినాశములు మొదలగు వికారములు గలిగి యున్నది గాన కారణమగు బ్రహ్మమునకున్ను వికారములు గలవు గదా?

జనక—ఉత్తర—రజ్జుసర్పదృష్టాంతమునందు, కార్యమగు సర్పవికారము కారణమగు రజ్జువునందు లేనట్లు; కార్యమగు ప్రపంచవికారములు కారణమగు బ్రహ్మమునందు లేవు.

55. శుక—ప్రశ్న.—రాజేంద్రా! జీవన్ముక్తుడైన జ్ఞాని తానే బ్రహ్మమైన యెడల భూతభవిష్యద్వర్తమానము లనెడి త్రికాలములందు జరుగు సంగతులను యేల యెఱుగుట లేదు?

జనక—ఉత్తర.—మునికుమారా! సర్వజ్ఞత్వాదిగుణములు, అనగా త్రికాలజ్ఞానము మొదలైనవి మాయాకార్యము లగుటవలన మాయాప్రతిబింబ మగు ఈశ్వరునికే ఆగుణములుగలవుగాని అవిద్యాప్రతిబింబితుడగు జీవునికి గలుగజాలవు, కాబట్టి జీవోపాధిని పొందినట్టి జ్ఞానికి సర్వజ్ఞత్వాదిగుణములు గలుగజాలవు, ఐతే ఆ ఈశ్వర ఉపాసనాసిద్ధివలన కొందఱికి గలిగియుండును. ఉపాసన లేనివారికి గలుగజాలవు.

56. శుక—ప్రశ్న.—రాజోత్తమా! అజ్ఞానము అంతఃకరణసంబంధమగు విచారణజ్ఞానము పోగొట్టినయెడల ఆ విచారణజ్ఞానమున్ను తర్వాత నశించుటవలన ఈ జ్ఞానాజ్ఞానములు నశించునట్లు స్వభావజ్ఞాన మగు ఆత్మయునశించును గదా!

జనక—ఉత్తర.—మునిపుత్రా! జ్ఞానాజ్ఞానములే యెఱుకమఱపులు ఇవి కల్పితము లగుటవలన నశించును. ఐతే స్వభావజ్ఞానమునిత్యమైఅవస్థాత్రయమునకుసాక్షిగా నుండునది, కాబట్టి ఆస్వభావజ్ఞానమే ఆత్మయనబడును. అట్టిజ్ఞానస్వరూపమగు ఆత్మ తనకంటె వేఱుగాయేదిన్ని లేదని యెఱుగుటవలన దానిని నాశము చేయునది వేఱొకటి లేదు.

57. శుక—ప్రశ్న.—రాజేంద్రా! బ్రహ్మస్వరూపుడైన జ్ఞానికి సోపాధిక భ్రాంతివలన ప్రపంచము దోచుచున్నదన్న యెడల శుద్ధస్ఫటికమువద్ద యెఱ్ఱనిపదార్థ మున్నట్లైతే ఆ స్ఫటికము యెఱ్ఱగాదోచును; అట్లుగాక

ఆత్మస్వరూపుడగు తనకంటె వేఱొకపదార్థము లేకపోవుటవలన అతనికి సోపాధిక భ్రాంతి యెట్లు గలుగును?

జనక-ఉత్తర.—మునిపుత్రా! కర్మశేషమగు ప్రారబ్ధ ముండుటవలన భ్రాంతి గలుగును,

58. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఆత్మజ్ఞానము వేదాంతశ్రవణాదులవలన గలుగుచున్నది గాన అట్లుగలిగిన జ్ఞానమునకు నాశముగలదుగదా!

జనక-ఉత్తర.—మునివర్యా! సూర్యుడు స్వభావముగా ప్రకాశ మైనవాడుగానున్నను మేఘచ్ఛన్నమగునపుడుప్రకాశ హీనుడుగా కనబడునేగాని ఒకప్పుడున్ను ఆ సూర్యుడు ప్రకాశహీనుడగుటలేదు; అట్లు జ్ఞానస్వరూప మగు ఆత్మకు ఉత్పత్తినాశములు లేవు. అట్టి నిత్యమగు జ్ఞానస్వరూప మగు ఆత్మ అవిద్యాది ఆవరణములవలన భ్రమించి జ్ఞానము లేనివాడుగా కనబడుచున్నను, ఆ యావరణభ్రాంతులు నశించగా ముందున్న జ్ఞానస్వరూపముగాదోచుచు నిత్యముగానుండు ఆత్మయే తా నని తన్నెఱిగి తనకంటె అన్యమేదియు లేదని యెఱుగుచున్నాడు గాన, జ్ఞానస్వరూప మగు ఆత్మకు నాశము లేదు.

59. శుక-ప్రశ్న.—రాజేంద్రా! సచ్చిదానందలక్షణములు వేఱువేఱుగానున్నదా, లేక ఒక్కటిగా నున్నదా? ఇవి ఆత్మస్వరూపు డగు తనకు అన్యమా, లేక అనన్యమా?

జనక-ఉత్తర.—మునికుమారా! ప్రపంచసృష్టికిముందుగను ప్రపంచసృష్టికాలమందును, ప్రపంచ లయకాలములందును, ఈ త్రికాలము లేభూతభవిష్యద్వర్తమానకాలము లనబడును. (1) సత్ - అనగా ఈ త్రికాలములందును నాశము లేకుండునది. (2) చిత్ - అనగా జడాజడములను ఎఱుగు జ్ఞానము. (3) ఆనందము - అనగా సంభోగమునందు గలుగు సుఖమురీతిగా స్వానుభూతియందు గలుగు సుఖము ఆనంద మనబడును, పరబ్రహ్మ మగు ఆత్మ ఈ త్రికాలమందున్ను నాశము లేకుండుటవలన అదే సత్తనబడును. మఱియు ఆత్మ అంధకారముగా నుండు నిద్రావస్థయందును, చీకటికాల మగు రాత్రులందును, సూర్యప్రకాశము లేకుండినను తడబడక ఆ యంధకారమును

సకలవస్తువులను మెఱుగుచు జ్ఞానస్వరూపముగా నుండుటవల్ల అదే చిత్తనబడును. సకల వస్తువులకంటె ఒకనికి తన ఆత్మయందే సదాప్రీతి యున్నది గాన ఆత్మ పరమానందస్వరూప మనబడును. మల్లెపువ్వునకు తెలుపువర్ణము, మృదుత్వము, వాసన ఈ మూడున్ను వేఱు పఱచుటకు లేక ఒక్కటిగా నుండునట్లు, ఆత్మయందు అభేదముగా ఈ సచ్చిదానంద లక్షణములు యేకముగా నున్నవి. ఐతే (వృత్తి) అనగా, అంతఃకరణము సత్త్వరజస్తమోగుణంబులు గల దగుచు వరుసగా శాంత ఘోర మూఢ వృత్తులని మూడు విధములుగా నగుటవలన ఈ వృత్తిభేదమువలనసచ్చిదానందలక్షణములు ఒక్కటిగానున్నను వేఱు వేఱుగా దోచును. ఎట్లనగా, మల్లెపువ్వునందు తెలుపువర్ణము మృదుత్వము వాసన ఈమూడున్ను ఏకముగానున్నను దాని తెల్లవర్ణమును కన్ను తెలుగును, మృదుత్వమును త్వక్కు యెఱుగును, దాని వాసనను ముక్కు యెఱుగును, అట్లు ఈమూడువిధములగు వృత్తులున్ను ఒక్కొక్కటి ఒక్కొక్కలక్షణమును యెఱుగుటవలన సచ్చిదానంద లక్షణములు యేకముగా నుండినను వేఱు వేఱుగాభేదముగా దోచును తమోగుణ ప్రధానముగా నుండు వృత్తి గలిగిన జడపదార్థము లగు మన్ను చెట్టు తీగ మొదలగువానియందు సత్తులక్షణముమాత్రము తోచును. రజోగుణముతో గూడినవృత్తి విషయరూపమగు కామక్రోధాది దుర్గుణము లగుచు దుఃఖస్వరూపము లగుటవలన దానియందు సత్తుచిత్తు ఈ రెండు లక్షణములుమాత్రము తోచును గాని ఆనందము తోచనేరదు. ఐతే శాంతమే ప్రధానముగాగల వృత్తియందు సత్తుచిత్తు ఆనందములనెడి మూడులక్షణములున్ను తోచును.

60. శుక-ప్రశ్న.—రాజేంద్రా! మాయవలన బుట్టిన పంచభూతములు ఒకటిగాలేక వేఱువేఱు గుణములు గలదిగా యేల వున్నది?

జనక-ఉత్తర.-మునిపుత్రా! మాయ త్రిగుణాత్మికముగా నుండుటవల్లను మఱియు బ్రహ్మము, ప్రకృతి, ఈశ్వరుడు, మాయ విక్షేపము ఈ అయిదున్ను పంచభూత కారణములుగానుండుటవల్లనుపంచభూతగుణములు వేఱువేఱుగా నున్నది.

61. శుక-ప్రశ్న.—రాజాధిపా! సర్వపరిపూర్ణబ్రహ్మమగు ఆత్మసన్నిధానమున జడరూపముగా నుండు మనస్సునకు చేష్టలు కలదన్న యెడల అట్లనే జడముగా నుండు ఘటమునకు చేష్టలు గలిగియుండవద్దా?

జనక-ఉత్తర.—మునివర్యా! స్కాంతముయొక్క సన్నిధానమందు సూది మాత్రము చలించుచుండునుగాని తక్కిన ఘటపటాదులు చలింపనట్లు, ఆత్మ సన్నిధానమందు మనస్సు చేష్టించును గాని తక్కిన ఘటపటాదులు చేష్టింపదు.

62. శుక-ప్రశ్న.—రాజచంద్రా! ఆకాశము నామరూపములు లేనిదిగా నుండగా అది శబ్దతన్మాత్ర గలిగి యున్నదనుటకు ప్రమాణ మేమి?

జనక-ఉత్తర.—మునిపుత్రా! ప్రతిధ్వనియే ప్రత్యక్షము; మఱియు ఆకాశము లేనిచోట శబ్దము పుట్టజాలదు.

63. శుక-ప్రశ్న.—రాజేంద్రా! నిరవయవముగానుండు ఆత్మనువినా జీవునికి కర్తృత్వవ్యవహారములు లేదు గనుక జీవునికి బంధము లేదు గదా?

జనక-ఉత్తర.—మునివర్యా! జీవుడు ప్రతిబింబ మగుటవలన ఆత్మను విడిచి ఆజీవుని ప్రత్యేకించి చూడగా జడమగుటవలన ఆజీవునికి బంధము లేదు.

64. శుక-ప్రశ్న.—రాజచంద్రా! జీవుడు ప్రతిబింబ మగుచు బ్రహ్మమునకు అభేదమగుచుండగా ఆజీవుడు బంధదశయందు మోక్షమును యేల కోరుచున్నాడు?

జనక-ఉత్తర.—మునిపుత్రా! సూర్యప్రకాశమునందు దీపజ్వాలలులయించి పోవునట్లు జ్ఞానానుభవమందు ఆవరణము నశించినతోడనే జీవుడు బ్రహ్మమునందు లయించుచున్నాడు, అట్టి జీవుడు అవరణసహితుడుగా నుండునప్పుడు తాను బ్రహ్మమునకంటె వేఱుగా నున్నాడని భ్రాంతిచే భేదబుద్ధి గలిగినందున మోక్షమును గోరుచున్నాడు.

65. శుక-ప్రశ్న.—రాజేంద్రా! ఒకజ్ఞానికి (వృత్తిజ్ఞానము) అనగా అంతఃకరణమున్ను దానిసంబంధ మగు జ్ఞానమున్ను నశించగా అతడు జీవన్ముక్తి పొందుచున్నాడు, అట్టివానికి జగత్తు లేదు గదా! అట్లు వానికి లేకపోయిన జగము తక్కినవారికి యేల గనబడు చున్నది?

జనక-ఉత్తర—మునివర్యా! వృత్తిజ్ఞానము సమష్టి వ్యష్టి యని రెండు భేదములుగానున్నవి! అందు ఒకజ్ఞానికి వానియొక్క అంతఃకరణముమాత్రము నశించుటచేత వ్యష్టి వృత్తిజ్ఞానము నశించుటవలన వానికి మాత్రము జగత్తు లేకపోవును గాని తక్కినజీవుల అంతఃకరణములు సమష్టి వృత్తిజ్ఞానమనబడును; అవి నశించలేదు గాన తక్కినవారికి జగత్తు తోచుచుండును.

66. శుక-ప్రశ్న.—రాజేంద్రా! బ్రహ్మము (చైతన్యము) అనగా జ్ఞానస్వరూపముగాను, జగత్తుజడస్వరూపముగానువుండుటవలన బ్రహ్మమే జగత్తన్న యెడల ఈ రెంటికి ఐక్య మెట్లు గలుగును?

జనక-ఉత్తర—మునిపుత్త్రా! నామరూపములుగా దోచు ఈ జగత్తునకు నిజస్వరూపము బ్రహ్మమేగాన ఐక్యము గలుగును. అనగా రజ్జుసర్పము రీతిగా బ్రహ్మమే జగత్తుగా దోచుచున్నదిగాని జగత్తనునది వేఱొయొక పదార్థముగా లేదు గాన ఐక్యము గలుగును.

67. శుక-ప్రశ్న.—రాజేంద్రా! సద్రూపబ్రహ్మమగు ఆత్మ నిత్యమనుట ఏకారణమువలన?

జనక-ఉత్తర.—మునిపుత్త్రా! అంతఃకరణసంబంధములైన జ్ఞానాజ్ఞానములగు యెఱుకమఱుపులు కల్పితములగుచున్నవి. వానికి సాక్షిగా ఆత్మ అవస్థాత్రయమునందు నిత్యముగా నుండుటవలన ఆత్మ నిత్యమే.

68. శుక-ప్రశ్న.—రాజాధిపా! సద్రూపమగు ఆత్మరీతిగా అసత్తగు జగత్తున్ను సహజముకదా?

జనక-ఉత్తర.—ఋషివర్యా! బ్రహ్మమురీతిగా జగత్తు సద్రూపము కానందున సహజముకాదు.

69. శుక-ప్రశ్న.—రాజేంద్రా! సదా మౌనము అనుట కర్థమేమి?

జనక-ఉత్తర—మునిపుత్త్రా! బ్రహ్మసాక్షాత్కారమే అని యర్థము.

70. శుక-ప్రశ్న.—రాజోత్తమా! జీవన్ముక్తుడగు నాకు జీవత్వము నశించిన యెడల నే నెవ్వడను?

జనక-ఉత్తర.—మునికుమారా! బ్రహ్మముతప్ప వేఱొకవస్తువు లేదు గాన ఆత్మస్వరూపుడగు నీవే బ్రహ్మము.

71. శుక-ప్రశ్న.—రాజచంద్రా! జీవన్ముక్తుడగు జ్ఞాని ఒకరియింట భుజించినమాత్రము జగత్తుకంతా తృప్తి యనుట యెట్లు?

జనక-ఉత్తర.—ఋషివర్యా! విశ్వరూపుడగు ఈశ్వరాంశమే జ్ఞానియగుటవలన జ్ఞాని ఒకచో భుజించినయెడల విశ్వరూపుడగు ఈశ్వరుడు తృప్తి పొందుచున్నాడు, అందువలన జగత్తంతయు తృప్తిపొందును.

72. శుక-ప్రశ్న.—రాజాధిపా! ఆత్మసాక్షాత్కారము ఒక్కమాటలోనే యున్నది అనగా నేమి?

జనక-ఉత్తర.—ఋషివర్యా! గురూపదేశమువల్లనే ఆత్మ సాక్షాత్కారమును పొందవలయు ననుట.

73. శుక-ప్రశ్న.—రాజేంద్రా! మహాత్ములగు జ్ఞానులకు కర్మనివృత్తి యెట్లు గలుగును?

జనక-ఉత్తర.—ఋషివర్యా! ప్రారబ్ధాంత్యమునవిదేహకైవల్యమగునప్పుడు కర్మనివృత్తియగును, అదివఱకు [ శు ప్రారబ్ధంభోగతో నశ్యేత్ ॥ ] అనునట్లు ప్రారబ్ధకర్మములను అనుభవించియే తీరవలయును.

74. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవన్ముక్తులు సకలకర్మములు చేయుచున్నారే, ఆ కర్మఫలములు వారెందుకు పొందుట లేదు?

జనక-ఉత్తర.—ఋషిపుత్రా! జ్ఞాని సర్వము బ్రహ్మమే యని కర్తృత్వశూన్యుడై యుండుటవలన అతనిని కర్మఫలములు అందజాలవు.

75. శుక-ప్రశ్న. రాజోత్తమా! జీవన్ముక్తులకు పంచమలము లెట్లు తొలగిపోవును.

జనక-ఉత్తర.—మునిపుత్రా! బ్రహ్మజ్ఞానము వలన తొలగిపోవును.

76 శుక-ప్రశ్న.—రాజాధిపా! ఆగామిసంచిత నాశము లెట్లు గలుగును?

జనక-ఉత్తర.—మునిపుత్రా! గురుకటాక్షమువల్లనున్ను జ్ఞానోపదేశమువల్లనున్ను సంచితము నాశమగును. కర్తృత్వశూన్యమగుటవలనఆగామియు నాశమగును.

77. శుక-ప్రశ్న.—రాజాధిపా! జీవన్ముక్తులగు జ్ఞానులు జన్మాంతరవ్యవహారములు యేల తెలియుట లేదు?

జనక-ఉత్తర.—మునిపుత్రా! కర్మ ప్రాణాయామ యోగము, తపస్సు వీని చేత ఈశ్వరానుగ్రహమును పొంది అట్టి త్రికాలజ్ఞానము మొదలగు

సిద్ధులు పొందవలయును. యోగము, తపస్సు, ఈ రెండున్ను కామ్యములగుట వల్లను; మాయాకార్యము లగుటవల్లను మిథ్యలగుటవల్లను నిష్కామి యగు బ్రహ్మజ్ఞాని వానిని గోరుట లేదు; అందువలన అతనికి జన్మాంతరములను తెలిసికొనుట మొదలగు త్రికాలజ్ఞానము లేదు.

78. శుక-ప్రశ్న.—రాజాధిపా! త్వంపదలక్ష్యార్థ మెఱిగిన పిమ్మట తత్పద లక్ష్యార్థ మేల యెఱుగవలయును?

జనక-ఉత్తర—మునిపుత్రా! త్వంపదలక్ష్యార్థ మెఱిగినట్లైతే దేహేంద్రియములకు సాక్షిగానుండు ప్రత్యగాత్మయగుతన్ను తెలియవచ్చును. తత్పద లక్ష్యార్థము నెఱిగినట్లైతే,అఖండపరిపూర్ణ బ్రహ్మము నెఱుగవచ్చును.

79. శుక-ప్రశ్న.—రాజేంద్రా! అసిపద మేల యెఱుగవలయును?

జనక-ఉత్తర—ఋషిపుత్రా! దేహేంద్రియసాక్షిగా నుండు ఈఆత్మయే ఆసర్వపరిపూర్ణ పరబ్రహ్మ మనియు, ఆబ్రహ్మమే ఈ ఆత్మయనియు ఐక్యమును అసిపదము బోధించుటవలన దాని నెఱుగవలయును.

80. శుక-ప్రశ్న.—రాజేంద్రా! చిద్విలాసమగు ప్రపంచము జీవన్ముక్తునికి నష్టమైనయెడల చిత్తు నిత్యముగా నుండవలయుగదా! ఆరోపమగు దేహేంద్రియాది ప్రపంచమున్ను,అధిష్ఠానమగు సాక్షిత్వభావమున్ను కనబడకపోవుటవలన శూన్య మగుచున్నదే?

జనక-ఉత్తర.—మునిపుత్రా! స్వభావజ్ఞానమగుబ్రహ్మమొక్కటే సత్యముగాన జ్ఞాని తాను సాక్షి యను తలంపున్ను నశించి తాను బ్రహ్మము గానే యుండుటవలన స్వస్వరూపమునకు హాని లేదు.

81. శుక-ప్రశ్న.—రాజేంద్రా! జీవులు చేయునట్టి పుణ్యపాప కర్మములు భగవంతుడు చేయించు కార్యములు గదా! జీవాత్ములు యేమిచేయ గలరు. ఆ జీవులందు దోషము చెప్పుటకు కారణ మేమి?

జనక-ఉత్తర.—మునిచంద్రా! ఈశ్వరసృష్టికిన్ని జీవసృష్టికిన్ని బహుభేదము లున్నవి.జగత్తునందు యెల్లవారికి మధ్యవర్తిగా నుండునట్టి స్థావరజంగమాదులు ఈశ్వరసృష్టి యనబడును, నేనుయ నెడియహంకారమున్ను కామక్రోధాదులున్ను అత్యాశయున్ను జీవసృష్టియనబడును;ఇవినిర్మ

లుండైన ఈశ్వరునిచే సృష్టింపబడినవి గావు. ఈశ్వరుడు ఒకనిని జ్ఞాని గానుంచునట్లును, ఒకనిని కామక్రోధాది దుర్గుణంబులు గల పాపాత్ముని గాను సృష్టించగలడా! ఈశ్వరుడు పక్షపాతము లేనివాడు గాన అట్లు చేయజాలడు. ఐతే ఈ అహంకార మమకార కామక్రోధలోభ మోహాది దుర్గుణములను జీవుడు తనవలెనే తాను తనయందు గలుగ జేసుకొన్నదే గాని వాటిని ఈశ్వరుడే సృష్టించెనని చెప్పునట్టివారు అతనిని దూషించువారగుటవలన అట్టివారు అధోగతిని పొంది దుఃఖింప గలరు సుమా. త్రిమూర్తి స్వరూపుడగు ఈశ్వరసృష్టి మోక్షసాధనములుగా నున్నవి. జీవసృష్టియగు కామక్రోధాదులు పునర్జన్మములకు కారణములుగానున్నవి. ఎట్లనగా, ఈశ్వరసృష్టియగు పంచభూతములనున్ను వాని భౌతికములను నానావిధ విచిత్రము లగు చేతనాచేతనములనున్ను సూర్యచంద్రాదులనున్ను జూచినమాత్రమున భగవంతుడున్నాడను బుద్ధి గలిగి ఆతనియందు భక్తిగలిగి అతనివలన నిర్మింపబడిన నాలుగు వేదములను జదివి వేదాంతవిచారణచేసి బ్రహ్మాద్వైత జ్ఞానమున్ను పొంది ముక్తుడగుచున్నాడుగాన ఈశ్వరసృష్టి మోక్షమునకు కారణముగా నున్నది. ఐతే జీవసృష్టియగు కామక్రోధాదులవలన జీవుడు అనేక కర్మములు చేయుచు పునర్జన్మములను పొందుచున్నాడు. ఈశ్వరసృష్టియగు పంచభూతమయమగు ప్రపంచముండునప్పుడే జీవసృష్టియగు అహంకార మమకార కామక్రోధాదులు నశించినయెడల ఈజీవుడు సత్యముగా ముక్తి పొందుచున్నాడు. ఈశ్వరసృష్టియగు ఈ మహాప్రపంచము నశించినను కామక్రోధాదులు జీవునికి నశించనియెడల ఈజీవుడు ముక్తిపొందజాలడు, మరల ఈశ్వరుడు ప్రపంచమును సృష్టించునప్పుడు ఈజీవుడున్ను జన్మించుచుండును కాబట్టి జీవుడు ముఖ్యముగా తన సంకల్పములవలన గలిగెడు కామక్రోధాదులను సత్యముగా నాశము చేయవలయును. ఈశ్వరుడు సకల జీవులందును సమముగా నుండువాడు, పక్షపాతము లేనివాడు; జీవులు చేయు పుణ్యపాపములకు తగినట్టుగా వారివారికి సుఖదుఃఖములు గలిగించుచుండును. పుణ్యాత్ములను రక్షించుచు పాపాత్ములను శిక్షించుచుండును. ఐతే దుర్మార్గ

డగు బిడ్డను తండ్రి శిక్షించుటవాడుబుద్ధిమంతుడుగావలయుననుకారు ణ్యముచేత నేగాని, వానియందలి క్రోధముచేత గాదు, అట్లుఈశ్వరుడు దుర్మార్గుడగు జీవుని శిక్షించుట వానియందలి కారుణ్యమువల్లనే గాని అది పక్షపాతకము గాదు; కల్పవృక్షములు అగ్ని, చంద్రుడుఇవి తమ్ము ఆశ్రయించినవారికే దరిద్రమును శీతమును దాహమును పోగొ ట్టును. ఆప్రకారమే భగవంతుడు ఆతనిని ప్రార్థించువారికే మోక్ష కారణమగు బ్రహ్మజ్ఞానమును గలిగించునుగాని తక్కినవారికి గలిగింప జాలడు.

82. శుక-ప్రశ్న.—రాజేంద్రా! కర్మమువలన మోక్షమా; లేకజ్ఞానము వలన మోక్షమా?

జనక-ఉత్తర.—ఋషిపుత్రా! [శ్లో కర్మణా కేచిదిచ్ఛంతి-కైవల్యం మునిసత్తమ। తే మూఢా ముని శార్దూల-ప్లవా హ్యేతా ఇతి శ్రుతిః] అనెడు సూతసంహిత లోనివాక్యముకీత్రిగాకొందఱు సత్కర్మానుష్ఠానమువలన ముక్తిపొంద వచ్చునని చెప్పుదురు వారుమూఢులేకానిజ్ఞానులుగాజాలరు, ఒకమను ష్యుని పలాని వాడని తెలిసికొనవలనంటె వాని అడియాలము గుర్తె ఱిగిన వెనుక వాడు పలానివాడని కనిపెట్టవచ్చునుగాని అది విడిచి పెట్టి తలక్రిందుగా బడినను, భూమియంతయు తిరిగివచ్చినను వానినికని పెట్టజాలరు. అట్లు తన్నుతానెఱుగుటకు జపతపాదికర్మానుష్ఠానముల వలనసాధ్యపడదు ఐతే వేదాంతవిచారణ చేయుటవలన ఆత్మస్వరూపు డగుతనలక్షణమును దెలిసి తానేబ్రహ్మమనిఆనందించుచు ముక్తుడగు చున్నాడుగానజ్ఞానమువల్లనేముక్తి గలుగును, [శ్రుతి॥ జాగ్రత్యేవ సుషు ప్తస్థః-శరుక శ్మాశివై ద్విజ।అంతస్సర్వపరిత్యాగీ-బహిః కుర్వయథాగతమ్] అనెడి అన్నపూర్ణోపనిషత్తుగారీత్రిగాను[శ్రుతి సత్కర్మపరిపాకతో బహూనాంజన్మనా మంతే।నృణాంమోక్షేచ్ఛా జాయతే] అనెడుపైంగాలోపనిషత్తురీత్రిగాను, [శ్లో। కర్మణా జ్ఞానవాఙ్ భూత్వా-జ్ఞానేనా నందమాప్నుయాత్ । జ్ఞానాదేవతు కైవల్య-మితి వేదవిదాం వరాః।] అనెడు లింగపురాణశ్లోకమురీత్రిగాను, జప తప వ్రత దాన ధర్మ ఉపాసాది సత్కర్మములు నిష్కామ్యముగాజేసిన యెడల ఆసత్కర్మానుష్ఠానమువలన ఈశ్వరభక్తియు చిత్తశుద్ధియుగలు

గును; అట్లు చిత్తశుద్ధిగలుగుటవలన తత్త్వవిచారణచేయ ప్రయత్న పడును; తత్త్వవిచారణచేయుటవలనజ్ఞానమునపొంచి,[శ్లో॥ ఐక్యజ్ఞానం యదోత్పన్నం-మహావాక్యేనచాత్మనః। తదావిద్యాస్వకార్యైశ్చనశ్యత్యేవనసంశయః అనునట్లుబ్రహ్మమేతాను, తానేబ్రహ్మముఅనెడిఐక్యజ్ఞానముగలుగుట వలన ముక్తిగలుగుననుచు మఱియు జనకమహారాజిట్లనియె,

గురుపుత్రా! తల్లిగర్భమునందుండి శిశువు బుట్టినట్లు బ్రహ్మము నందుండి జగత్తుపుట్టెననుట ఆరంభవాదము ఐతే తల్లి వేఱుగాను శిశువు వేఱుగాను ఈ రెండు ఖండపదార్థములుగాను ఉండునట్లు. జగత్తు వేఱు గాను బ్రహ్మమువేఱుగాను ఖండపదార్థములుగా లేదు కాబట్టి ఈయా రంభవాదము సరిగాదు. ఐతే, పాలు వేఱుగాను పెఱుగు వేఱుగాను లేక, పాలే పెరుగైనట్లు, బ్రహ్మమే జగత్తుగా నయ్యె ననుట పరిణామవాదము పాలురూపము చెడిపెరుగైనట్లు, సచ్చిదానంద మగు పరబ్రహ్మము చెడి అనృతజడదుఃఖముగా నుండు ప్రపంచము గా లేదు, కాబట్టి ఈ పరిణామ వాదము సరిగాదు. మన్ను దాని నిజరూపము చెడకయే కుండగా నైనట్లు బ్రహ్మము రూపము చెడకయే జగత్తుగాదోచెననుట కార్యకారణవాదము ఐతే మన్ను వికారపడియే కుండ కావలయును అట్లు నిర్వికార పరబ్రహ్మ ము వికారపడి జగత్తుకాలేదు. కాబట్టి ఈకార్యకారణవాదము సరిగాదు. సూర్యుడు వికారపడకయే జలమునందు ప్రతిబింబించునట్లు, బ్రహ్మము యొక్క ప్రతిబింబమే జగత్తనుట బింబ ప్రతిబింబవాదము ఐతే సూర్యుడు ప్రతిబింబించుటకు జలము ఆధారముగానున్నది, అట్లు బ్రహ్మముప్రతిబిం బించుటకు దానికి మఱియొకఆధారము లేదు, కాబట్టిబింబప్రతిబింబన్యా యము చెల్లదు. ఏది మఱియొకవస్తువునందుప్రతిబింబించునోఅది పరిపూర్ణ వస్తువు గానేరదు. సూర్యుడు ఒకచోట జలము ఒకచోట నుండుటవలన ఆజలమునందు సూర్యుడు ప్రతిబింబించును గనుక ఈరెండు వస్తువులున్ను పరిపూర్ణ వస్తువులు గాజాలవు. ఆపరిపూర్ణవస్తువులకే ఈ బింబప్రతిబింబ న్యాయముచెల్లును, ఐతే బ్రహ్మము అపరిపూర్ణవస్తువుగాదు, కాబట్టిఈబింబ

ప్రతిబింబవాదము చెల్లదు. ఐతే పరిపూర్ణత్వమునకు దోషములేక శుక్తి యందు భ్రాంతిచేత రజతము దోచుచున్నట్లు బ్రహ్మమునందు భ్రాంతిచేత జగత్తు దోచుచున్నదనుట వివర్తవాదము. ఐతే, శుక్తికి వేఱుగా రజతము దానియందు లేదని పరీక్షించి చూచిన వెనుక ఆశుక్తియందు రజతము దోచుట లేదు; అట్లు బ్రహ్మమునకంటెను ప్రపంచము వేఱుగా లేదని యెఱిగినప్పటికిన్ని మజల ప్రపంచమున్నదనెడి వ్యవహారమున్నదిగాన, ఈశుక్తి కారజిలిముప మానము సరికాదు. ఐతే అసత్తగు ఎండమావులవలె బ్రహ్మమునందు అసత్తగు జగత్తు తోచుచున్న దన్న యెడల యెండమావులందు జలము లేదని తెలిసిన వెనుక అక్కడ జల ముండునట్లు తోచినను, ఆజలమును యెవరున్ను త్రాగినట్లు అనుభవమునకురాలేదు. ఐతే జగత్తులో నేనుజల మును త్రాగితిని, నాకు దాహముతీరెను, ఆజలములో నేనుస్నానము చేసి తిని. అనుచు ఇట్టి వ్యవహారములు అనుభవమునకువచ్చుటవలన ఈయెండ మావులదృష్టాంతమున్ను సరి కాదు ఐతే, స్వప్నమునందు తోచిన జగత్తువలె బ్రహ్మము జగత్తుగా దోచెనన్న యెడల, స్వప్నప్రపంచమెట్లు అసత్యమో అట్లు ఈప్రపంచమున్ను అసత్యమే అగుచున్నది స్వప్నమందు దోచుప్రపంచము మనోసంకల్పమేగాని, అనుభవమునకురానట్లు బ్రహ్మము జగత్తుగ నయ్యెననుటమాయాభ్రాంతి మాత్రమేగాని ఒకప్పుడున్ను బ్రహ్మ ముజగత్తుగా గాలేదు. ఇందువలన స్వప్నప్రపంచమువలె ఈజగత్తు మిథ్య యనువుపమానము సరిగా నున్నది. మునికుమారా! మనస్సేమాయ, మా యయేమనస్సుగాన ఈమాయాభ్రాంతివల్ల నేజగత్తుతోచుచున్నదిగాని సత్య ముగా జగత్తను పదార్థమే లేదు మాయయు దాని కార్యమగు జగత్తును అసత్యమే బ్రహ్మమే సత్యము [శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం-భ్రమేణోపాసకం మనః। భ్రమే శ్వేరభావత్వం - భ్రమ మాత్ర మిదం జగత్॥] అనునట్లు నీవు నేను అను నానావిధ జీవులున్ను, మనస్సు, ఈశ్వరుడున్ను, ఈజగత్తున్ను సకలము మాయాభ్రాంతియే గాని సత్యము గావు. కాబట్టి మీరు సకల సందేహములు మాని భ్రాంతిరహితులై సదాస్వస్వరూపమునందేరమించు చుండుడని బోధింపగా, శుకులవారు పరమానందంబును జెందిజనకమహా రాజుం జూచి, రాజేంద్రా! మహాత్మా! దేవరవారికృపాకటాక్షమువలననే పావనుండనైతిని, సకలసందేహములు నశించెను, నిర్వికారబ్రహ్మస్వరూ

వుండన్నాతిని అనిఅతనిబెక్కువిధములం గీర్తించి అతనికి సాష్టాంగముగా నమస్కరింపగా జనకమహారాజున్ను ఆశుకులవారికి సాష్టాంగముగా ప్రతి నమస్కారములు జేసెను. తర్వాత యిద్దరున్ను కొంతసేపుసంతోషవార్త లాడుచుండిరి. తర్వాత శుకులవారు జనకమహారాజువద్ద సెలవుపొంది ప్రయాణమైనంతనే జనకమహారాజున్నుతనమంత్రిమొదలగువారున్ను కొంత దూరము వెంబడించిపోయి ఆశుకులవారి యనుమతిని జనకమహారాజు తనపరిజనముతోడ మరలి తనగృహంబును జేరెను. తర్వాత శుకులవారు ప్రయాణమై భరతఖండంబునుదాటి వేదవ్యాసులఆశ్రమంబునుచేరివారికి దీర్ఘదండంబులు జేసి, తండ్రీ! దేవరివారి యాజ్ఞప్రకారముగా జనకమహారాజువద్దసకలసందేహమునుపోగొట్టుకొంటిని, దేవరవారుఅనుగ్రహించిన రీతిగా సదా బ్రహ్మస్వరూపుండనై వెలుంగుచున్నానని జెప్పగా, వేదవ్యాసులవారు శుకులవారిని ఆలింగనంబుచేసికొని, వత్సా! ఇకనీవు సదాస్వస్వ



నారదమహాఋషి.



శ్రీశుకమహాఋషి.

నారదమహాఋషి శ్రీశుకమహాఋషికి వుపదేశించుట.

రూపమందే రమించుచుండుమని బోధించిరి. తర్వాతఒకనాడువ్యాసుల వారు ప్రాతఃకాలమున నిత్యకర్మానుష్ఠానములను దీర్చుకొనుటకు గంగా

నదికిం బోయిరి. అప్పుడు శుకులవారు ఆశ్రమంబునందు వేదమునందలిఉపని షద్వాక్యములను చదువుకొనుచుండగా, త్రిలోకసంచారియగు నారదమహా ఋషి ఆస్వరమును వినివచ్చి శుకులవారిం జూచిసంతోషించి, బిడ్డా! నీకేమి కావలయును అడుగు మనగా, శుకులవారు నారదునింజూచి, ఓమహాత్మా! ఈ భూలోకమునందుబుట్టిన మనుష్యులకు ముఖ్యముగా నేది కావలసియుం డునో దానిని అనుగ్రహింపుడనగా నారదుం డిట్లనియె. బిడ్డా! పూర్వము బ్రహ్మమానస పుత్రులైన సనత్కుమారుండు తన శిష్యులకు బోధించిన వాక్యములను నీకు నేను బోధించుచున్నాను. శ్రద్ధతో వినుమని యిట్లనియె. (1) సత్యమే తపస్సు, (2) జ్ఞానమే నేత్రము, (3) సకలపదార్థములందు నిరాశగా నుండుటే పరమసుఖము. అనగా, [పద్యము॥ దొరకని దొరకన్న ననుభవించు దొరకవ మికిజింతనొంది దురపిల్లక నిశ్చయుడై యున్నను ద్రష్టకు। జారవచ్చునె యవని మనము సువత్రశీలా॥] అనునట్లు తనకులభించినపదార్థములతో తృప్తిపొందుచు తనకు లభింపనివానియందు దుఃఖము లేక యుండుటే నిరాశగా నుండు టనబడును. దీనివల్లనే పరమసుఖము గలుగును. (4) మోహమే దుఃఖము. (5) ఈ జన్మమునందు ముక్తిప్రయత్నము చేయకున్నయెడల మఱుజన్మమునందు మోక్షేచ్ఛ గలుగజాలదు. కాబట్టి ముక్తిసాధనంబులను దెలిసి అభ్యసింప నేరక మూఢుడైనవాడు జననమరణదుఃఖసాగరంబున మునిగి అల్లాడుచుం డును. కామక్రోధములు రెండున్ను మోక్షమార్గమునకు ప్రత్యక్షశత్రు వులు, కాబట్టి ఆరెండు నశించె నేని జననమరణములు నశించును, తక్షణమే సత్యముగా మోక్షము సిద్ధించును. మోక్షమునకుగాను ఇతరసాధనము లక్కఱ లేదు. (1) ఇతరులవలన నెద్దియు గోరకుండుట, (2) సర్వప్రయత్న ములను మానుట అను రెండున్ను గలిగిన నరునకు దుఃఖము గలుగదు, మోక్షమఱచేతిలో నుండును, భూతములనుజూడకుండట, ముట్టకుండుట, మాటలాడకుండుట అనునవి మోక్షమును జేరుటకు ముఖ్యమైన సాధన ములు జీవహింస చేయకుండుట, ఇంద్రియజయము, వైరాగ్యము, మనస్సు చంచలము లేక అచంచలముగా నుండుట అనునివి గలవానికి సత్యముగా

మోక్షములభించును. ఈవాక్యములే సనత్కుమారుడు తనశిష్యులకుబోధిం
చినవాక్యములు. ఇవి నీమనస్సులో సదాజ్ఞాపకముగానుంచుకొని తెలివిగల
వాడవై యుండుము. భార్యాబిడ్డలు మొదలగువానియందు మోహముగల
వాడు బురదలోదిగబడునటువంటిఏనుగవలెదుఃఖించుచుండును. భోగము
లందు ఆశ గలవాడు వేటగానివలలో దగులుకొన్న మృగములురీతిగాను
దుఃఖించుచు (ధర్మాధర్మములను విడిచి పెట్టుము.)అనగా జీవహింసనువిడిచి
పెట్టితి వేని అధర్మత్యాజ్యమగును,సంకల్పములునశించినయెడల ధర్మత్యా
జ్యమగునుగాని, దానధర్మములువిడిచి పెట్టిన మాత్రమునధర్మత్యాజ్యము
గా నేరదనుమా. (బుద్ధిబలము చేతసత్యాసత్యములనువిడిచి పెట్టవలయును
అనగా సత్యము చెప్పుటవలన జీవహింస మానహాని మొదలగు పాపకార్య
ములు సంభవించునట్లుండెనా. అప్పట్లో సత్యమాడుటవిడిచి పెట్టవలయును;
అసత్యమాడుట బొత్తిగా విడిచి పెట్టవలయును. మఱియు, సత్య మనగా
ఒకటి యున్నదని నిశ్చయించుట, అసత్య మనగా అది లేదనినిశ్చయించుట
ఈ రెండున్ను బుద్ధియొక్క గుణములు కాబట్టి అవి తాను గానని సదా
నిర్వాసనా మాననిష్ఠయందే యుండవలయుననుట సత్యాసత్యపరిత్యాజ్య
మనబడును. సదా ఆత్మానుసంధానమును జేయుచుండువారికి మనస్సు
తనకు తానే లయించునుగాన, అట్టివానికి ప్రాణవాయువును బిగబట్టినిరం
భించి కదలక మెదలక నిలుపు కర్మయోగాభ్యాసమక్కర లేదు. భయము
దుఃఖము లోకములో నెల్లవారికి గలదు గాని జ్ఞానికి అవిలేవు. ఎట్లనగా;
ఈ భయదుఃఖములు శరీరమునకే గాని శరీరమునకు సాక్షి గానుండు ఆత్మ
స్వరూపుడగు తనకు లేవని సదా బ్రహ్మానందముగా నుండును. శాంతిము
లకున్ను ఇంద్రియములకున్ను దుఃఖించుట. లోకములోని జనులకు గల
దుఃఖమును జూచి వారిదుఃఖమునకుగాను తాను దుఃఖించునట్లుండును,

అని యిట్లు బోధించినంతనే శుకులవారు నారదమహాఋషిని జూచి యి
ట్లనిరి ఓమహాత్మా! ధేసగవారి కరుణాకటాక్షమువలన యదార్థమైన
బోధ జెందితిని, దేవామృతపానము జేసినవారిరీతిగానిత్యతృప్తుండ నైతిని,
నేను పావనుండ నైతిని, ఇకమీాద సదా జ్ఞానమార్గమగు రాజయో
గంబున్ను అభ్యసింపు చుండెదను. అని చెప్పి నారదమహాఋషి ఆశీర్వా

దంబులనుగొని తన తండ్రియగు వేదవ్యాసులవారు గంగానదిలో స్నానము
చేయుచుండు చోటికిం బోయి అతని పాదపద్మములకు నమస్కరించి తన
నిశ్చయజ్ఞానమును అతనికిం దెలిపినంతనే వ్యాసులవారు శుకునిం దృఢ
జ్ఞానమునకు మెచ్చి సంతోషించెను. తర్వాత శుకులవారు వేదవ్యాసుల
వారికి ప్రదక్షిణముగా జుట్టివచ్చి నమస్కరించి, తండ్రీ! ఇక నే నెక్క
డైనను పోయి సమాధినిష్ఠాపరుండుగా నుండెదలయు సెలవిం డనగా
వ్యాసులవారు పుత్త్రునియందలి ప్రేమవలన అతనిం జూచి యిట్లనిరి.
వత్సా! నీవు నా నేత్రములకు పండుగ జేయుచున్నావు. కాబట్టి నీవిప్పుడే
పోవలదు. ఇక కొన్నాళ్లు నావద్దనే యుండుమనగా శుకులవారు మోహము
లేని మహాత్ము లగుటవల్లను, సకలభ్రాంతులు నశించి తాను బ్రహ్మ
జ్ఞానిగా నుండుటవల్లను, తన తండ్రిమాటలకు సమ్మతింపకుండా అచ్చట
నుండి నిలువక తక్షణంబే ప్రయాణమై పోయెను. అంత నా శుకులవారు
సిద్ధపురుషులున్ను సకలదేవతలున్ను వసించునట్టి కైలాసపర్వతంబును జేరి
అచ్చట నిర్జనప్రదేశముగా మిట్టపల్లములు లేక సమముగా నుండు నొక
చోట తూర్పుముఖముగా గూర్చుండి దేహమును కాష్ఠమురీతిగా కద
లక నిలిపి స్వరూపసమాధినిష్ఠ చేయుచుండగా సూర్యుడు తూర్పుదిక్కున
పుదయించెను. అంత శుకులవారు సూర్యుని ఆశ్రయించి అతని వలన
ఆత్మతత్త్వమును చక్కగా విచారించి తెలుసుకొని నిర్వికల్ప సమాధినిష్ఠ
చేయుచుండ నొకానొకనాడు నారదమహాఋషి అచ్చటికి రాగా
శుకుండు అతని జూచి నమస్కరించి ఓ మహాత్మా! దేవరవారి కటాక్షంబు
వలన యోగసిద్ధియు, ఆత్మసాక్షాత్కారంబును జెందితిని, సదా నిస్సం
గుండనై మోక్షస్వరూపుడనై యున్నాను అని చెప్పగా, నారదుండు
సంతోషించి అతనిని ఆశీర్వదించి పోయెను. తర్వాత శుకులవారు గరు
త్మంతునిరీతిగా ఆకాశమార్గమున కెగరగా అచ్చటనుండు సిద్ధపురుషులు
సాధ్యులు మొదలగు దేవతలు శుకులవారిని జూచి ఆశ్చర్యపడుచు,
ఆహా! ఈ మహానుభావుండు అతిశీఘ్రకాలములో మహాయోగ పురుషుం
డయ్యెను. ఇతని మనస్సు నిర్మలముగా నుండుటచేతనో, లేక ఇతనితండ్రి
యందలి భక్తివల్లనో, లేక శ్రీమన్నారాయణుని అనుగ్రహమువల్లనో
అని తోచించుచు అనేకరీతులుగా అతనిం బొగడుచుండగా, శుకులవారు

అచ్చట నుండునట్టి మృగములను పక్షులను కొండలు నదులు తటాకములు వృక్షములు తీగెలు మొదలైన వానినిం జూచి నా తండ్రి యగు వేద వ్యాసులవారు నాపేరు పెట్టి పిలుచుచు నిక్కడికి వచ్చినంతనే మీరందఱు ఓయని పలుకవలయు నని ఆజ్ఞాపించగా అవి యన్నియు సమ్మతించెను; తర్వాత ఆ మహాబ్రహ్మఋషియగు శుకులవారు ఉత్తరదిక్కునుగూర్చి ఆకాశమార్గముగా బోవుచుండగా ఒక మహాపర్వతము మిక్కిలి వున్న తముగా పెరిగి మార్గము నడ్డగించెను. ఆ శుకులవారు పోవువేగమునకు ఆ పర్వతము నిలువజాలక ఘూళిఘూళిగా పొడియై రాలెను. ఇట్లు అణి మాది అష్టసిద్ధులను బొందిన ఆ మహాత్ముని మహిమను జూచి సకలదేవ తలు సంతోషించి యతనిపై పుష్పవర్షమునుగురిపించిరి. తర్వాత ఆశుకుల వారు ఆకాశ గంగనుదాటి బహుదూరముగా బోవుచుండగా అచ్చట నొకచోట కొందఱు దేవతాస్త్రీలు దిగంబరులై ఒకతటాకంబునందిగి జల క్రీడ లాడుచుండిరి. ఆ స్త్రీలు శుకులవారినిం జూచి అతడు మాయను గెలచిన మహానుభావుం డని యెఱింగి కొంచమైనను లజ్జలేక తమ యిష్ట ప్రకారముగా నిర్భయముగా నిర్గుణముగా పరమానందంబుతో జలక్రీడ లాడుచుండిరి. శుకులవారు ఈ ప్రకారము పోవుచుండగా నింతలో వేద వ్యాస మహాఋషి పుత్త్రునియందలి ప్రేమచేత అతని నెడబాసి యుండు టకు తాళజాలక తన యోగమహిమ వలన ఆకాశమార్గంబున కెగసి మహావేగముగా నతని వెదకుచు వచ్చుచుండెను. అది యెఱింగి శుకుల వారు వాయువేగంబుగా బోవుచుండుటను మాని అచ్చట నుండునట్టి సకలభూతములందు అంతర్వ్యాపకుండై అణగియుండెను. పుత్త్రుని వెదకు చుం బోవుచున్న వ్యాసులం జూచి అచ్చట నుండు సిద్ధులు మొదలగు వారు అయ్యా! మీకుమారుండు ఇదిగో నుండు పర్వతమును ధూళీపటల ముగా జేసి దానిందాటి పోయెను. అని చెప్పిరి. అంత నా వేదవ్యాసులవారు తనకు పుత్త్రశోకము విశేషింపగా, హాశుకా! హా నాప్రియపుత్రా! అని యెలుగెత్తి యేడ్చుచు పిలువగా సర్వవ్యాపకుం డగు ఆ శుకులవారు తన మహిమ మఱుగుపడి యుండుటను బహిరంగముగా దెలియునట్లు ఆకా శంబున ఓయని ప్రతిధ్వని గలుగునట్లు చేసెను. అది వ్యాసులవారు అత్యాశ్చర్యపడుచు ఆ కొండశిఖరముపై నిలిచెను. అట్లు కొండపై నిల

బడుచుండు వ్యాసమహాఋషినిం జూచి అచ్చట తటాకంబున దిగంబరులు
గా జలక్రీడలాడుచుండు దేవతాస్త్రీలు జలక్రీడను చాలించి మిగుల సిగ్గు
తో తమతమ చీరలు గట్టుకొనిరి. అప్పుడు వేదవ్యాసులు తనకుమారుడు
ఆదారిగా బోవుచుండు నప్పుడా స్త్రీలు నిర్భయముగా సిగ్గు లేక నిర్వా
ణముగా జలక్రీడలాడుచుండి రని యోగదృష్టిని యెఱింగి తనకుమారుడు
మాయనుదాటి ముక్తుడయ్యె ననియు, తాను మాయకు లోబడి సంసా
రిగా నున్నాడననియు దలంచి సంతోషమును సిగ్గును అధికరించుచుండగా
అచ్చటనే నిలిచి పుత్త్రునిం దలంచి దుఃఖించు చుండెను. అప్పుడు సకల
దేవగణంబులతోడ పరమశివుండు వ్యాసులవారి వద్దకుం బోయి అతనిం
జూచి కృపామతితోడ నిట్లనియె. ఓ మునివర్యా! నీవు పూర్వము పంచ
భూతములరీతిగా మహాబలశాలియగు పుత్త్రుండు గావలయునని వేడు
కొంటివి. అట్టిపుత్త్రుని నీకిచ్చితిని. ఆ పుత్త్రుండు నా మహిమవల్లను, నీతపో
మహిమవల్లను, బ్రహ్మవర్చస్సు గలిగి దేవతలకైనను పొందుటకు అలవి
గాని బ్రహ్మపదమును బొందెను. సూర్యచంద్రాదులు పంచభూతములు
కొండలు నదులు యెంతకాలముండునో అంతవఱకు శుకుని కీర్తియు నీ
కీర్తియు లోకమునందు వినుజనులు పరమానందమును బొందునట్లు
వెలుంగుచుండును గాక అని ఆశీర్వదించి యిట్లనియె. ఓ మునివరేణ్యా!

## దుఃఖనివర్త శ్లోకములు

శ్లో॥ యావత్కాలం కరేకర్మ - తావ త్తిష్ఠంతి జంతవః। తస్మిన్ క్షీణే వినశ్యంతి-
కా తత్ర పరివేదనా॥] ఎందాక కర్మముండుచున్నదో అందాక జీవజంతు
వులు బ్రతికియుండును. కర్మము నశించిన వెనుక శరీరము నశించును. జీవులు
మరణింతురు. అదిసహజముగానుండగా మనము యేలదుఃఖించవలయును.
[శ్లో॥ ప్రాపయా మివ పేశనంతు - కర్మక్షైకత్ర దేహినః। కర్మక్షయే వియుజ్యంతే- కా
తత్ర పరివేదనా॥] కర్మమువల్లనే లోకులు తల్లి గర్భమునుండి భూమిలో బు
ట్టుచుభార్యాబిడ్డలు మొదలగుసంసారముతో గూడియుండుదురు. కర్మము
క్షీణింపగానే వారు వారు వేఱుగా బోవుదురు, కాబట్టి మనమేల దుఃఖించ
వలయును. [శ్లో॥ ఋణానుబంధరూపేణ - పశుపత్నీ సుతాలయః। ఋణక్షయే
క్షయం యాంతి - కాతత్ర పరివేదనా॥] పూర్వమునందలి ఋణమువల్లనేమనకు
పెండ్లాము బిడ్డలు గోవులు మొదలైనవి గలుగుచుండును. ఆ ఋణము

తీరిన తక్షణమే వారు వారు చెప్పక వేఱుగా విడిచిపెట్టిపోదురు, కాబట్టి మనము యేలదుఃఖించవలయును. [శ్లో॥ పక్వాని తరుపర్ణాని-పతంతి క్రమశోయథా । తథైవ జంతవః కాలే - కాతత్ర పరివేదనా. ]ఆయాకాలమునందు చెట్లయందలి పండ్లు కాయలు పూవులు ఆకులు యెట్లు పడిపోవుచున్నవో, అట్లు కాలము సమీపించినంతనే జంతువులు మరణించును కాబట్టి మనమేల దుఃఖింపవలయును. [శ్లో॥ ఇదం కాష్ఠ మిదం కాష్ఠం-నద్యాం వహాతి సంగమమ్ ।సంయోగాశ్చ వియోగాశ్చ- కాతత్ర పరివేదనా. ] ఒకనది ప్రవాహముగా పాఱుచుండగా, ఎట్లు ఒకదేశమునందుండు చెట్లను కట్టెలను కొట్టుకొని వచ్చి మఱియొక దేశమునందుండు చెట్లతో కట్టెలతో చేర్చుచున్నదో, అట్లు కర్మము ఒకచోట నుండువారిని మఱియొక చోటికి దీసుకొనిపోయి చేర్చును అక్కడనుండువార్లతో సంబంధముచేయించును.మరల అక్కడ నుండి ఆ సంబంధము నెడబాపి మఱియొకచోట చేర్చుచుండును, ఇది సహజము. మనమేల దుఃఖింపవలయును.[శ్లో॥ ఏకవృక్ష సమారూఢాః-నానా జాతి విహంగమాః । ప్రభాతే విదిశో యాంతి - కాతత్ర పరివేదనా॥ ]రాత్రి కాలమునందు ఒకచెట్టుమీద అనేక పక్షులు గుంపులుగా గూడి వసించుచు మరల తెల్లవారంగానే ఆ చెట్టు విడిచి అవియవి యెప్పటివలె నానాదిక్కులకు పోవుచుండునట్లు, కర్మవశంబున జీవులు ఈ భూలోకంబున బుట్టి ఒకటిగాగూడి సంసారముచేయుచుందురు. కర్మముక్షీణించినంత నేవారువారు చెప్పక పారిపోదురు, ఇది సహజము. ఇందుకుగాను మనమేల దుఃఖింపవలయును. [శ్లో. మృణ్మయానిచ భాండాని - బహూని వివిధానిచ । భిన్నభాండం పరిత్యజ్య - కాతత్ర పరివేదనా॥ ] మట్టితో చేయబడిన కుండలు చట్లు మనము తీసికొని పోవుచుండగా అందులో నొకటి జాఱి క్రిందపడి పగిలిపోయి నట్లైతే దానినిగుఱించి దుఃఖించినయెడల అదిమరల రాదని యెట్లు ఆ పగిలిన పెంకును పాఱవేయుచున్నామో, అట్లు ఈ జీవుడు వెళ్లిన తర్వాత ఈ దేహమునుదహనముచేయుచుందురు. ఇదియెల్లవారికిసహజము; ఇందుకుగాను మనమేల దుఃఖింపవలయును [శ్లో॥ మాతా యది విషం దద్యాత్ - పితా విక్రయతే విజం । రాజాహరతి సర్వస్వం- కాతత్ర పరివేదనా ]మనకు కర్మము మంచిదిగా లేకపోయెనా మనతల్లికూడా మనకు విషముపెట్టి చంపును. మనతండ్రిన్ని మనలను ఒకరికిఅమ్మి వేయుగలడు, రాజు మన సకలసొత్తులను

అపహరించును; ఇదిసహజము. ఇందుకై మనము దుఃఖింపవలసినది లేదు. నీపుత్త్రునిం జూడగోరుదువేని పుత్త్రునింబోలిన నీడ నీవెంబడి వచ్చునట్లును నీకగుపడునట్లును వరం బిచ్చెదనని అనుగ్రహించి అతనిమనస్సునకు సంతోషంబు గలుగజేసి పంపించెను. అంత వ్యాసుండు తన యథాస్థానంబు జేరియుండెను. తర్వాత చెట్లు తీగలు మొదలగువానియందు సర్వవ్యాపకత్వముగా వ్యాపించియున్న శుకులవాడు యెప్పటివలె తానుతనశరీరములో వ్యాపించి తన నిజరూపముతోడ అచ్చటనే ఒక దివ్యమైన వృక్షంబుక్రింద సుఖాసీనుడై సమాధినిష్ఠ జేయుచుండెను. ఇట్లుండ స్వర్గంబున ఒకనాడు దేవేంద్రుండు తనసభకు రంభను రావించి యిట్లనియె. ఓతరుణీమణీ! శుకమహాఋషి మాయకు లోబడనివాడై తీక్ష్ణవైరాగ్యముతో బ్రహ్మనిష్ఠ జేయుచున్నాడు. అతనివైరాగ్యమును జూడగా నాకు అత్యాశ్చర్యమగుచున్నది. కాబట్టి నీవెట్లయినను అతనివైరాగ్యమును జెఱచినీకు వశముగా జేసికొని అతని నిచ్చటికి దోడ్కొని రావలయునని చెప్పగా, రంభ మిగుల సంతోషముతో నిట్లనియె. దేవేంద్రా! మహాప్రభో! కన్నులు మూసి తెఱచునంతలో ఆశుకమహాఋషి మనస్సుచలించునట్లుచేసిఅతనివైరాగ్యమును భంగపెట్టి ప్రతిదినమున్ను నావెంబడి దిరుగునట్లుగాజేయకుండినయెడల మీావజ్రాయుధముతో నాశిరస్సును ఖండించి వేయుడు. వనములోనుండు ఆఋషిపుత్త్రుని నామాయకు లోబడునట్లు జేసికొని నేజెప్పినట్లు నడుచుకొనునట్లు చేయకుంటే నేను స్త్రీనిగాను అని యిట్లు దేవేంద్రునితో ప్రతిజ్ఞ చేసికొని తాంబూల మెత్తుకొని తనగృహంబునుజేరి ఆనాటిరాత్రి నిండుపున్నమచంద్రుండు ప్రకాశించుచు వెన్నెలు గాయుచుండగా దివ్యవస్త్రాభరణంబులు ధరించుకొని నొసట కస్తూరితిలక మిడి సోగకన్నులకు కాటుకరేఖలుబెట్టి కుచకుంభంబులకు అగరు గంధములంది మేనెల్ల అత్తరు జవ్వాది పూసికొని కొప్పున పరిమళముగల పుష్పములు ముడుచుకొని విడెము వేసికొని కరంబులవీణనుధరించిశుకమహాఋషియుండువనంబునుంజేరిహంసగమనంబులనపహసించువయ్యారంపునడలతోకుచకుంభంబులు బయలుపడకుండునట్లు పయ్యెద సవరించుకొని పాదములందలిగజ్జెలందెలు



రంభ.



శ్రీశుకమహాఋషి.

## శుకరంభా సంవాదము.

ఘల్లుఘల్లు మని రవముచెలంగ వయ్యారంబుతో వచ్చి శుకమహాఋషినిం జూచి నమస్కరించి చిరునవ్వు నవ్వుచు బహుచమత్కారముతోడ నిట్లనియె. స్వామీ! మునిపుత్రా! నాయందు సంపూర్ణకటాక్షముంచి నావాక్యములను ఆలకింతు రని మిమ్మును ప్రార్థించుచున్నాననగా; శుకులవారు నీయభిప్రాయంబును దెల్పు మనగా రంభ యిట్లనియె. అయ్యా! మీరు కందమూలఫలాదులను భుజించుచు ఈ యడవిలో నుండుటవలన ముక్తి గలుగునా? [పద్యము॥ పురుషుండై జన్మించిన। సరసుడుగా నట్టివాని జననము పుడమిం। గిరితోడుత సరివచ్చును। నరులందును ఋషులయందు నరయఁగ శర్మా।] ఋషివర్యా! పురుషుడై పుట్టినందుకు సరసుడుగాకున్న యెడల అతనిజన్మముకొండఱాతివలె నిష్ప్రయోజన మగుచున్నది. [పద్యము॥ ఎందేడెందము గందళింప రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం। జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీదోప నందిందుబో। కెంద్రినింద్రియము ల్సుఖంబు గనునా యింపే పరబ్రహ్మమా। నందో బ్రహ్మయటన్న ప్రాజ్ఞునినంత ర్బుద్ధినూహింపుమా॥] అయ్యా! ఎచ్చటమనస్సు ఉల్లాసముతో అధికప్రీతితో సకలేంద్రియంబులతోడం జొక్కకుండ లోనిదీపమువలె అచంచలముగా పరమా

నందంబుగా నుండునో, ఆ రతిసుఖమే పరబ్రహ్మమునుమా! కాబట్టి యే వేదములున్ను [ఆనందో బ్రహ్మ] అనిపలుకుచున్నవి, అదిమీకు తెలిసియుండును గదా? కాబట్టి రతిసుఖమే బ్రహ్మమగుటవల్లనే హరిహరబ్రహ్మాదిసకలదేవతలున్ను సకలఋషులున్ను సదా భార్యతోడఁగూడి సుఖించుచున్నారు. మీరున్ను అట్లు సఖితోడఁగూడి సుఖించక వృథా ప్రయాసతో ఇట్లు నిర్జనంబగు అడవిలో కష్టపడుటవలన ముక్తిగలుగునా; అనగా శుకులవారు సుందహాసము జేయుచు నిట్లనిరి, [పద్యము॥ తరుణీమణి యీకాయము స్థిరమా క్షణభంగురంబు స్థితిగా జెపుదుగా। స్థిర జడివి గానవప్పుడు। నరకంబని యంద్రుడు బుధులు నాతులపొందుల్॥ పద్యము॥ నీటిమీదబుగ్గ నెలత యీదేహంబు తేటమాటలుడిగి బోటివినుము। పోటుకొంప కేల పాలతి యీమోహంబు। నూటిదెలియలేవు సుందరాంగి ]ఓ తరుణీ! ఈ దేహము నీటిబుగ్గవలె స్థిరముగానిది. చూచుచుండగానే నిమిషములోపల నశించిపోవును. ఇట్టి నవరంధ్రములుగల ఓటికొంపకేల వృథా మోహంబు అయ్యో! నీవు నూటిదెలియకున్నావే. [శ్రుతి కేశకజ్జలధారిణ్యో-దుస్పర్శాలోచనప్రియా। దుష్కృతాగ్ని శిఖా నార్యో-దహంతి తృణవన్నరమ్। జ్వాలితా అతిమాత్రేపి-సరసా అపి నీరసాః। స్త్రియోహి నరకాగ్నీనా-మింధనం చారుదారుణమ్।] అనునట్లు నల్లని కాటుకరేఖలను కన్నులకు బెట్టుకొనియుండు స్త్రీలు చూచుటకు సుందరవంతులుగా నున్నను వారిని అంటరాదు; అగ్నికట్టెలనుగాల్చి భస్మముగా జేయునట్లు వారు పురుషులను దహించి పాడుచేయుదురు; దూరముగా నుండునప్పుడే దావాగ్నివలె రగులుచుందురు; చూచుటకుసరసులుగానున్నను యెందుకుకొరగాని వారే. నరకాగ్ని రగులునట్లు చేయుటకు కట్టెలు స్త్రీలుగా నున్నారు. [శ్రుతి కామనామ్నా కిరాతేన-వికీర్ణా ముగ్ధచేతసః। నార్యో నరవిహంగానా-మంగబంధన వాగురాః।] అనునట్లు ఓ తరుణీ! మన్మథుడనెడు మేటికిరాతకుడు పురుషులనెడి పక్షులకు స్త్రీలనెడి వలవేసి పట్టి బాధించుచున్నాడు. [శ్రుతి। జన్మపల్వల మత్స్యానాం - చిత్తకర్దమచారిణామ్। పుంసాం దుర్వాసనా రజ్జు-ర్నారీ బడిశ పిండికా। సర్వేషాం దోషరత్నానాం-సుసముద్గికయా-నయా।] అనునట్లు జన్మమనెడు గుంటలో చిత్తమనెడిబురదలో సంచరించు పురుషులనెడి చేపలను దుర్వాసనయనెడి దారముతో గట్టిన స్త్రీలనెడి గాలమునువేసి మన్మథుడనెడి బెస్తవాడు పట్టి మోహాగ్నిలో వండుచున్నాడు. కాబట్టి ఇట్టి స్త్రీలను విడిచి పెట్టినవారే ధన్యులు సుమా

[శ్రుతి॥ ముఃఖశృంఖలయానిత్య-మలమస్తు మమ స్త్రియా। యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిః-స్త్రీకస్య క్వభోగభూః। స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం-జగత్త్యక్త్వా సుఖీభవేత్॥] అనునట్లు ఓరమణీ! స్త్రీలు పురుషుల కాళ్లకు సంకిళ్లు వంటివారు, ఎవనికి స్త్రీ గలదో వానికే భోగేచ్ఛ గలదు. స్త్రీ లేనివానికి భోగేచ్ఛ యెక్కడిది? స్త్రీలయందలి మోహమును విడిచిపెట్టినవానికి సదా బ్రహ్మానందముగా నుండును. [శ్రుతి త్రిఃధం స్స్యైత-ద్వారం నాశనమాత్మనః। కామక్రోధ స్తథా లోభ-స్తస్మా దేతత్త్రయం త్యజ॥ శ్లో॥ ఏతైర్విముక్తః కౌంతేయ-తమోద్వారై స్త్రిభిర్నరః। ఆచరన్నాత్మన శ్రేయ-స్తతో యాతిపరాంగతిమ్] ఇత్యాదిభగవద్గీతా వాక్యరీతిగా ఓ రమణీమణీ! కామము క్రోధము లోభము ఈమూడున్ను నరకముయొక్క మూడుద్వారములు, కాబట్టి దీనిని విడిచిపెట్టినవాడు తనకు మేలగు కార్యములను, అనగా మోక్షమునకుం దగిన కార్యములను జేయుచుండును. కాబట్టి సన్యాసి నగు నాతోడిపొందు నీకేలపొమ్మనగా, రంభ చిఱునవ్వు నవ్వుచు కామవికారంబును పుట్టించునట్లు చమత్కారచేష్టలు చేయుచు తళుకుచు కులుకుచు కనుఱెప్ప లల్లాడ్చుచు యిట్లనియె. [శ్లో॥ ద్రష్టవ్యేషు కిముత్తమం మృగదృశః ప్రేమ ప్రసన్నం ముఖం - ఘ్రాతవ్యే ష్వపి కిం తదాస్య పవనః శ్రవ్యేషు కిం తద్వచః। కిం స్వాద్యేషు తదోష్ఠ పల్లవరసః స్పృశ్యేషు కింతద్వపు-ర్ధ్యేయం కిం నవయౌవనం సహృదయై స్సర్వత్ర తద్విభ్రమాః॥] ఋషివర్యా! మీరు పిచ్చివారు; భూమిలో పురుషుడై పుట్టినందుకు చిఱునవ్వులొలయు సుందరీమణులను సదా దర్శించుచుండుటే వాని నేత్రములకు ఫలము, స్త్రీల ముఖపద్మమునందలి కమ్మనివాసనను ఆఘ్రాణించుచుండుటే ముక్కు చేసిన, పుణ్యము వారియొక్క తేనెవంటి తియ్యని మాటలను వినుచుండుటే చెవులకు భూషణములు, వారి యధరామృతమును పానముచేయుటే నాలుకకు గౌరవము వారిమేనుతోడ మేనుజేర్చి మెలంగుటే దేహమునకు ఆరోగ్యకరము. అట్టి సుందరాంగులను సదా ధ్యానించుచుండుటె మనస్సునకు పరమానందకరము ఇవియన్నియు పుణ్యాత్ములకే గలుగును గాని తక్కిన వారికిం గలుగజాలదు. [శ్లో॥ కుంకుమపంక కళంకితదేహా - గౌరపయోధర కంపితహారా। నూపురహంస రణత్పదపద్మా-కం నవశీకురుతే భువి రామా॥] మునివర్యా! కుంకుమపువ్వు గలిపిన శ్రీచందనమును అలందియుండు కుచకుంభములమధ్య ముక్తాహారములు నటింప పాదములందు గజ్జె లందెలు

ఘల్లుఘల్లుమని మ్రోగ వొయ్యారంబుగా సంచరించు శృంగారవతులగు స్త్రీలు యెవరిమనస్సును వశపఱచుకొనజాలరు? అనగా పిచ్చివాడు రోగి సన్న్యాసి మొదలగు సకలమైనవారి మనస్సులను చలించునట్లు చేయుదురు గదా ! అని చెప్పగా శుకులవా రిట్లనిరి. [శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపు చేతోభజ శ్రీధరం। పాణిద్వంద్వ సమర్చయాచ్యుత కథా శ్రోత్రద్వయత్వం శృణు। కృష్ణంలోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం। జిఘ్రి ఘ్రాణ ముకుందపాద తులసీం మూర్ధన్న మాధోక్షజమ్॥] అనునట్లు ఓలలనామణీ ! శ్రీరామనామామృతపానము చేయుటే నాలుకకు ఫలము, భగవంతుని దివ్యరూపమును స్మరించు చుండుటే చేతులకు లాభము, భగవంతుని కల్యాణగుణంబులను వినుచుండుటే చెవులకు భూషణము, శ్రీకృష్ణమూర్తి దివ్యరూపమును సదా జూచుచుండుటే నేత్రములకు పరమానంద ప్రదము, భగవంతుని ప్రదక్షిణముగా నమస్కరించుటే పాదములు గలిగినందుకు ఫలము, భగవంతుని పాదములకు సమర్పించిన తులసీదళములను ఆఘ్రాణించుటే ముక్కునకు పుణ్యము, భగవంతుని పాదములందు సోకునట్లు శిరస్సును వంచి నమస్కరించుటే శిరస్సునకు లాభము; నీవు పిచ్చిపిచ్చిగా మాట్లాడుచున్నావే. [శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ శ్లో॥ వశేహి యస్యేం ద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥] అనెడి భగవద్గీతా వాక్యరీతిగా, ఓరంభా!సకల కోరికలను పరిత్యజించుచు తన స్వరూపమందే రమించుచు సంతోషించువాడే జ్ఞానిసుమా ! ఎవనికి సకలేంద్రియంబులు తాను చెప్పినరీతిగా వినునట్లు వశపఱచుకొన్నాడో. వాడే బ్రహానందమును జెందగలడు గాని తక్కినవారు జెందజాలరు. కాబట్టి మేము జితేంద్రియులము, యోగులము మాతో నీకు భోగమేల? నీ మనస్సులో దేనిని సుఖ మని తలంచితివో అట్టి అభిప్రాయమును గల నీవంటివారితో గూడి సుఖంచుటకై పొమ్మని చెప్పగా రంభ యిట్లనియె. [శ్లో॥ చేతోహర శ్చాపలతా ప్రసంగే కావా తథా మానుషలోక భాజాం।యద్దాహ శీలశ్చ పురాన్ విజేతుః తథావిధః పౌరుష మర్ధమాసీత్। [ఓమునివర్యా ! తన నేత్రాగ్నిచేత మన్మథుని దహించి భస్మముగా జేసినట్టి త్రిపుర సంహారి యగు పరమశివుండే అర్థశరీరములో పార్వతీదేవిని భార్యగా నిడుకొని ఆమెతో సుఖించు చున్నాడు. శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితోడను,

బ్రహ్మదేవుడు సరస్వతీదేవితోడను దేవేంద్రుడు ఇంద్రాణితోడను గూడి సుఖించుచున్నారు. ఇట్లు సకల దేవతలున్ను స్త్రీలతో గూడి సుఖించుచున్నారు. మీ ముత్తాత యగు వసిష్ఠ మహాఋషి అరుంధతీదేవి నింగూడి సుఖించెను. మీ రెండవతాత యగు శక్తిమహాఋషిన్ని అలాగే యుండెను. మీతండ్రి యగు వేదవ్యాస మహాఋషి ధృతరాష్ట్రి పాండు మహారాజులయొక్క తల్లు లగు అంబ అంబాలికం గూడి సుఖించెను. ఋష్యశృంగమహాఋషి వేశ్యామిత్రుడు మేనకను, అగస్త్యమహాఋషి లోపాసముద్రాదేవిని, గౌతమమహాఋషి అహల్యాదేవిని, అత్రిమహాఋషి అనసూయాదేవిని గూడి సుఖించుచుండిరి. మహాబ్రహ్మజ్ఞాను లగు జనక చక్రవర్తి, శ్రీరాములు మొదలగు చక్రవర్తులున్ను భార్యలతోడం గూడి సుఖించు చుండిరి. దేవఋషి యగు నారదులవారున్ను భార్యతో గూడి బహ్మజ్ఞాని యగు నారదభగవానులు మెట్లు భార్యతోడం గూడి

నారదమహాఋషి వివాహము.

యుండిరి చెప్పు మనగా రంభ యిట్లనియె. మునివర్యా! పూర్వము నార దుండును తన చెల్లెలికుమారుండు పర్వతమునీశ్వరుండును వీ రిద్దరున్ను భూలోక సంచారము చేయవలయు నని తలంచి స్వర్గలోకమునం దుండి ప్రయాణమై ఒక్కటిగా గలిసి వచ్చుచు దారిలో మన మిద్దరమున్ను మనస్సునం దుండు అభిప్రాయములను దాచక ఒకరితో నొకరు చెప్పు కొను చుండవలయును; అట్లు చెప్పుకొనక దాచిపెట్టితిమేని మనమిద్దఱు ఒకరి నొకరు శపింపవచ్చు నని యేర్పాటు చేసికొని వచ్చి భూలోకం బున సంచరించు ఒకా నొకనాడు సృంజయుం డను రాజేంద్రుని వద్దకుం బోయిరి, ఆ రాజు వారిద్దఱిని శాస్త్రోక్తప్రకారముగా బూజిం చగా వా రా రాజుం జూచి, అప్పా! నీ గృహంబునందు మేము కొన్నా ళ్లుండవలయునని యిష్టమున్నదనగా, ఆ రాజు సమ్మతించి మిక్కిలిసంతో షంబుతో సుకుమారి యనెడి తనకొమార్తెనుం బిలిచి, అమ్మా! ఈ మహాత్ములనుఅధికభయభక్తులతో దేవతలనుపూజించునట్లు పూజించుచు వీరికి సేవలు సేయు చుండు మని ఆజ్ఞాపించి వారికిం గావలసిన పదా ర్థము లన్నియు యిప్పింపగా, వారిద్దరు ఋషులున్ను సంతోషించి అచ్చట

వసించుచుండిరి. ఆ సౌందర్యవతి యగు సుకుమారి నారదమహాఋషి వద్దజేరి సేవలు చేయుచుండగా దాని మనోహరంబైన రూపంబునుజూచి నారదుండు మోహించి కామజ్వరపీడితుండై నానాటికి బలహీనుడై దేహము కృశించి తన యభిప్రాయమును తనయల్లుం డగు పర్వతమహాఋషితోడం జెప్పుటకు సిగ్గుపడి తనలో తాను దుఃఖించుచు తత్తరపడుచుండెను. ఇట్లుముఖమువాడి దేహముకృశించి చింతాక్రాంతుడైయుండు నారదునింజూచి పర్వతుండు యితడు కామవికారముచే పీడింపబడుచున్నాడని యోగదృష్టివలనం దెలిసికొని, మామా! మనము చేసికొన్న ప్రతిజ్ఞను నీవు తప్పిపోతివిగదా! ఈ సంగతి నాకు చెప్పక దాచితివి గదా! నిన్ను శపించెదను కామమును జయించుటకు యెంతటివారికిని సాధ్యముగాదు. అయినను నీ వాకన్యకను కోరక మానవు. కాబట్టినీవా కన్యను పెండ్లిచేసుకొన్నతోడనే ఏముఖము కోతిమూతిగా బోవుగాక అని శపించెను. అందుకు నారదుండు కోపావేశమును జెంది, ఓరీ! పర్వతా! నీవు స్వర్గలోకంబునకుం బోజాలక ఈ భూలోకమునందే అల్లాడుచుందువుగాక అని ప్రతిశాపం బిచ్చెను. తర్వాత పర్వతమహాఋషి అతనిని విడిచిపెట్టి భూసంచారము చేయుచుండెను. నారదమహాఋషి ఆచిన్నదానిపై తనకు గలిగిన మోహమును దానితండ్రియగు సృంజయమహారాజుతోడం దెలిపెను. అందుకారాజేంద్రుండు సంతోషించితనకొమార్తెనుఅతనికిచ్చి వివాహముగావించెను, వివాహమైనతోడనే పర్వతమహాఋషి యిచ్చిన శాపప్రకారము నారదునకు వానరముఖము గలిగెను. అట్లైనప్పటికిన్ని ఆరాజుకొమార్తెకొంచెమైనను తనమనస్సులో అసూయపడక అతనిమన్మధునివంటి వానిగా దలంచి పతిభక్తి గలిగి మిగుల ప్రీతితో అతనికి సర్వవిధముల నుపచారములు చేయుచుండెను, ఇట్లు కొంతకాలము గడచిన వెనుక యేదో ఒక కార్యార్థముగా నారదుండు అరణ్యసంచారమును జేయబోవగాఅచ్చటపర్వతమహాఋషిఅకస్మాత్తుగా జూచినమస్కరించి,మామా! నాతప్పునుక్షమించినాశాపంబునుత్రిప్పరాదా అనియడుగగా, నారదుండు ఓరీ పర్వతా!నీవే కదా శపించితివి, నీవిచ్చినశాపంబును ముందుగాత్రిప్పితివేని తర్వాత నేనిచ్చినశాపంబును బోగొట్టెద నని వాకొనెను. సమ్మ

తించి వారి వారి శాపంబులను నివారించుకొనిరి. అంత నారదుండు తనకు ముందున్న రూపమును పొంది సంతోషించి పర్వతుని వెంటబెట్టుకొని



నారదమహాఋషి.



సుకుమారి దేవి.

సృంజయుని గృహంబును జేరగా నారదునిభార్య యగు సుకుమారి మహాపతివ్రతాశిరోమణి గాన యితడు నాపురుషుడుగాడు, నాపురుషునకు కోతిమూతి గలదు, ఇత డెవ్వడో పరపురుషుం డని ముఖమెత్తి చూడ కుండెను. అప్పుడు పర్వతుండు నవ్వుచు ఓఅత్తా! ఇతడు నీపురుషుడైన నారదమహాఋషియే, ఇతడున్ను నేనున్ను మునుపు ఒకరి నొకరు శపించుకొంటిమి; అందువలన ఇతనికి వానరముఖంబు గలిగెను. నేడు శాపనివర్తి జేసికొంటిమి. కాబట్టి ఇతనికి ముందున్న రూపు గలిగెను. నీవు ఇందుకుగాను సందేహపడవద్దు; ఇది సత్యము అని యా చిన్నదాని సందేహమును మాన్పెను. తర్వాత ఆ యిద్దరు ఋషులున్ను ఆ రాజేంద్రుని యింట కొన్నాళ్లు వసించు చుండిరి. నారదుండు తన మోహము తీరునంతవఱకు ఆ చిన్నదానితో గూడి సుఖించుచు కొన్నాళ్ళు గడచిన వెనుక ఆ యిద్దరు ఋషులున్ను భూసంచారము సేయ గోరి సృంజయ మహారాజుతో వారి యభిప్రాయమును దెలిపి ఆ రాజేంద్రునకు దేవతల కంటెను మిగుల బలశాలియగు పుత్త్రుడొకడు పుట్టునట్లు వరమిచ్చిరి. అట్టి పుత్త్రుడు పుట్టినట్లైతే దేవేంద్రునికి బలము క్షీణించి పోవు నని తలంచి

పర్వతమహాఋషి అట్లు పోకుండునట్లు రాజేంద్రునిం జూచి యిట్లనియె. రాజేంద్రా! నీకు పుట్టు పుత్త్రుడు అల్పాయువుగా నుండగలడు. దేవేంద్రునివలన నీ పుత్త్రునకు కీడు సంభవించు నని చెప్పెను. అందుకు నారదుండు ఆ రాజేంద్రునియందు దయగలవాడై రాజేంద్రా! నీకు పుట్టు పుత్త్రునకు దెవేంద్రునివలన అపాయము గలుగునప్పుడు జాగ్రత్తగా కాచి యుండుము. నీకు మించినట్లైతే నన్ను దలంపుము. అప్పుడు నేనతని దొలగించి నీపుత్త్రునిం గాపాడెదను. నీవు దుఃఖింపవలదు. భయపడకుము. సందేహింపకుము. నీ పుత్త్రునకు మూత్రంబునందును మలంబునందును బంగారు పుట్టుచుండును. వానికి సువర్ణష్ఠీవి యని పేరుపెట్టి కాపాడుచుండు మని సమ్మతిపఱచి తన భార్యయగు సుకుమారినింజూచి, ఓప్రియురాలా! నేను భూసంచారము చేయుటకై యుత్తరవిమ్ము, నీవు తలంచునప్పుడంతా నీకు దర్శనమిచ్చుచుండెద నని చెప్పి దానిని సమ్మతిపఱచి ఆ యిద్దఱు ఋషులున్ను యథారీతిగా భూసంచారము చేయ ప్రయాణమై పోయిరి. అని నారదుని వృత్తాంత మెల్ల జెప్పి శుకులవారినిం జూచి రంభ యిట్లనియె. ఓ మునిపుత్త్రా! అంతటి వృద్ధుడగు నారద మహాఋషికే కామవికారములు గలిగియుండగా, మీరు పసివారు యౌవనపురుషులు మీకు కామము లేకుండునా, నారదులవంటివారే స్త్రీలతో గూడి యుండగా, మీరుమాత్రము స్త్రీలను దూషింపవచ్చునా? అయ్యో! మీ రేల మీ యౌవనమును అడవిలో గాచిన వెన్నెల రీతిగా వృథా జేయుచున్నారు. ఈ వనమున మీ కేమి లాభము గలదు. మీరు స్త్రీసుఖమిట్టిదని తెలియనివా రగుటవలన మీకు మోక్ష మెట్లు గలుగును, నా యౌవనమును జూడండి; అందువలన మీకు లాభము గలుగు నని చెప్పగా, శుకులవారు చిఱునవ్వు నవ్వుచు నిట్లనిరి.

[సీసపద్యము॥ సతితోడ గూడిన జన్మహేతువు చాల, సతితోడ గూడిన జెడునుబుద్ధి। సతితోడ గూడిన సర్వేశు నంటడు, సతితోడ గూడిన సముడు గాడు। సతితోడగూడిన సరసంబు విరసంబు, సతితోడ గూడిన సత్యహారము। సతితోడ గూడిన సౌఖ్యహీనం బగు, సతితోడ గూడ నాశనము నొందు। ననుచు శాస్త్రంబులు గణింప నదియు వినుచు। దరుణి నీపొందు గోరిన వరు-కెల్ల। నరకవాసంబు యమునిచే గొఱతగల్గు। తెలదులను గూడువాడెపో వెఱ్ఱివాడు॥ [సీసపద్యము॥ సంసారమున జిక్కి జాలి నొందుటకంటె, వడవులలో నుండు టదియె మేలు। సంసారమున జిక్కి హింసచేయుటకంటె, నదినిధుల్చూచుట యదియు

మేలు। సంసారమున జిక్కి చాలనొచ్చుటకంటె, సన్న్యాసియైయుండుట జాడ మేలు। సంసారియై కొంత సరసనుండుటకంటె, గురుపాదపద్మంబు గురుతు మేలు। అనుచు వర్తించువారు మహాత్ములెలమి। వారు బ్రహ్మంబు గనుగొన్నవారలవని। దేహమస్థిరమనుచును దెలివిపరులు। తుచ్ఛభోగంబు దలతురే తోయజాక్షి॥ పద్యము। స్థిరమాయీ ద్రేహంబ। స్థిరమనియున్నట్టి మంచి తెలివి పరులు న। ప్పరమపద వాసు లందురు। తరుణీమణి వట్టి మోహతాపం బేలా॥] ఓ రమణీమణి! ఈ దేహము అస్థిర మని తెలిసిన పెద్దలు కామాంధకార ములో దగులుకొనజాలరు. సత్యమైన పరమపదమును జెందుదురు. సతుల పొందు పాపహేతువు గాన మాబోటివారితో నీకేల యీవృథా భ్రాంతి పొమ్మనగా రంభ యిట్లనియె. [పద్యము। మాయలోనశక్తిమహిమతో నెఱిగియు। మాయనంటకున్న మంచిబుద్ధి మాయలోనజిక్కి మాయలేదనుకొన్న। పోవగలదె మాయపుణ్యయోగి॥] ఓ మునిశ్రేష్ఠా! మాయాశక్తిమహిమ నెఱిగి దానితో గలిసియుండుచు మజ్జిగలో నుండు వెన్నరీతిగా దానినంటక నిర్మలముగానుండువాడే జ్ఞాని యనబడుడు. ఈ భూమిలో జన్మమెత్తి మాయలో దగులుకొని నాకు మాయ లేదనుకొన్నంతమాత్రమున ఆ మాయ మిమ్ము విడిచిపో గలదా? [పద్యము మనసు త్యాజ్యమైన మగువలగూడుచు। రతులజొక్కి సత్యవ్రతము నిల్పి। జ్ఞానసరణి తెలిసి జ్ఞానానుభవమంత। ననుభవించుయోగి యాత్మయందు॥] ఓ ముని వర్యా! మనస్సున సంకల్పశూన్యము జేసి భార్యతోడగూడి సుఖించుచు సత్యవ్రతమును తప్పక జ్ఞానమార్గ మెఱింగి ఆత్మసాక్షాత్కార మును జెందియుండువారే రాజయోగులు గాని మీవలె కాయగసరులు తినుచు అడవులందు చరించువారివలె నున్నంతనే ముక్తిగలదా? [పద్యము యజ్ఞముల్సేసిన సుజ్ఞానులేనియు, గోరుదుర్నాతోడికూట మెపుడు। తపములు సలిపెడు తపసులు సేవేళ, గలవరింతురు నాదు కౌగిలికిని। సర్వంబురోసిన సన్న్యాసులైనను ధవళాక్షియనినన్ను దలతు రెపుడు। శాస్త్రసమ్మతులయిన సర్వజ్ఞులందఱు, నాపొందు కన్నను తీపులేదటంచు మదిలోన దలపోసి యాడుకొంచు। నుందు రతిచింత జెందుచు నోమునీశ। నీవు ననుగూడి రతికేళి నెమ్మె నెఱిగి। కరము సుఖియింపు సంతోషకరముగాను॥] ఓమునికుమారా! యజ్ఞములు చేసిన మహాచక్రవర్తులు దేవేంద్రలోకమును జేరి అచ్చట నాతోడి పొందును గోరుచుందురు; తపోధను లయిన మహాఋషు లంద రున్ను నాయాలింగమునకుగాను తత్తఱపడుచుందురు సర్వంబు రోసిన మహావైరాగ్యపురుషు లగు సన్న్యాసు లయినను రంభా! రంభా! అని

నన్నే స్మరింపుచుందురు, సకలశాస్త్ర పారంగతులైన మహాకవీశ్వరులను నాతోడ గూడుటకంటెను శ్రేష్ఠమైన సుఖమేదియు లేదని పలుకు చుందురు; కాబట్టి ఓ మునిపుత్రా! మీరు నన్ను గూడి నాయంచితి లేని బ్రహ్మానందమును బొందగలరు. మఱియు (అపుత్రస్య గతి ర్నాస్తి) అను నట్లు పుత్రులు లేనివారికి సద్గతిలేదు గావున మీరునాతో గూడి మీవంటి పుత్రునిం బడసి సద్గతిం బొందండి యని చెప్పగా శుకులవా రిట్లనిరి.

మేధావి యను బ్రాహ్మణునికథ.

ఓ రమణీమణీ! పూర్వము చతుర్వేదవేత్త యగు పండితుడొకడు మేధావియనెడి బ్రాహ్మణుండుండెను. అతడు తన తండ్రినింజూచి, నాయనా! మనుష్యులకు ఆయుష్కాలము నిండా శీఘ్రముగా పాఱిపోవు చున్నది. కాబట్టి యే ప్రకారము నడచుకొన్న యెడల మోక్షము సిద్ధించును చెప్పు మనగా తండ్రి యిట్లనియె. పుత్రా! మనుజుడువివాహముచేసికొనిపుత్ర సంతానము గలిగినవెనుక యాగాది సత్కర్మములచేత దేవతలంబూజించి తృప్తిజేసి అటుతర్వాత వనంబునకుంబోయి తపస్సుచేసిమోక్షమునుబొంద వలయు ననగా మేధావి తండ్రికిట్లనియె. తండ్రీ! ఇంతకాలమువఱకు మనము బ్రతికియుండగలమని ఆయుష్ప్రమాణముగలదా? తల్లి గర్భము నుండి పుట్టినదినము మొదలు ఒక్కొక్కని మెడమీద మృత్యుదేవత కాచి సమయమును యెదురు చూచుచున్నదనుట యెఱుంగవా? భార్యాబిడ్డ లనెడి సంసారమందు మోహముగలవాడు యెండిపోవుచున్న జలముగల తటాకములోని చేపలరీతిగా నున్నాడు సుమా! అడవియందునిద్రించుచున్న వానిని వ్యాఘ్రము మెత్తుకొని పోవునట్లు సంసార మను అడవిలో అజ్ఞాన నిద్రలో నుండువానిని యముడనెడు పెద్దవ్యాఘ్రము అకస్మాత్తుగా గొని పోవునుగదా! భీతుడు ధీరుడు మూఢుడు పండితుడు బలహీనుడు బలశాలి ముసలివాడు బాలుడు అను భేదములు లేక సర్వజనులను మృత్యుదేవత మ్రింగుచున్నది గదా! సంసారమే మృత్యుదేవతకు నివాసస్థానముసుమా! విరక్తియే మోక్షమునకు కారణము, కాబట్టి సంసార బంధమును ఖండిం చుము తండ్రీ! మోక్షముసత్యవ్రతమువల్లను, మృత్యువుమోహమువల్లను గలుగును కాబట్టి నేను సత్యము నాశ్రయించి సుఖదుఃఖములకు లోబడక పరమశాంతుండనై జననమరణంబు లనెడి ప్రవాహమును దాటి మోక్ష

మును జేరగోరుచున్నాను సుమా![శ్రుతి॥ సమాంస పేశలః పుత్రః-నావిద్వాన్ నవికర్మకృత్ । స్వయం నయతి నస్వర్గం-కిం పునః పితరం తరేత్॥] తండ్రీ!మాంస శరీరముతోడ బుట్టినవాడు పుత్త్రుడు గాడు; భూమిలో బుట్టిన పుత్త్రుడు విద్వాంసుడు గాకున్నను, యాగాది సత్కర్మానుష్ఠానము లేనివాడుగా నున్నను ఆ పుత్త్రునికే స్వర్గము లేదు; అట్లగుటవలన అట్టి పుత్త్రుడు తన తండ్రి నెట్లు స్వర్గపదవిని జేర్చగలడు? నీమాటలు నిష్ప్రయోజనమైనవి. [పద్యము॥ నాకుబ్రజగతియిచ్చునవంగవలవ।దేవబ్రజయయిపోడమెద గాన నేను।నన్ను గను చున్న నది మోక్షణంబు సేయు । నాసపడనట్టునగుట బ్రజాభియుక్తి॥] తండ్రీ! తాను జేయునట్టి పుణ్యపాపకర్మములవల్ల నే తనకు స్వర్గనరకంబులు గలుగును గాని మఱియొకనివలన తనకు సద్గతి గలుగజాలదు. కాబట్టి [శ్రుతి॥ ఆత్మావై పుత్రనామ ఆసీత్।] ఆత్మస్వరూపుడగు తానే తనకు పుత్త్రుడని చెప్పబడుచున్నది గాన నేనే నాకు సంతానముగా నున్నాను. వేఱే పుత్త్రసంతానమువలన నేను సద్గతిం బొందవలయునను భ్రాంతినాకులేదు. కాబట్టితనకు తానే సర్వబంధములను ఖండించుకొని మోక్షంబు జెందవలయును, గాని ఇతరుల సహాయమువలన గలుగజాలదు. కాబట్టి నన్ను నేనెఱింగితి నేని, అనగా ఆత్మస్వరూపు డగు నేనే బ్రహ్మమనియెఱిగితి నేని నాకుమోక్షంబు కరతలామలకముగానుండును. కాబట్టి నేనుపుత్త్రులనుగని వారితోడనుండ వలయు నను కోరిక నాకు లేదు. [పద్యము. వినుపశుయజ్ఞముహింసన।మనంతఫలదంబుగాదహంకృతిసహితం।బనఘా వాఙ్మనసమయం। బను యాగం బిచ్చు నవ్యయానందంబున్॥] తండ్రీ పశువును జంపిచేయుయజ్ఞము జీవహింస కార్యముగాను అహంకార సహితమైనదిగాను వుండును, దానివలన స్వర్గలోక సుఖమును కొంతకాల మనుభవించి మరల భూమిలో జన్మించవలసి యున్నది.[శ్లో॥ రాక్షసాః కలి మాశ్రిత్య-జాయంతే బ్రహ్మయోనిషు।బ్రాహ్మణా నేవ బాధంతే-పరిత్యక్త్వా శిలాగమాః।వృక్షాన్ ఛిత్వా పశూన్ హత్వా-కృత్వా రుధిరకర్దమమ్।బ్రాహ్మణా శయ మిత్యేవంమాస్యంతే రాక్షసాఃకలౌ।]అనునట్లు కలికాలమహిమవలనరాక్షసులే బ్రాహ్మణవంశమునందు బుట్టి ఆబ్రాహ్మణులనే బాధించుచు మేము సోమయాజుల మని పేరుపెట్టుకొని సకలవేదాగమములకు విరుద్ధముగా నడచుకొనుచు చెట్లను నఱికి పశువులను హింసించి రక్తమయముగా

యజ్ఞమును చేయుచు మేమే బ్రాహ్మణోత్తములని చెప్పుకొనుచు తిరుగు
చుందురు. [శ్లో॥ యథా పంకేన పంకాంభః సురయావా సురాకృతం భూతహత్యాం
తథైవైకాం నయజ్ఞైర్మార్ష్టు మర్హతి॥] అను శ్రీ భాగవత శ్లోక రీతిగా తండ్రీ!
కాలిలో నంటుకొన్న బురదను బురదనీళ్లతో కడిగినయెడల పోకుండు
నట్లును, కల్లుకుండను కల్లుపోసి కడిగిన యెడల ఆకుండయందలి దుర్గం
ధము పోకుండునట్లును, జీవహింస యనెడి పాపకార్యము, మరల జీవ
హింసాసహితమగు యజ్ఞములచేయుటచే పోజాలదు. కాబట్టి జీవహింస
సహితమగు యజ్ఞమును జేయు మూఢులుసత్యముగా నరకమునందుదుఃఖ
మనుభవించి మరల భూలోకంబున జననమరణంబులను పొందుచు దుః
ఖించుచుందురు. ఐతే, [శ్లో॥యజ్ఞానా మహంజపయజ్ఞః-అహింసాతుతపోయజ్ఞః॥]
అను శ్రుతులరీతిని వాక్కు చేతను మనస్సుచేతను పరిశుద్ధముగా పరమా
త్మను ధ్యానించు చుండుటే నిజమైన యాగమనియు, తపస్సనియు, చెప్ప
బడుచున్నది గాన ఓ తండ్రీ! కామ క్రోధాదిదుర్గుణంబులను పోనడచి వన
భూమియే ఏకాంతగృహముగా తలంచి ఆత్మస్వరూప మిట్టిదని యెఱింగి
ఆత్మానుసంధానము జేయుచుండుము, అని మేధావి తనతండ్రికి బోధించెను
గాన మాబోటిసన్యాసులకు నీవంటి స్త్రీలసాంగత్యమువలనం బ్రయో
జనము లేదు. [శ్లో॥ యదాసీ దజ్ఞానం స్మర తిమిర సంచారజనితం-తదాదృష్టం నారీమ
యమిద మఖిలం జగదితి।ఇదానీ మస్మాకం పటుతరవివేకాంజన జుషా-సమీభూతా దృష్టి
స్త్రిభువన మపి బ్రహ్మ మనుతే।] ఓ రంభా! అజ్ఞానదశలో జగత్తు స్త్రీమయము
గానే తోచును, ఐతే తత్త్వవివేకమనెడి అంజనంబును నేత్రములకు బెట్టు
కొనుటవలన ఆకామాంధకారమున్ను అజ్ఞానమున్ను నశించి ఈచరాచర
ప్రపంచము సర్వంబును బ్రహ్మస్వరూపముగాతోచును.[శ్లో॥ఆశానామనదీ
మనోరథ జలా తృష్ణా తరంగాకులా । రాగగ్రహవతీ వితర్క విహగా ధైర్య ద్రుమ
ధ్వంసినీ।మోహావర్తసుదుస్తరాతి గహనా ప్రోత్తుంగ చింతాతటీ । తస్యాః పారగతా
విశుద్ధమనసో నందంతియోగీశ్వరాః॥] ఓ రంభా కోరికలనెడి జలమును, తృష్ణ
యనెడి తురంగంబులను అనురాగమనెడి మొసళ్లను, ధైర్యమనెడిచెట్లను
పెలయెత్తకుండా ముక్కుతో పొడిచి పొడిచి పాడుచేయునట్టి విపరీతమనెడు
పక్షులను, మోహమనెడు సుళ్లను, దుఃఖమనెడి గట్లులను గలిగిన ఆశ

యనెడిమహాభయంకరమైనదనిపరిశుద్ధమనస్సుగలయోగీశ్వరులులక్షణములోపల దాటి నిరతిశయబ్రహ్మానందమును అనుభవించుచుందురు. [శ్లో॥ తావన్మహత్వం పాండిత్యం కులీనత్వం వివేకితా। యావజ్జ్వలతి నాంగేషు హతః పంచేషు పావకః॥] ఓ రమణీ! ఎవరెవఱకు కామాగ్నిని జయించి యుందురో అదివఱకే తత్త్వజ్ఞానానుభవమును పాండిత్యమును, బ్రాహ్మణత్వమును వివేకమును వారియందు ప్రకాశించుచుండును. ఇట్లు జయింపకున్న గలుగదు. నావంటి సన్న్యాసితోడ నీవేల పొందు గోరుచున్నావు నీవంటి వారినింగూడి సుఖింపఁబొమ్మనగా రంభయిట్లనియె. [శ్లో॥ మత్తేభకుంభదళనే భువి సంతి ధీరాః - కేచిత్ప్రచండమృగరాజవధేపి దక్షాః। కింతు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య-కందర్పదర్పదళనే విరళా మనుష్యాః॥] ఓమునివర్యా! ఈలోకమున మదించిన యేనుగుతో పోరాడి దాని కుంభస్థలమును జీల్చి వేయునంతటి బలశాలులును, మృగరాజగు సింహమునైనను యెదుట నిలిచి జగడమాడి ఏకపోటులో పొడిచి చంపునంతటి ధీరులును గలరు గాని మన్మథుని జయించువారు లేనేలేరు సుమా. [శ్లో॥ అదర్శనే దర్శనమాత్రకామా-దృష్ట్వా పరిష్వంగసుఖైకలోలా। ఆలింగితాయాం పునరాయతాక్ష్యా-మాశాస్మహే విగ్రహయోరభేదమ్॥] ఋషివర్యా! లోకమునం దెందటి ధీరులకైనను శృంగారవతులగు స్త్రీలను జూడకుండువఱకు యెప్పుడు చూడగలమో అను భ్రాంతి యుండును. చూచిరేని వారియాలింగనంబును గోరుచుందురు, అదిలభించెనేని మరల జో డెడబాయకుండుటం గోరుచుందురు, ఇట్లుండగా మీరు నావంటి సుందరాంగిని గూడి సుఖించకుండుట అతివిచిత్రముగా నున్నది. మీరు వెఱ్ఱివారు గాబోలు. లేకున్న యిట్లేల యీ వనములో గాసిబడుచున్నారు నేను వసించు దేవేంద్రపట్టణంబునకు మీరు వచ్చితిరేని అచ్చట మందాకిని యనెడి ఆకాశగంగానది ప్రవహించుచున్నది. ఆ నదిలో మిగుల మధురమైన జలము పుష్కలముగా పాఱుచుండును. అందు బంగారుతామరపువ్వులు పూచుచుండును. మఱియు ఆనదిలో బంగారు, బురద, బంగారు యిసుకయు కలదు, ఆ నదీతీర్థములో స్నానము చేయువారిని అది పావనులైనవారినిగా జేయును గాన; మీరు ఆ తీర్థములో స్నానము చేసి పరిశుద్ధదేహము గలవారై దివ్యమైన పట్టువస్త్రములు నాభరణంబులు ధరించి స్వర్ణమయం బగు నా గృహంబున మాణిక్యదీపములచే ప్రకాశించునట్టి మేడపై అపరంజికోళ్లుగలిగి ముత్యాల

నుచ్చు లమర్చియుండు మంచముపై హంసతూలికా తల్పంబు నందు గూర్చుండి దేవామృతపానము జేసి దివ్యమైన గంధపరిమళపుష్పతాంబూలములు ధరించి సరసముగా నాతోడ రతిక్రీడలం దేలుచు సుఖింపగలరు

నిజమైన తీర్థములు.

రండని చెప్పగా శుకులవారి ట్లనిరి. [శ్లో॥ బ్రహ్మజ్ఞానహ్రదే తీర్థే - రాగద్వేష మలాపహే। యస్స్నాతి మానసే తీర్థే-సయాతి పరమాం గతిమ్॥] ఓరంభా! మనస్సునందు బ్రహ్మజ్ఞానమనెడి తీర్థములో స్నానముచేసి రాగద్వేషములనెడి మురికిని పోగొట్టుకొని పరిశుద్ధముగా నుండువాడే గొప్పవాడు, అట్టివాడే ముక్తి పొందగలడుగాని గంగా గోదావరీ కృష్ణా మొదలగు నదీ జలములలో స్నానముచేయువానికి దేహమునందలి మురికి పోగలదుగాని జీవసంబంధమగు రాగద్వేషాది మురికి పోజాలదుగాన వారు పరిశుద్ధులు గాజాలరు. [శ్లో॥ ఆత్మసంతీర్థముత్సృజ్య-బహిస్తీర్థంచయో వ్రజేత్। కరస్థం సమహారత్నం-త్యక్త్వా కాచం విమార్గతే ] ఓరంభా! తనలోపలనుండెడి బ్రహ్మజ్ఞానమను మహాతీర్థములో స్నానమును చేయుటను విడిచిపెట్టి ప్రపంచములోనుండు గంగా గోదావరీ కృష్ణా తుంగభద్రా కావేరి మొదలగు నదీతీర్థములలో స్నానము చేయవలయునని పోవువాడు, తనచేతిలోనుండు మాణిక్యమును పారవేసి దారిలోనుండు గాజుకాయి నెత్తి భద్రపరచు మూఢునితో సమానుడగుచున్నాడు. [పద్యము॥ దమమును దపము నహింసయు। శమమును తీర్థములు దాన శౌచాతిశయం। బమలగుణ మగును రిత్తిజ। లములం దోగిన శుచిత్వ లాభముగలదే॥] ఈ పద్యము భారతము అనుశాసనికపర్వంబులో భీష్ముడు ధర్మరాజునకు తీర్థమహిమలు చెప్పుచోట చెప్పబడియున్నది. ఓరంభా! శమదమాదులు, అహింస, నిష్కామ్యమగు తపస్సు ఈమూడున్ను మహాతీర్థములనబడును. అట్టి తీర్థములలో స్నానము జేయువారే పరిశుద్ధులైనవారుగాని, గంగా జలములో స్నానముచేసినవారు పరిశుద్ధులుగాజాలరు. [పద్యము॥ దొరకొనని వాని గోరక। దొరకొనినందున మమత్వదుష్టహృదయతం। బొరయక విగతస్పృహులగు। పురుషులు శుచులేల తీర్థములు వారలకున్॥] ఈపద్యమున్ను భారతము అనుశాసనిక పర్వమున భీష్ముడు ధర్మరాజునకు తీర్థమహిమల జెప్పుచోట చెప్పబడియున్నది. ఓరంభా! దైవాధీనముగా దనకు లభించిన దానిని అనుభవించుచు, తనకు లభింపని దానికి గాను దుఃఖింపక యుండువారే నిరాశగా

నుండు జ్ఞాను లనబడుదురు. అట్టివారే నిజముగా పరిశుద్ధులైనవారు, అట్టి వారికి గంగానదిమొదలగు తీర్థస్నానములు పనికిరావు సుమా! వట్టి జలములోస్నానము చేయువారు పరిశుద్ధులుగాజాలరు. [శ్లో॥ మహీశయ్యాపృథ్వీ విపుల ముపధానం భుజలతావితానం। చాకాశంవ్యజన మనుకూలోయమనిలః॥ శరశ్చంద్రో దీపో విరతి వనితా సంగముదిత-స్సుఖీ కాంత శ్శేతే ముని రతనుభూతి ర్నృప ఇవ॥] ఓ కంబుకంఠీ! మాబోటి సన్న్యాసులకు ఈ మహాభూమియే దివ్యమైన మంచము, మా భుజములే మాకు పట్టెదిండ్లు, ఆకాశమే మంచమునకు మేలుకట్లు, ఈ యడివిలో వీచుచుండు గాలియే మాకు వట్టివేళ్ళ విసనకఱ్ఱలు, ఆకాశములో వెలుగు చంద్రుడే మాణిక్యదీపము, ఇట్టి శృంగార మైన మంచముమీద విరక్తియనెడి భార్యతోడం గూడి చక్రవర్తులవలె మహాదానందముగా నున్నాము గాన, ఇట్టి మాకు నీతోడం బనిలేదు పొమ్ము. సాధారణముగా స్త్రీలు అల్పబుద్ధిగలవారు. పాపవిశేషమువల్ల స్త్రీలుగా బుట్టుదురు గాన, స్త్రీ జన్మమునకంటెను నీచమైనది ఏదియును లేదు. నీవేలవృథాకాలక్షేపము చేయుచున్నావు పొమ్మనగా రంభ యిట్లనియె ఓ మునిపుత్త్రా! మీరు స్త్రీలను మహాపాపాత్ములని చెప్పుచున్నారు; అయితే

## భంగాశ్వ మహారాజు కథ.

పూర్వము భంగాశ్వుడను రాజు తనకు పుత్త్రులు లేనందున పుత్త్రసంతానమునుగోరి అనేకములైన యాగములు చేయుచుండెను. అందువలన అతడు దేవేంద్రుండు గాబోవుచున్నాడని దేవేంద్రుండు ఆ రాజుమీద అసూయగలవాడుగా నుండెను. అట్లు ఆరాజు మహాయాగములు చేసినంతనే అతనికి నూరుగురు పుత్త్రులు బుట్టిరి. ఒకానొకనాడు ఆరాజు వేటాడుటకై అడవికిం బోయి యుండగా అతనియందుండు విరోధమువలన దేవేంద్రుండు నాతనికి దిగ్భ్రమ పుట్టించెను అంత నారాజు దిక్కులు దెలియక బహుదూరము గుఱ్ఱము నెక్కిపోవుచు యెండవేడిమివల్లను మార్గాయాసమువల్లను అలసి నిండా దప్పిగలవాడై జలపానమునకై తటాకమును వెదకుచుం బోయి దివ్యమైన తటాకమును జూచెను. అచ్చట గుఱ్ఱమును దిగి తానును దిగి తటాకమున మునిగి లేచినంతనే తాను స్త్రీరూపముగానుండెను. అదియెఱింగి ఆ రాజేంద్రుండు అహా! మోసపోతిని,

నేను స్త్రీరూపమైతిని అయ్యో! నేను ఉన్నతములైన యాగములుచేసి న్ని నాకర్మ మిట్లాయెనుగదా! అని దుఃఖించి యిక నేను పట్టణంబునకు బోయినయెడల జనులు నన్ను జూచి యేమని తలంతురో, నాభార్యలు యేమని చెప్పుదురో, పుత్త్రులు యేమని యందురో, ఛీ, ఛీ నేను బోవుట సరిగాదు, ఈవనమునందే యుండుట మేలని నిశ్చయించుకొని అచ్చటనే యుండెను. అంత నతనిమంత్రి వెదకుచురాగా అతనిం జూచి, మంత్రీ! నా విధి యీలాగున నున్నదని తన వృత్తాంతమంతయు జెప్పి తన పుత్త్రులకు రాజ్యాభిషేకమును జేయించి తాను వనవాసము చేయుచు ఋషులతోడం గూడి తపస్సు చేయుచుండగా, అచ్చోట నొకఋషి ఆ స్త్రీయందు మోహించి దానిం గూడినంతనే ఆ స్త్రీకి నూరుగురుపుత్త్రులు పుట్టిరి. అంతనా స్త్రీ ఆ బిడ్డలును దోడ్కొనిపోయి పూర్వము తాను రాజుగా నున్న తన పట్టణంబును జేరి పూర్వపుత్త్రులను జూచి బిడ్డలారా! నాకొక ఋషీశ్వరునితోడి కూటమి వలన యిదిగో నూరుగురుబిడ్డలు పుట్టిరి. వీరు నాయందు బుట్టుటవలన వీరిని మీరు సహోదరులుగా దలంచి మీరందరును రాజ్యమును భాగించుకొని సుఖంబుగా నుండుడని చెప్పి విడిచిపెట్టి యథారీతిగా వనవాసము చేయం బోయెను. ఆబిడ్డలు నొకరి కొకరు మిగుల స్నేహము గలిగి రాజ్యభోగంబు లనుభవించుచు సకలశత్రురాజులను జయించి భూమండలమెల్ల యేక ఛత్రాధిపతులై యేలుచుండిరి. దేవేంద్రుం డది యెఱింగి, ఓహో! ఈ రాజునకు విరోధమును నేను చేయగా అది తుదకు వీనికి మేలుగా నయ్యెను. ఇప్పుడు వీనికి యిన్నూరుగురు మహాబలశాలులుగ బిడ్డలు గలిగి రాజ్యమేలుచు మహాయశస్సు పొందియున్నారు. ఎట్లైనను ఈపుత్త్రులను నాశముచేసి ఈరాజుయొక్క వంశమును పాడుగా జేయవలయునని తలంచి ఒక ముసలిబ్రాహ్మణవేషముతో ఆబిడ్డలవద్దకుం బోయి పూర్వ పుత్త్రులం జూచి, ఓ పిచ్చివాండ్రారా! ఎక్కడి తండ్రి ఎక్కడి బిడ్డలు ఎవనికో ఒకఋషికి పుట్టిన బిడ్డలను మీసహోదరు లనుచు జెప్పుకొనుచున్నారే ఇది యెక్కడివింత అని పరిహాసము చేయుచు వారికి హితముగా మాట్లాడి మెల్లగా వారి కొకరికొకరికి విరోధమును బుట్టించినంతనే ఆబిడ్డలు ఒకరితో నొకరు కలహించి మరణించిరి ఈ వృత్తాంతము అడవిలో స్త్రీరూపముతోడ నుండు భంగాశ్వుం డెఱింగి జొమ్మున ముఖంబును మోదుకొనుచు

కన్నీరు వెల్లువలుగా ప్రవహింప కొప్పు జారి పడునట్లు పెద్దగొంతుతో నేడ్చుచుం బోయి చచ్చిపడి యుండు ఆ బిడ్డలమీదం బడి దుఃఖించు చుండగా, అప్పుడు దేవేంద్రుండు ప్రత్యక్షమై ఓచిన్నదానా! నీ వేలయిట్లు ఘోరముగా నేడ్చుచున్నావు నీవు స్త్రీవిగావు. పూర్వము భంగాశ్వుం డను రాజేంద్రుడవు, నీవు జేసిన యాగములవలన నాకు హానిగలుగునని నీయందలి విరోధముచేత నీవు వేటమార్గముగా బోయినప్పుడు నీకు దిక్కులు తెలియకుండునట్లు దిగ్భ్రమ పుట్టించితిని, అప్పుడు నీవు బోయి ఒకతటాకమున మునిగినతోడనే స్త్రీరూపమైతివి. ఇవి యన్నియు నా కపటమాయలవల్లనే జరిగెను. అని వృత్తాంత మంతయు జెప్పగా, అప్పుడా స్త్రీ అధిక భయభక్తులతో నిట్లనియె. దేవేంద్రా! పిచ్చుక మీద బ్రహ్మాస్త్రమా? నావంటి అల్పునిమీద మీ రింతటి చలము పట్ట వచ్చునా? నాతప్పులన్నియు మన్నించుడని వేడుకొనగా దేవేంద్రుండుదయ గలవాడై, రాజేంద్రా! నీవు రాజుగా నున్నప్పుడు పుట్టిన బిడ్డలు నీకు గావలయునా? లేక స్త్రీరూప మైన వెనుక పుట్టిన బిడ్డలు నీకు గావల యునా? ఎవరిని నీవు కోరెదవో వారినిచ్చెదను అడుగు మనగా, ఆ స్త్రీ స్వామీ! మహానుభావా! దేవదేవోత్తమా! నేను స్త్రీరూపముతోడ నుండునప్పుడు గన్నట్టిబిడ్డలే నాకు కావలయు నని చెప్పగా, దేవేంద్రుండు ఓ చిన్నదానా! నీవు ముందు రాజుగా నున్నప్పుడు గన్నబిడ్డలను నీ వేల గోరవైతి వనగా, ఆ స్త్రీ, స్వామీ! పురుషులకంటెను స్త్రీలకే బిడ్డలమీద ప్రేమ విశేషముగా నుండును, కాబట్టి నే నిప్పట్లో స్త్రీనిగానున్నాను గనుక యిప్పుడు నేను గన్నట్టి బిడ్డలే నాకు గావలయు నని చెప్పెను. అప్పుడు దేవేంద్రుడు ఓచిన్నదానా! నీవు నిజము మాట్లాడితివిగాన నాకు చాలా సంతోషమయ్యెను. నీవు ముందు గన్నబిడ్డలను, ఇప్పట్లో గన్నట్టి బిడ్డలను అందఱిని బ్రతికించెదనని వారి నందఱిని బ్రతికించెను. తర్వాత దేవేంద్రుండు ఓచిన్నదానా! నీవు మునుపటియట్లు పురుషరూపమును గో రితివేని యిచ్చెదననగా, అందుకా స్త్రీ యిట్లనియె. [పద్యము: సురతంబున గడు సౌఖ్యడు । పురుషులకన్నను సుఖంబు పొలతులకు సురేశ్వర యట్టగుటను నాకీ। కతవున రమియించి నిలువ వేడుక గలిగెన్.] ఓసురోత్తమా! పురుషులకంటెను స్త్రీలకు రతిక్రీడయందు మిగుల ప్రీతియు సుఖమును గలదు గావున

నాకు పురుషరూప మక్కర లేదు. ఈ స్త్రీరూపము తోడనే యుండు టకు ప్రీతిగా నున్న దనెను. అట్లైతే నీ యిష్టప్రకారముగా సుఖముగా నుండుమని వరమిచ్చి అదృశ్యుండయ్యెను. తర్వాత ఆ రాజు స్త్రీరూపం బుతో రతులం దేలుచు పరమానందంబుగా నుండెను అనుచు శుకుల వారితో రంభ యిట్లనియె. మునివర్యా! సకల సుఖంబులలోపల రతి సుఖంబే విశేషంబు. అంతకంటె యెక్కువైన సుఖ మేదియు లేదు. అట్టి సుఖంబును అనుభవించుటకు స్త్రీలే ముఖ్యహేతువుగా నున్నారు, గాన పురుష జన్మముకంటెను స్త్రీజన్మంబే మేలుగా నున్నది. అట్టి స్త్రీలను మీరు దూషించుట సరిగాదని చెప్పగా శుకులవారిట్లనిరి [శ్లో॥ వేశ్యాహో మదనజ్వాలా-రూపేంధన విదక్షితా। కామభిర్యత్ర హూయంతే-యౌవనాని ధనానిచ॥] అనునట్లు ఓ రంభా! వేశ్యలనెడి మదనాగ్నిలో వారి సౌందర్యమే ఆ యగ్నిని వర్ధిల్లజేయు కట్టెలుగానున్నవి. ఆ వేశ్యలనెడి యగ్నిలో కాముకు లైన పురుషులు తమ యౌవనమును ధనమును హవిర్భాగముగా వేల్చుచు హోమము చేయుచున్నారు, అట్టి పామరులతో నీవు చెలిమి చేయుము. నావంటివానిజోలి నీకక్కరలేదు పొమ్మనగా రంభ యిట్లనియె. [శ్లో॥ వేశ్యాసాందర్శనం పుణ్యం-స్పర్శనం పాపనాశనమ్। చుంబనం సర్వతీర్థాని-మైథునం మోక్ష సాధనమ్॥] అనునట్లు ఓ మునివర్యా! వేశ్యాదర్శనమే మహాపుణ్యము వారి స్పర్శనమువలన సర్వపాపనాశమగును, వారి చుంబనమువలన సకలపుణ్య తీర్థములను పుచ్చుకొన్నంత ఫలము గలుగును వారితోడ గూడుటే నిత్య మైన మోక్షసామ్రాజ్య మని చెప్పియుండగా మీరు నావంటి వేశ్యారత్న ములను దూషించుట సరిగాదని నవ్వుచు చెప్పగా, శుకులవారున్ను మంద హాసములు చేయుచు నిట్లనిరి. ఓ రంభా! నీవు పిచ్చిదానవు, జ్ఞానములేని దానవు, నీవు చెప్పిన శ్లోకమునకు సత్యమైన అర్థమును చెప్పుచున్నాను శ్రద్ధతో విను మని యిట్లనియె. రంభా! (వేశ్య) అన్నను ముక్తికాంత అన్నను ఆత్మయే సుమా! కాబట్టి ఆత్మ అనాత్మవిచారణచేసి అనాత్మగా నుండు దేహాదిప్రపంచము అసత్య మనియు, ఆత్మయే సత్యమైన పరబ్రహ్మ మనియు దెలియుటే మహాపుణ్యము. అందుకే (వేశ్యాదర్శనం పుణ్యమ్) అని చెప్పబడుచున్నది. మఱియు ఆ యాత్మయే తానుగాని, దేహాదిప్రపం చము తానుగాదని దృఢముగా తీర్మానించుటవలన సకల పాపములు నశిం

చును గాన (స్పర్శనం పాపనాశనమ్) అనబడుచున్నది. అట్టి యాత్మరామే తానని తెలిసిన తర్వాత [ఇడాతు గంగా భాగీరథీ - ప్రోక్తా - పింగళాచ యమునా - సుషుమ్నా సరస్వతీ] అను ప్రమాణమురీతిగా ఇడానాడియే గంగానది యనబడును పింగళనాడియే యమునానది యనబడును. సుషుమ్ననాడియే సరస్వతీనది యనబడును గాన ఈ మూడునాడులందును రేచక పూరక కుంభకములుగా సంచరించుచుండు జీవాత్మ యనెడి హంసను దెలిసి సదా పెదవులను బంధించి తదేకధ్యానముగా నుండు సోహంభావమే మహాపుణ్యతీర్థములను పుచ్చుకొన్నంత ఫలమగుచున్నది. కాబట్టి (చుంబన సర్వతీర్థాని) అనబడుచున్నది. మఱియు, ఆత్మస్వరూపు డగు తానే పరబ్రహ్మమనియు, పరబ్రహ్మమే తాననియు అభేదఐక్యమును గుర్తెఱింగి సదా సోహంభావమును మఱచి తదాకారముగా కలిసియుండు సాక్షాత్కారానుభవమే మోక్షము గాన (మైథునం మోక్ష సాధనమ్॥) అనబడుచున్నది. ఓరంభా! ఇట్టి రహస్యంబైన పరమార్థంబును దెలియని పామరులు నీవలెనే విపరీతార్థమును దలంచి నీవంటి వేశ్యాస్త్రీలతోడం గూడుచు తమ ఆయుష్కాలమెల్లను వ్యర్థపుచ్చి తుదకు జననమరణ సాగరంబున మునిగి దుఃఖించుచుందురు. అట్టివారితోడ నీ యిష్టప్రకారముగూడి సుఖింపుము పొమ్మనగా, వారి పరిశుద్ధజ్ఞానమునకు రంభ అత్యాశ్చర్యపడుచు, ఆహా! ఇంతటి మహానుభావునిం గూడి పరమానందంబును జెందక నా యౌవనమెల్ల నిదివఱకు పరులపాలు చేసితిని గదా అని తన మదిలో కొంతసేపు చింతించి మఱియునిట్లనియె. [పద్యము॥ భోగములను యోని భోగంబె సారంబు। రతులలోపల నుపరతియె సుఖము। అమృతములకునెల్ల నధరామృతమె మేలు। దీని నెఱుగువారు జ్ఞాను లరయ] స్వామీ! మునివర్యా సకల భోగంబులందు యోనిభోగమే శ్రేష్ఠ మనియు, రతులలోపల నుపరతియే పరమ సుఖమనియు, దేవామృతము మొదలగు వానికంటెను అధరామృతమే గొప్పదనియు, దీనిం దెలిసి అనుభవించువారే బ్రహ్మజ్ఞానులనియు జెప్పబడి యుండగా, మీరు స్త్రీసంగమంబు పాపహేతు వనుట సరిగా దనగా శుకులవారిట్లనిరి. [శ్రుతి యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః- తేషాం శాశ్వతీ నేతరేషామ్॥] అను శ్రుతిరీతిగా ఈ సకలచరాచర ప్రపంచము యే పరబ్రహ్మమునందుండి పుట్టెనో, ఆ పరబ్రహ్మమే మహాయోని అన

బడును కాబట్టి అట్టి పరబ్రహ్మానుభవమే సకల భోగములకంటెను శ్రేష్ఠమైనది గాన, [భోగములను యోనిభోగంబె సారంబు॥] అనబడుచున్నది. మఱియు, [పద్యము: ఆత్మరతిని మరగి యంతంత నుపరతి। సుఖములను కెలంగి సురుచిరాత్మ। సమరతులను బొంది సంపూర్ణ కామత। రాజభోగి వగును రాజయోగి॥] ఈ పద్యము సీతారామాంజనేయ సంవాదములోనిది, ఓ రంభా! (1) సచ్చిదానంద నిత్యనిర్మల మగు బ్రహ్మమునకంటెను ఆత్మ వేఱుగా లేదని సర్వము బ్రహ్మమనుచు బ్రహ్మానుసంధానము చేయుటే రతి యనబడును. (2) మఱియు ఆత్మకంటెను బ్రహ్మము వేఱుగా లేదనుచు సోహంభావము అనెడు ఆత్మానుసందానమును జేయుటే ఉపరతి యనబడును. (3) బ్రహ్మమే ఆత్మ ఆత్మయే బ్రహ్మమని తెలిసిచేయుసమరసైక్యజ్ఞానానుసంధానమే సమరతి యనబడును, ఈ రతి ఉపరతి, సమరతులే; పరమ సుఖమైనవి గనుక [రతులలోపల నుపరతియె సుఖము] అనబడుచున్నది. దీనిం దెలియక పామరులు స్త్రీలవలన గలిగెడు ఉపరతి సమరతులే సుఖమని తలంచి మోహసాగరంబున మునింగి దుఃఖించుచుందురు మఱియు (అమృతము) అనగా మోక్షము. అది (1) (ధరామృతము) అనగా శివకేశవులయొక్క పదవులగు కైలాస వైకుంఠములను జేరి వారివలె శరీరంబుతోడ నుండు సాలోక్య సామీప్య సారూప్యాది మోక్షము అనియు; (2) (అధరామృతము) అనగా శరీరమై శుద్ధనిరాకారమై స్వయంప్రకాశముగానుండు సచ్చిదానంద పరబ్రహ్మమునందు ఈ ఆత్మ పాలుతోపాలు గలియునట్లు గలిసి అభేదముగా నేక మగు విదేహకైవల్యమనియు మోక్ష మనియు జెప్పబడును. అధరామృతమను మోక్షమే విదేహకైవల్య మనబడును గాన, అదే సకల మోక్షములలోపల శ్రేష్ఠమైనది. ఓ రంభా! ఈ రహస్యార్థంబును దెలియక విపరీతార్థము చేసికొంటివి. [శ్లో॥ బ్రహ్మేంద్రాది మరుద్గణాః తృణకణాః యత్ర స్థితో మన్యతే యత్స్వాదా ద్విరసా భవంతి విభవా స్త్రైలోక్య రాజ్యాదయః। భోగః కోపి సఏక ఏవ పరమో నిత్యోదితే జృంభితే। భోసాధో క్షణభంగురే తదితరే భోగే రతిం మా కృథాః॥] ఓ రంభా! ఏ పరబ్రహ్మమునందు మనస్సు లయించుట వలన బ్రహ్మేంద్రాది దేవతలను గడ్డిపోచవలె అల్పముగా దోచుచుండునో, ఏ బ్రహ్మానందమును అనుభవించుటవలన స్వర్గాది సకల దేవతాలోకము

ళందలి విభవముల భోగములున్ను తుచ్ఛములుగా గనబడు చుండునో, ఆ బ్రహ్మానంద భోగమే అన్నిభోగములకంటెను శ్రేష్ఠమైనది; తక్కిన భోగము లన్నియు క్షణభంగురములు సుమా! [శ్రుతి॥ మాంసపాంచాలికాయాస్తు - యంత్రలోలేంగపంజరే - స్నాయ్వస్థి గ్రంథిశాలిన్యా - స్త్రియః కిమివ శోభనమ్॥ త్వఙ్మాంస రక్తబాష్పాంబు- పృథక్కృత్వా విలోచనే । సమాలోకయ రమ్యంచేత్ - కిం ముధా పరిముహ్యసి॥] ఓ రంభా! ఎముకలు నరములు మాంసముతో జేయబడిన పచ్చి తోలుబొమ్మలైనట్టి మలమూత్రకొంప యైన దుర్గంధము గల స్త్రీలను జూచినంతనే పామరులు భ్రమసి కామాంధకారములోదగులుకొని అల్లాడుచుందురు. ఐతే, అట్టి పామరులు కొంత దీర్ఘాలోచనచేసి చూడని దోషమువలన అట్లు భ్రమించుచున్నారే కాని నిజముగా స్త్రీలు దుర్గంధమైన పచ్చితోలు బొమ్మలే కాబట్టి ఇట్టి స్త్రీలయందు మోహపడుటవలన లాభమేమి గల దని చెప్పగా రంభ యిట్లనియె. [పద్యము॥ ఎవరియందున నీలాగు నెఱుగవచ్చు। జూడు మని రంభ చెప్పెను శుకునితోడ । గర్భమంతయు జీరెను నిర్భయముగ । పరిమళం బయ్యె నప్పుడత్తరుణియందు॥] మునివర్యా! మీరు చెప్పినట్లు మీవంటి నరలోకమునందలి మనుష్యుల దేహములే అట్లు దుర్గంధములుగానుండును గాని, నావంటి దేవతా స్త్రీల శరీరములు అట్లు దుర్గంధములైనవిగాజాలవు; చూడుడని తన కడుపును చీల్చిచూపగా ఆ గర్భము మల్లెపుష్పములు శ్రీగంధము కస్తూరి జవ్వాజి అత్తరు మొదలగు పరిమళ వస్తువులచే నిండి పరిమళించు చుండగా, శుకులవారు సంతోషించి లేచి నిలువబడి ఆహా! రంభా! ఈ భూలోకమునందు నేను దుర్గంధశరీరముతో నరజన్మంబెత్తినందుననే నాకింతటి భక్తి వైరాగ్య యోగ జ్ఞానములు గలిగెవే; దివ్యముగా పరిమళించుచుండు నీగర్భంబునందు నేను బుట్టియున్న యెడల ఇంకామిక్కిలిపరిశుద్ధమైనబ్రహ్మజ్ఞాన వైరాగ్యంబులను గలుగునుగదా; తల్లి! అని చెప్పగా, ఆరంభ శుకులవారిం జూచి యిట్లనియె, మునివరేణ్యా! మహాత్మా! మీవంటి వైరాగ్యపురుషులను నేనెందున్ను జూచినది లేదు. నాకు చాలా సంతోషమాయెను. నేను స్త్రీని గాన మీప్రభావమును దెలియక అహంకరించి చేసిన అపరాధములను క్షమింపుడని అతనికిం బ్రదక్షిణముగా జుట్టివచ్చి సాష్టాంగములుగా నమస్కరించి అతనిఆశీర్వాదంబులను పొంది తన యిష్టము సిద్ధంపనందున బహుదుఃఖముతోడ

స్వర్గలోకంబునకుబోయి చేరెను. తర్వాత శుకులవాడు అచ్చటనుండి వెడలి
అవధూతవేషముతో భూసంచారము చేయుచుండెను. ఇట్లుండగా అర్జు

పరీక్షిన్మహారాజు కథ.

నుని పుత్రుడైన అభిమన్యునకును విరాటమహారాజ పుత్రికయగు ఉత్తర
కును పుట్టిన పుత్రుడు పరీక్షిన్మహారాజనబడు నతడు అప్పుడు హస్తినా
పురమును రాజ్య మేలుచుండెను. ఒకనాడతడు వేటాడుటకై అడవికిం జని
పెక్కుమృగంబులను జంపుచు అందొక మృగంబు తనచేతం జిక్కక పారి
పోవగ దానిని వెదకుచు పోయి అచ్చట నొకచోట నేత్రములను మూసి
కొని బ్రహ్మనిష్ఠాపరుండై యున్న శమీకుండను ఒకమహాఋషినింజూచి
యిట్లనియె. మునివర్యా! నాచేత యేటువడిన మృగంబు అమ్ముతోడ ఈ
మార్గముగా బోయెను, అది యెక్కడ బోయెను, మీరుజూచితిరా? అని
యడుగగా ఆమునీశ్వరుండు బ్రహ్మనిష్ఠాపరుండై మౌనముగానుండుటవలన
ప్రత్యుత్తర మియ్యక నూరకుండెను. అంత నారాజు కోపించి సమీప
మందు చచ్చిపడియున్న సర్పమును తనవింటికొప్పుతో నెత్తి ఆమహాఋషి
మెడలో తగిలించి వేటచాలించి తన పట్టణంబునకు బోయి చేరెను. అటు
తర్వాత నాశమీకమహాముని పుత్రుండగు శృంగిమహాఋషి తన తండ్రి
మెడను సర్పంబు పడియుంటను జూచి కోపావేశంబుతో ఆహా! బ్రహ్మ
నిష్ఠాపరుండై మౌనవ్రతంబుతో పరమసాధుడై యున్న నాతండ్రి మెడను
సర్పంబును తగిలించిపోయిన మహాపాపాత్ముడు ఏడుదినంబులలో తక్షకుం
డను సర్పరాజుచే కఱవబడిచనిపోవునుగాక యనిశపించితనతండ్రిమెడలో
నున్న పామును తీసి పాఱవైచెను. తక్షణంబే శమీకమహాఋషి బ్రహ్మ
నిష్ఠను చాలించి నేత్రములను తెఱవగాశృంగిమహాఋషి అతనికి నమస్క
రించి కన్నీరువిడుచుచు దుఃఖించుచు పరక్షిన్మహారాజుకు తాను శపించిన
వృత్తాంతంబెల్ల చెప్పెను. అంత శమీకుండు చింతాక్రాంతుండైన తన
కుమారునికి ఆ పరీక్షిన్మహారాజు యొక్క సద్గుణంబులనెల్ల వర్ణించిచెప్పి,
పుత్రా! రాజు తనపట్టణమందలి జనులకును మనబోటివారికిని మేలుగోరి
యరణ్యంబున దుష్టమృగంబుల వేటాడ వచ్చెను. అట్టి పరోపకారధురం
ధరుడైన పుణ్యాత్ముని నీ వేల శపించితివి: అని నీతులుబోధించి తనశిష్యుం
డైన గౌరవముఖుం డనువానిం బిలిచి, శిష్యా! పరీక్షిన్మహారాజు వద్దకుం

బోయి యీశాపవృత్తాంతమంతయు నెఱింగించి దీనిం దప్పించుకొనుటకై సదు
పాయంబును వెదకికొనునట్లు చెప్పి రమ్మని పంపెను. అట్లతడు పోయి
చెప్పగా మహాఋషి శాపంబునకై రాజేంద్రుండు వెఱచి సముద్రతీరంబున
ఒంటి స్తంభపు మేడ కట్టించి అందు జేరి విషవైద్యుల తనదగ్గిర నుంచుకొని
వసించుచు చింతాక్రాంతుడై శాపకాలమున నెదురుచూచుచుండె. అట్లుం
డగా శుకులవారు అచ్చటికిం జని ఆ రాజేంద్రునికి సంభవించిన శాపంబు
వలన నతడు మృతుండగునని చింతించి పునర్జన్మశూన్యంబగు మోక్ష
మార్గంబైన బ్రహ్మజ్ఞానంబును భాగవతపురాణముఖంబున బోధించి యథే
చ్ఛం జనియె. ఇట్లుండగా తక్షకుండను సర్పరాజు తన కుమారులం బిలిచి
మీరందరు బ్రాహ్మణవేషంబులతో పరిమళ పుష్పంబుల ఫలములు గొని
పోయి పరీక్షిన్మహారాజునకు బహుమతిగా యిప్పించుడని ఆజ్ఞాపించెను.
అలాగే ఆ నాగకుమారులు బ్రాహ్మణరూపంబులతో దివ్యమైన పుష్పము
లను పండ్లను గొనిపోయి రాజునకు బహుమతిగానియ్యగా ఆరాజేంద్రుండు
ఆ పండ్లలో నొకటియెత్తి వ్రచ్చుచుండగా నందు తక్షకుండు అదృశ్యుం
డగుచు సూక్ష్మమైన ఒక నల్లని క్రిమిరూపంబుననుండుచు తక్షణంబే రక్తవర్ణ
మైన గొప్ప సర్పంబుగ పెరిగి బుసకొట్టుచు విషజ్వాలలం గ్రక్కుచు ఆ
రాజేంద్రునిం గఱచి అదృశ్యుండయ్యెను. తర్వాత ఆ విషాగ్నిజ్వాలలచే ఆ
రాజేంద్రుడున్ను అక్కడ నుండు సకలమైనవారున్ను ఆ మేడతోడ దహించి
పరలోకప్రాప్తులైరి. పరీక్షన్మహారాజు విదేహకైవల్యంబునుం బొందెను.
తర్వాత శుకులవారు మహామేరు పర్వతశిఖరంబును జేరి అందు సూర్య
కాలప్రమాణము రీతిగా వేయిసంవత్సరముల వఱకు నిష్ఠలోనుండి తర్వాత
శరీరమును విడిచి అఖండసచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మంబునందు
అభేదముగా గలిసి విదేహకైవల్యంబును జెందెను.

ఈ పరమపావనమైన కథను జదువువారును వినువారును సకలైశ్వర్యములను జెంది వర్ధిల్లుచు అంత్యంబున సద్గురుపరబ్రహ్మంబు కటాక్షంబున ముక్తినిం జెందుదురు గావుత.

ఇది శ్రీమాన్ పోతులూరి శ్రీ వీరబ్రహ్మముగారి ప్రియశిష్యులగు శ్రీమాన్ శ్రీచెంచు రాజు సద్గురుస్వాములవారికి ప్రియశిష్యులగు శ్రీమాన్ పోకల శేషాచలాహ్వయ సద్గురు స్వాములవారికి ప్రియశిష్యులైన అపరోక్షానుభవి వకుళాభరణ పరదేశిగారిచే రచియింపబడిన శుకబ్రహ్మకైవల్యమను శ్రీశుకమహాఋషి చరిత్రము సర్వంబును సంపూర్ణము.

శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.



అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది చెన్నపురి.